# THE WORLD OF STAMPS

# స్టాంపుల ప్రపంచం

మహాభాష్యం వరాహ నరసింహం ఎం.ఎ., బి.ఇడి.
రిటైర్డ్ జూనియర్ లెక్చరర్ & హెడ్‌మాష్టర్
రాజేశ్వరి నిలయం, 8-43-3, 3వ లైను,
చినవాల్తేరు కాలని, విశాఖపట్నం-23. (AP)

ప్రథమ ముద్రణ :
1990 నవంబరు

కాపీలు : 1000

వెల : రు. 15/-

*For Copies and Trade Enquiries pleace contact,*

**Sri M. V. Narasimham,** M.A., B.Ed.
Rajesawri Nilayam, 8-48-3, 3rd Lane,
Chinawaltair Colony,
**VISAKHAPATNAM - 23.** (A.P.)

ముద్రణ :
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, విజయవాడ-520 004.

# తొలి పలుకు

స్టాంపు కలెక్షను హాబీ సంపన్నులని సామాన్యులని, పిల్లల్ని పెద్దల్ని ఆకర్షిస్తుంది. సన్నిహితం చేస్తుంది. ఇది హాబీలకు రాజు. విదేశాల్లో ఈ హాబీకి యున్నంత ప్రచారం, ప్రోత్సాహం భారత దేశంలో లేదు. దీనికి కారణం ఈ హాబీ ప్రయోజనాలు సామాన్య ప్రజానీకానికి తెలియకపోవడము, ప్రభుత్వ ప్రోత్సాహం నామ మాత్రం అవడము. ఈ హాబీకి సంబంధించిన అనేక విషయాలు చిన్న చిన్న కథా రూపాలలో వ్యవహారిక భాషలో తెలుగు చిన్నారులకు, పెద్దలకు అందిస్తూ, వారు ప్రయోజనాలు పొందాలని ఆశయంతో వ్రాసేను.

ఆంధ్ర రాష్ట్రంలోని పాఠశాలల్లోని లైబ్రరీలు, ప్రభుత్వ గ్రంథాలయాలలోను, ఈ గ్రంథం చోటు చేసుకుంటే ఈ హాబీకి గణనీయమైన ప్రచారం, ప్రోత్సాహం లభిస్తాయని నా మనవి. చిన్నారుల జనరల్ నాలెడ్జికి తోడ్పడుతుంది.

పేపరు, ప్రింటింగు, ప్రచార ఛార్జీలు, రవాణా ఛార్జీలు తారా స్థాయికి చేరుకున్న ఈ పరిస్థితులలో ఈ పుస్తకం విలువ నామ మాత్రమే అని చదువరులు గ్రహించ ప్రార్థన. ఈ గ్రంధ రచనలో నాకు మిగిలేది దక్కేది ఒక్కటే. అది నా ఆశయం నెరవేరు తోందన్న సంతృప్తి. స్టాంపుల ఫొటోలన్నిటిని ముద్రిస్తే, పుస్తక విలువ ఇంకా హెచ్చిపోతుందని వాటిని ముద్రించలేదు.

ఈ గ్రంథ రచనకు అనేక ఫిలటివ్ గ్రంథాలు, వ్యాసాలు దోహదాలయేయి. ఆ రచయితలకు నా మనః పూర్వక కృతజ్ఞతలు. ఈ పుస్తక కవరు పేజీ అందంగా చిత్రీకరించిన శ్రీ వి. ఎస్. ప్రకాష్ గారికి, పుస్తకాన్ని అందంగా ముద్రించిన శ్రీఅరుణోదయ ప్రింటింగ్ ప్రెస్ విజయవాడ వారికి నా కృతజ్ఞతలు.

ఈ పుస్తక విడుదలకు సహకరించిన నా కుమారులకు, శ్రేయోభిలాషులకు, శ్రీ వి. కామేశ్వరరావుగారికి నా అభినందనలు.

యం. వి. నరసింహం
(మహా భాష్యం)
గ్రంథకర్త.

విశాఖపట్నం,
1-11-1990,

# విషయములు

ప్రథమ భాగంలో పోస్టేజి స్టాంపుల ఆవిర్భవము - దేశదేశాల్లో మొదటి స్టాంపులు - స్టాంపుల సేకరణకు దారితీసిన పయనము - స్టాంపు కలెక్షను ప్రయోజనాలు స్టాంపు కలెక్టర్లలో శ్రేణులు - ఫిలటిక్ బ్యూరోలు, కేటలాగులు-స్టాంపుల విభజన-ప్రతిష్ఠాకర స్టాంపులు-ప్రఖ్యాత స్టాంపు విడుదలలు-ముద్రా రాక్షసాలు - సమస్యలు సృష్టించిన స్టాంపులు-స్టాంపులతో విరాళాల సేకరణ తమాషా - స్టాంపు విడుదలలో ఆక్షేపణలు - స్టాంపులపై హెచ్చరికలు - స్టాంపులపై ఆల్కహాలు మజా - సంచలనాత్మక స్టాంపువేలాలు - భారత స్టాంపులపై విదేశీయుల మోజు - స్వదేశీ సంస్థానాల స్టాంపులు - స్టాంపుల సేకరణ, భద్రత, ఆల్బముల ఎంపిక-తీములవారి స్టాంపు సేకరణ - స్టాంపు రైటప్పులు-ప్రఖ్యాత అంతర్జాతీయ ఫిలటలిస్టులు - స్టాంపు మ్యూజియములు - వీటికి సంబంధిత విశేషాలు, గాథలు మున్నగునవి.

ద్వితీయ భాగంలో **1947–1972** సంవత్సరాల మధ్య భారత ప్రభుత్వం వివిధ రంగాలలో విడుదల చేసిన స్టాంపులలో ప్రఖ్యాత ప్రాచీన దేవాలయాలు, మసీదులు, నిర్మాణాలు ప్రముఖ తపోధనులు, కవులు, స్వాతంత్ర్యయోధులు, సంఘ సంస్కర్తలు, అనేక శతాబ్దిలు స్వర్ణ, రజిత, సంవత్సరిక ఉత్సవాలు, స్వర్ణ దేవాలయం (అమృతసర్), సోమనాథ దేవాలయం పునర్నిర్మాణం. గౌహతీ రిఫైనరీ, ఎర్రకోట, గోల్ గుంబాద్, త్రిమూర్తి, నటరాజ, బోధిసత్వ, అశోక స్తంభం, బుద్ధ జయంతి, గాంధీజీకి 'మహాత్మ' బిరుదు నిచ్చిన నరసింహమెహత, 'కాక్టస్ ఆఫ్ ఇండియా'గా పేర్గాంచిన మున్సినెవాల్ కిషోర్ మున్నగువాటికి సంబంధిత కథలు, గాథలు, విశేషాలు.

# ప్రథమ భాగము

## 1. పోస్టలు స్టాంపు

పోస్టేజి స్టాంపులు కొన్ని సంచనాలు కలిగించేయి. కొన్ని చరిత్రలు సృష్టించేయి. కొన్ని రికార్డు విలువలను సంపాదించేయి. మరికొన్నిటి సందేశాలు అద్వితీయం. ఇంత వింతైన పోస్టేజి స్టాంపుల చరిత్ర తెలుసుకొని దానివలన ప్రయోజనాలు పొందవలసిన ఆవశ్యకత ఎంతైనా యుంటుంది కదా? గనుక దీనిని పరిశీలించే ముందు పోస్టలు స్టాంపు (Postal Stamp) మార్కింగు ఎలా ఆచరణ లోకి వచ్చిందో తెలుసుకోవటం సమంజసం. ప్రపంచ పోస్టలు చరిత్రలో 'పోస్టలు స్టాంపు మార్కింగు' ప్రథమ మైలురాయి. 1661లో ఆచరణలోకి వచ్చిన ఈ 'పోస్టలు స్టాంపే', 1830లో 'పోస్టేజి స్టాంపు' ఆవిర్భావానికి దోహదమయింది. అది ఎలా అయినది పరిశీలిద్దాం.

### స్పెషల్ హాండ్‌స్ట్రక్ బిషప్ మార్కు

**(Special Handstruck Bishop mark)**

1661లో పోస్టు మాష్టరు జనరల్ హెన్రీ బిషప్ ఆదేశంపై లండన్ నగరంలో జనరల్ పోస్టాఫీసులో లేఖలు పోస్టు అయిన తేది, నెల సూచించుటకు, అలాగే అచట చేరిన లేఖల తేది, నెల సూచించుటకు ఒక పద్ధతి అనుసరించబడింది. ఒక సున్నా మధ్యలో అడ్డంగా

ఒక గీతగీసి, పై భాగంలో ఆ నెల తేదీని, దిగువ భాగంలో నెలపేరు నోటు చెయ్యాలి. ఈ పద్ధతే 'బిషప్ మార్క్'గా పేరెక్కింది. కాని అందులో సంవత్సరం నోటు చెయ్యలేదు.

1660కి పూర్వం పోష్టుమార్కు చేతితో వ్రాయబడేది. లండన్, ఎడిన్‌బరో, డబ్లిన్ నగరాల్లోను, ఉత్తర అమెరికా కోలనీల లోను బిషప్ మార్కు ఆచరణలో యుండేది. క్రమంగా 1775 నరికి 'స్పెషల్ హాండ్‌స్ట్రక్ బిషప్ మార్కు'లు అన్ని దేశాలు ఆచరణలో పెట్టేయి.

1680లో తపాలాను ఆఫీసులో ఉద్యోగించేసి వ్యాపారిగా మారిన 'విలియం డాకుర' (William dockura) లండన్, వెస్టు మినిస్టర్ల మధ్య 1 పౌను బరువుగల పార్సెళ్ళు, లేఖల సేకరణ (Collection)కు, పంపిణీ అందజేయుట (Delivery)కు, ఒక పద్ధతిని అనుసరించేడు. పార్సెల్‌కి, లేఖకి 1 d ఛార్జీని అతను పంపిన వారి నుండి వసూలుచేసి, "పెన్నీ పోస్టుపెయిడ్" (Penny Post paid) అని సాంకేతిక అక్షరాలుగల ఒక త్రికోణాకార స్టాంపు (ముద్ర)తో, రిసీవింగు హౌసును తెలియజేయుటకు "చేతితో వేసే స్టాంపు" (handstruck stamp)ని ఉపయోగించేడు. ఈ "డోకుర్రా మార్క్" (Dockura mark) ప్రపంచములో ప్రథమ పోష్టలు స్టాంపు. ఈ 'బిషప్-డోకుర్రా' మార్కులతో పోస్టేజీని ముందరగా చెల్లించినది లేదా ఎడ్రసీలనుంచి వసూలు చేసుకోవలసినది తెలియజేయుటంలో బాహాటంగా రకరకాల పోష్టలు సర్వీసులకు దారి తీసేయి.

## 2. పోస్టేజి స్టాంపుల ఆవిర్భవము

పోస్టేజి స్టాంపు పద్ధతి 1830 సంవత్సరంలో గ్రేటు బ్రిటన్‌లో తొలిసారి ప్రవేశపెట్టబడింది. ఈ పోస్టేజి స్టాంపుల ఆవిర్భవమునకు దారితీసిన సందర్భాలు విస్మయం కలిగిస్తాయి. పూర్వం ఉత్తరాలు ప్రయివేటు సర్వీసులద్వారా ఛార్జీలు ముందుగానే చెల్లించే పద్ధతిపై బట్వాడా అయ్యేవి. ఒక్కొక్కప్పుడు ఆ ఛార్జీలు దూరాన్ని

అనుసరించి మారుతూ యుండేవి. అందుచేత ఈ పద్ధతి సామాన్య ప్రజానీకానికి అందుబాటులో లేదని చెప్పవచ్చు.

1830 సంవత్సరములో పోష్టేజి స్టాంపు పద్ధతి ప్రవేశ పెట్టినపుడు ప్రారంభ దశలో ప్రత్యేకముగా ముద్రించబడిన కవర్లను అన్ని పోష్టాఫీసులు విక్రయించేవి. వాటినే ఉత్తరాలు పంపించటానికి విధిగా ఉపయోగించవలసి యుండేది. అంతేగాక ఈ 'అధికార' కవర్లకు బదులు ప్రజలు తమ స్వంత కవర్లను ఉపయోగించటానికి అనువుగా పోష్టలు అధికారులు తమ "అఫీషియల్ ఇంప్రింట్"తో ఒకవైపు జిగురుగల చిన్న 'లేబిల్సు'ను అతికించే పద్ధతి కూడ ప్రవేశ పెట్టేరు. ఈ లేబిల్సే నేటి పోష్టేజి స్టాంపులవలె చలామణి అయేవి. కాలానుగుణ్యంగా ఈ పద్ధతే క్రమబద్ధమై పోష్టేజి స్టాంపుల ఆవిర్భావానికి దోహదమయింది.

## రౌలాండ్ హిల్ - ఫాదర్ ఆఫ్ ది పష్టు పోష్టేజి స్టాంపు

ఆదిలో పోష్టల్ సర్వీసు రేట్లు విపరీతంగా యుండేవి. అయినా రెవిన్యూ మాత్రం హెచ్చుటానికి బదులు తగ్గసాగింది. ప్రభుత్వానికి ఇదో సమస్య అయింది. ఈ పరిస్థితిని మెరుగు పరచటానికి 1835 సంవత్సరంలో "రౌలాండ్ హిల్" అను పోష్టల్ అధికారి పరిశోధనలు చేయ నారంభించేడు. అనేక 'అన్‌పైడ్' (unpaid) ఉత్తరాలు ఎడ్రస్సీలచే తిరస్కరించబడి పోష్టల్ సర్వీసు ఎలా దుర్వినియోగం అవుతుందో కొన్ని సంఘటనల వలన తెలుసుకున్నాడు. ఉదాహరణకు ఒక విచిత్ర సంఘటనను పరిశీలిద్దాం. ఒకసారొక పోష్టుమేన్ ఒక గుడిసెలో నివసిస్తున్న ఒక ఆమెకు ఉత్తరం యిస్తూ పోష్టుఛార్జి ఒక షిల్లింగు చెల్లించమన్నాడు. కాని ఆమె ఆ కవరు విప్పకుండానే విచారంతో తిరస్కరించింది. ఆ సమయంలో ఈ దృశ్యాన్ని చూస్తున్న ఒక దయార్ద్ర హృదయుడు ఆమె దయనీయస్థితిలో యుందనుకొని పేదరికము వలననే ఆమె ఆ ఉత్తరాన్ని తిరస్కరించిందనుకొని ఆమె వద్దు అంటున్నప్పటికీ పోష్టుమేనుకి షిల్లింగు ఇచ్చి ఆమెకు ఆ కవరు ఇప్పించేడు. పోష్టుమేన్ వెళ్ళగానే ఆమె

ఒక షిల్లింగు అనవసరంగా దండగ చేసేడని... ఆ పెద్దమనిషి వైపు చూస్తూ పక్కున నవ్వింది. ఆ పెద్దమనిషి తెల్లబోయేడు. అప్పుడు ఆమె ఆ కవరు విప్పి అందులోని తెల్ల కాగితాన్ని చూపిస్తూ అది తన కుమారుని క్షేమాన్ని తెలుసుకునే సాధనం అని చెప్పింది. పోష్టేజి ఛార్జీలు హెచ్చుగా యుండటం వలన అనేకమంది ఈ విధంగా పోష్టల్ సర్వీసుని "ఉచితం"గా వినియోగించుకోవటం జరిగేది.

రౌలాండ్ హిల్ అనేక పరిశోధనలు గావించి ప్రజానీకానికి చౌకగా పోష్టల్ సర్వీసు అందజేస్తే దుర్వినియోగాలు అరికట్టు తాయన్న నిర్ణయానికి వచ్చేడు. ఈ పరిశోధనల ఫలితంగా లండన్ నుంచి ఎడిన్‌బరోకి ఒక వుత్తరం పంపించడానికి 1/36 పెన్నీ అవు తుందని నిరూపిస్తూ, 1837 సంవత్సరంలో "పోష్టల్ రిఫారమ్" అనే ఒక ప్రణాళికను తయారు చేసేడు. దాని ప్రకారం దూరంతో నిమిత్తం లేకుండా ఉత్తరాన్ని పంపించటానికి 'విధిగా' ముందుగానే పోస్టేజీ చెల్లించే పద్ధతి ప్రవేశపెడ్తూ, ఒకే 'యూనిఫారం' రేటు యుండాలని ప్రతిపాదించేడు. పోస్టేజీ ముందుగా చెల్లించినట్లు తెలియ చేయుటానికి కవరుపై స్టాంపును ముద్రించాలని సూచించేడు. స్వంత కవర్లు ఉపయోగించా లనుకున్నవారు "లేబిల్స్" అతికించాలని ఉదహరించేడు. స్టాంపుని సులభంగా వాడటం, ఫోర్జరీకి అతీతంగా యుండటం, పరిశీలన అవకాశాలు బాగా కలిగి యుండటం, తయారీ ఖర్చులు మున్నగు అంశాలు ఇతి వృత్తంగా వ్యాసరచన పోటీని 1839 సంవత్సరంలో నిర్వహించేరు. ఈ పోటీలో 2600 మంది పాల్గొన్నారు. కాని వాటిలో ఏ ఒక్కటి స్టాంపు డిజైనుకు ఉపయో గించటం జరగలేదు. చివరకు 1840 సంవత్సరం జనవరి 10వ తేది నాటికి 1/2 ఔన్సు బరువునకు దూరాలతో ప్రమేయం లేకుండా ఒక షిల్లింగు యూనిఫారమ్ రేటు నిర్ణయించి అమలుపరచటం జరిగింది. మిస్సర్స్ పెర్కిన్స్ బేకన్ అండ్ కో వారితో రౌలాండ్ హిల్ సంప్రదించి, వారి సహాయంతో ప్రపంచానికి మొట్టమొదటి స్టాంపుగా పేర్గాంచిన "పెన్నిబ్లాక్" (penny black)ను, "టుపెన్సుబ్లూ" (two pence blue) 1840 సంవత్సరం మే నెల 6వ తేదీన ప్రవేశపెట్టి, "ఫాదర్ ఆఫ్ ది ఫస్టు పోష్టేజి స్టాంపు" (father of the first postage stamp)

అన్న ఘనతను దక్కించుకున్నాడు. ఈ స్టాంపులు జిగురు కలిగి యుండుటచే ప్రజానీకం వీటినే వాడటానికి ఇష్టపడేరు.

## 3. దేశ దేశాల్లో మొదటి స్టాంపులు

1840లో బ్రిటిషువారి ప్రయోగం విజయవంతం కాగానే ప్రపంచంలోని ఇతర దేశాలుకూడ పోస్టేజి స్టాంపుల విడుదలలో పోటీ పడసాగేయి. 1843 సంవత్సరంలో బ్రెజిల్ తమ స్టాంపుల్ని ముద్రించి విడుదలచేసి ద్వితీయ స్థానాన్ని అలంకరించింది. ఈ సంవత్సరంలోనే జూరిచ్, జెనీవా కాంటన్లు తమ స్టాంపుల్ని విడుదల చేసేయి. 1845 సంవత్సరంలో బాసిల్ కాంటను, అమెరికా (పోష్టు మాస్టర్లు). 1847 సంవత్సరంలో అమెరికా (ప్రభుత్వం), ట్రినిడాడ్ మార్షియస్‌లు, 1848లో బర్ముడా, 1849లో ఫ్రాన్సు, బెల్జియం, బవేరియా దేశాలు తమ తమ మొదటి స్టాంపుల్ని విడుదల చేసేయి. 1850 సంవత్సరం నుంచి దాదాపు ఇతర దేశాలన్నీ తమ స్టాంపుల్ని విడుదల చేసేయి.

1850-1967 సంవత్సరాల మధ్యకాలంలో సుమారు 530 దేశాలు, కాంటన్లు, ఇండియాలోని స్వదేశీ సంస్థానాలు తమ ప్రథమ స్టాంపుల్ని విడుదల చేసేయి. ఆయా దేశ స్టాంపుల సేకరణ ఎంత వ్యయ ప్రయాసలతో కూడుకొనియుందో ఊహించవచ్చు. అన్ని దేశాల స్టాంపుల్ని సేకరించ గలిగిన స్టాంపు కలెక్టరుకు జోహార్లు అర్పించవలసినదే!

## 4. భారతదేశ తపాలా చరిత్ర

భారతదేశంలో తపాలా పద్ధతి మొదటనుంచి ఒక ప్రత్యేకత కలిగియుంది. అనాదినుండి ఉత్తరాలు పంపించు పద్ధతి వివిధ రీతులలో యుండేది. రాజులు, సామంతరాజులు, సేనా నాయకులు యుద్ధ సమయాల్లో సైన్యాల్ని నడపటానికి గూఢచారుల ద్వారా రహస్య సమా

ఫీసులో ఉత్తరాలను పోస్టు చేసేముందు పోస్టేజి చెల్లించాలి. డబ్బు ఇచ్చిన తరువాతనే ఆ ఉత్తరాలపై "పోస్టుపెయిడ్", అనిగాని, "పూర్తిగా పోస్టుపెయిడ్" అనిగాని కాన్సిలేషన్ ముద్ర వేయబడేది. పోస్టేజీని ముందుగా చెల్లించని ఉత్తరాలపై "బేరింగ్" అనిగాని, "పోస్టు నాట్ పెయిడ్" అనిగాని 'అన్ పెయిడ్' (unpaid) అనిగాని ముద్ర వేసి ఎడ్రసీ వద్దనుంచి ఆ పోస్టేజి వసూలు చేయబడేది. **1775** సంవత్సరంలో "బిషప్ మార్కు" హేండుస్ట్రక్ స్టాంపు (Handstruck stamp) ప్రవేశ పెట్టడంతో పోస్టల్ పద్ధతిలో మార్పులు వచ్చేయి. ప్రభుత్వం పోస్టలు సర్వీసుని చేపట్టినా, ఇంకా ప్రయివేటు పార్టీలు పోటీగా తపాలాలను చేర్చే వ్యాపారం కొనసాగుతూనే యుంది. **1837** సంవత్సరంలో "పోస్టాఫీస్ ఆక్టు" (Post office act)తో ప్రయివేటు పోస్టలు సర్వీసులకు స్వస్తి చెప్పటం అయింది.

క్రమేణ పోస్టలు పద్ధతిలో అనేక మార్పులు వచ్చేయి. ఓడ రేవులగు మద్రాస్, కలకత్తా, బొంబాయిలలో పెద్దపెద్ద పోస్టాఫీసులు స్థాపించబడ్డాయి. "స్పెషల్ హేండుస్ట్రక్" స్టాంపులు ఆ దేశాలు పంపటానికి, రిసీవు చేసుకుందికి అనువుగా ప్రవేశ పెట్టబడ్డాయి. స్టీమర్లపై వెళ్ళవలసిన తపాలాలకు "స్టీమ్‌లెటర్స్" (Steam letters), "షిప్ లెటర్" (Ship letter), "ప్యాకెట్ లెటర్" (Packet letter) అనే మార్కులు, పట్టణాల పేర్లు డిస్పాచి రిసీట్ల తేదీలతో సహా నోటు చేయబడేవి. ప్రభుత్వ ఉత్తర ప్రత్యుత్తరాలకు "ఫ్రీ" (Free), అనే మార్కు వేయబడేది. దీనితో భారతదేశంలో పోస్టలు పద్ధతి ఒక కొలిక్కి వచ్చిందని చెప్పవచ్చు.

కాలం గడిచిన కొలది భారతదేశంలో ఇతర ప్రాంతాలకు, విదేశాలకు తపాలు పంపుటలో అనూహ్యమైన మార్పులు వచ్చేయి. రానురాను తపాలా చార్జీలు ఏకరీతి (Uniform)గా యుండాలన్న అవసరం కలిగింది. సింధురాష్ట్ర కమీషనరుగా పనిచేస్తున్న సర్ బార్టిల్ ఫ్రీరీ (Sir bartle frere) **1852** సంవత్సరంలో ముందుగా పోస్టేజి చార్జీలు వసూలు చేయటానికి "సిండిడాక్స్" (Seinde dawks) అను పేపరు స్టాంపుల్ని ముద్రింపచేసి విడుదల చేసేడు. ఈ 'సిండి

ఫీసులో ఉత్తరాలను పోస్టు చేసేముందు పోష్టేజి చెల్లించాలి. డబ్బు ఇచ్చిన తరువాతనే ఆ ఉత్తరాలపై "పోష్టుపెడ్", అనిగాని, "పూర్తిగా పోష్టుపెడ్" అనిగాని కాన్సిలేషన్ ముద్ర వేయబడేది. పోష్టేజీని ముందుగా చెల్లించని ఉత్తరాలపై "బేరింగ్" అనిగాని, "పోష్టు నాట్ పెడ్" అనిగాని 'అన్‌పెడ్' (unpaid) అనిగాని ముద్ర వేసి ఎడ్రసీ వద్దనుంచి ఆ పోష్టేజి వసూలు చేయబడేది. **1775** సంవత్సరంలో "బిషప్ మార్క్" హేండుస్ట్రక్ స్టాంపు (Handstruck stamp) ప్రవేశ పెట్టడంతో పోష్టల్ పద్ధతిలో మార్పులు వచ్చేయి. ప్రభుత్వం పోష్టలు సర్వీసుని చేపట్టినా, ఇంకా ప్రయివేటు పార్టీలు పోటీగా తపాలాలను చేర్చే వ్యాపారం కొనసాగుతూనే యుండి. **1837** సంవత్సరంలో "పోష్టాఫీస్ ఆక్ట్" (Post office act)తో ప్రయివేటు పోష్టలు సర్వీసులకు స్వస్తి చెప్పటం అయింది.

క్రమేణా పోష్టలు పద్ధతిలో అనేక మార్పులు వచ్చేయి. ఓడ రేవులగు మద్రాస్, కలకత్తా, బొంబాయిలలో పెద్దపెద్ద పోష్టాఫీసులు స్థాపించబడ్డాయి. "స్పెషల్ హేండుస్ట్రక్" స్టాంపులు ఆ దేశాలు పంపటానికి, రిసీవు చేసుకుందికి అనువుగా ప్రవేశ పెట్టబడ్డాయి. స్టీమర్లపై వెళ్ళవలసిన తపాలాలకు "స్టీమ్‌లెటర్స్" (Steam letters), "షిప్ లెటర్" (Ship letter), "ప్యాకెట్ లెటర్" (Packet letter) అనే మార్కులు, పట్టణాల పేర్లు ఉన్నాచి రిసీట్ల తేదీలతో సహా నోటు చేయబడేవి. ప్రభుత్వ ఉత్తర ప్రత్యుత్తరాలకు "ఫ్రీ" (Free), అనే మార్కు వేయబడేది. దీనితో భారతదేశంలో పోష్టలు పద్ధతి ఒక కొలిక్కి వచ్చిందని చెప్పవచ్చు.

కాలం గడిచిన కొలది భారతదేశంలో ఇతర ప్రాంతాలకు, విదేశాలకు తపాలు పంపుటలో అనూహ్యమైన మార్పులు వచ్చేయి. రానురాను తపాలా చార్జీలు ఏకరీతి (Uniform)గా యుండాలన్న అవసరం కలిగింది. సింధురాష్ట్ర కమీషనరుగా పనిచేస్తున్న సర్ బార్ట్లే ఫ్రీరీ (Sir bartle frere) **1852** సంవత్సరంలో ముందుగా పోష్టేజి చార్జీలు వసూలు చేయటానికి "సిండిడాక్స్" (Seinde dawks) అను పేపరు స్టాంపుల్ని ముద్రింపచేసి విడుదల చేసేడు. ఈ 'సిండి

డాక్స్' ఆసియా ఖండానికే ప్రథమ స్టాంపులుగా ఖ్యాతి చెందేయి. ఆ స్టాంపు మధ్య డిజైను ఈస్టిండియా కంపెనీయొక్క రంగులతో కూడి వెడల్పయిన ఏరో గుర్తు కలిగియుంది. మొదటలో ఎరుపురంగు గల స్టాంపులు ముద్రించబడ్డాయి. కాని అవి చాల తక్కువ కాలం మన్నేవిగా యుండేవి. ఆ లోపాన్ని సరిదిద్దుతూ తెల్లకాగితంపై ముద్రించిన స్టాంపులు అచిరకాలంలో వెలువడ్డాయి. కాని తెల్ల కాగితంపై 'ఎంబాసింగు' బాగా కనపడక పోవుటచే, తెల్లకాగితంపై నీలి రంగులో స్టాంపుల ముద్రణ చేపట్టడమయింది. **1851** సంవత్సరంలో "ప్రొవిన్సియల్ పోస్టులైన్" (Provincial post line) ఆచరణలోకి వచ్చేక తెలుపు, నీలం "అర్థణా", "అణా" స్టాంపులు ముద్రించ "సిండిడాక్" సింధు జిల్లాకు మాత్రమే మొదట్లో పరిమితం అయేయి. వాటికి గవర్నర్ జనరల్ యొక్క ఆమోదంలేదు. ఈ ఎరుపు, తెలుపు, నీలం స్టాంపులు వాడినవి నేడు రెండువేలనుండి పది, పది హేను వేల రూపాయిల వరకు వాటి 'కండిషన్‌ను' బట్టి విలువగలిగి యున్నాయి. తెల్ల సిండిడాక్ మింటు స్టాంపు రు. **15000/-**, నీలం స్టాంపు రు. **5,500/-**, ఎర్ర స్టాంపు రు. **1,50000/-** వాటి కండిషన్‌ను బట్టి విలువగలిగి యున్నాయని ఇండియన్ స్టాంపు డీలర్స్ అసోసియేషన్ ప్రెసిడెంటు శ్రీ M. C. సుఖాని వెల్లడి చేసేరు.

సింధిడాక్స్ తరువాత భారతదేశంలో చాలా స్టాంపులు విడుదల అయేయి. కలకత్తా మింటులో పనిచేస్తున్న ఉద్యోగి "కలోనెల్ ఫోర్బెస్" (Colonel forbes) **1852** సంవత్సరంలో "లయన్ అండ్ ది పామ్‌ట్రీ" (Lion and the palm tree) డిజైను ప్రప్రథమంగా తయారు చేసేరు. కాని అవసరమైనన్ని స్టాంపులు తయారుచేసే యంత్రాంగం తనవద్ద లేనందున ఆ డిజైను ఉపయోగించటం జరగలేదు. **1854** సంవత్సరంలో కలకత్తాలో డిప్యూటీ సర్వేయర్ జనరల్‌గా పనుచేస్తున్న 'కెప్టెన్ థూలియర్' (Thullier) 'లితోగ్రాఫీ' సహాయంతో విక్టోరియా రాణి తలగల నీలిరంగు 'అర్థణా' పోస్టేజి స్టాంపులు తయారు చేసేడు. మొదటి "ఆల్ ఇండియా స్టాంప్స్" తయారుచేసి భారత ఫిలటిక్ చరిత్రకు అంకురార్పణ చేసిన ఖ్యాతి

“ఫ్లాయిల్లోర్”కి దక్కింది. తరువాత ఒక అణా, రెండు అణాలు, నాలుగు అణాలు విలువలలో స్టాంపుల ముద్రణ జరిగింది. కాని నాలుగు అణాల స్టాంపుల ముద్రణలో చిన్న పొరపాటు జరిగింది. రాణిగారి తల ‘తల్లక్రిందుగా’ కొన్ని స్టాంపులలో ముద్రించబడింది. అటువంటి స్టాంపులు 25 వున్నట్లు అంచనా. ఈ స్టాంపులు మిక్కిలి అరుదైనవి. గనుక నేడు వాటి విలువ వేలమీద యున్నాయి. నీలి రంగులో అర్థణా స్టాంపులు ముద్రించే పూర్వం ఎరుపురంగు అర్థణా స్టాంపులు 900 ప్రింటు అయేయి. కాని ప్రింటింగు ఇంకు అయిపోవటంవల్ల వాని ప్రింటింగు నిలిపివేసేరు. అందుచేత ఆ స్టాంపులన్నీ ధ్వంసం చేయటం జరిగింది. ఒక నమూనా కాపీని మాత్రం ఢిల్లీ లోని నేషనల్ ఫిలటిక్ మ్యూజియంలో భద్రపరచటం అయింది. ఈ ఎర్ర అర్థణా స్టాంపుల్ని ‘9 1/2’ “Arches” అని అంటారు. వీటికి ‘గమ్’ లేదు. వాటిని వేరుచేయటానికి ‘పెర్ఫొరేషన్లు’ లేవు.

1856 నుంచి 1926 సంవత్సరం వరకు ఇండియన్ స్టాంపుల్ని లండన్‌లోని “థామస్ డిలారూ” కంపెనీవారు ముద్రించేరు. పరిపాలకులు మారినప్పుడల్లా డిజైను మారేది. ఆ విధంగా విక్టోరియా మహారాణి 7వ ఎడ్వర్డు, 5వ జార్జి, 6వ జార్జి తలలుగల స్టాంపులు వివిధ విలువల్లోను, వివిధరంగుల్లోను వెలువడ్డాయి. 1926 సంవత్సరంలో నాసిక్‌లో భారత ప్రభుత్వం ‘ఇండియా సెక్యూరిటీ ప్రెస్’ను స్థాపించి స్టాంపుల ముద్రణ చేపట్టింది. నేటికీ ఇండియన్ స్టాంపులు ఇచటనే ముద్రించబడుతున్నాయి.

18-2-1911న M. పిక్వెట్ తన ‘బైప్లేను’లో 6,500 లేఖలను, పోస్టు కార్డులను అలహాబాదునుంచి నైనిటాల్‌కి చేర్చటంతో ప్రపంచంలో మొదటి ‘ఏరియల్ పోస్టు’ పద్ధతిని ప్రవేశపెట్టిన ఘనత భారతదేశానికి దక్కింది. ప్రపంచ తపాలా చరిత్రలో ఇదొక మైలురాయి అంతేగాక 1929 సంవత్సరంలో స్పెషల్ ఎయిర్ మైలు స్టాంపులసెట్టు విడుదల చేసి కామన్‌వెల్తు దేశాల్లో మన దేశం అగ్రస్థానం సంపాదించుకుంది.

1934 సంవత్సరం సెప్టెంబరు 30వ తేదీని 'రాకెట్ మైల్ డిస్పాచ్' చేసిన ప్రథమ స్థానం ఇండియా దక్కించుకుంది. రాకెట్లలో డిస్పాచి అయిన లేఖలపై ఈ రాకెట్ డిస్పాచీల ప్రమోటర్ల పేర్లు గల లేబిల్సు వున్నాయి. అలాటి పేర్లలో కలకత్తాకు చెందిన స్టీఫెన్ M. స్మిత్ ఒకటి.

1972 సంవత్సరం మార్చి నెలలో ఆకర్షణీయమైన రంగులతో ప్రింటు చేయుటకు యంత్రాలను భారత ప్రభుత్వం సంపాదించింది. భారతదేశ స్టాంపు చరిత్రలో ఇది మరొక మైలురాయిగా పరిగణించ బడుతోంది. ఈ సంవత్సరంలోనే 'పిన్ కోడ్' (Pin code) పద్ధతి ప్రవేశపెట్టడమైనది.

1975లో Q. M. S. (Quick Mail Service) ప్రవేశపెట్టి 'పిన్ కోడ్' (Pincode)గల లేఖలను త్వరితంగా సరఫరాకు వీలు కలుగచేసింది.

1985లో పోస్ట్సు అండ్ టెలిగ్రాఫ్ డిపార్టుమెంటు విభజన జరిగింది.

1986లో స్పీడు పోస్టు (Speed Post) ప్రవేశపెట్టబడింది.

1988లో "స్పీడుపోస్టు మనీఆర్డరు సర్వీసు" (Speed Post Money Order Service)ను పోస్టల్ డిపార్టుమెంటు వారు ప్రవేశపెట్టేరు.

## భారత పోస్టల్ ప్రగతిలో ఇతర ముఖ్యమైన మైలురాళ్ళు (Mile Stones)

(1) 1688 – బొంబాయిలో బ్రిటిషువారి "మొదటి అధికార పోస్టాఫీసు" స్థాపన.

(2) 1774 – పోస్టేజి చెల్లించిన మీదట ప్రయివేటు లేఖల సరఫరా ప్రారంభం. కలకత్తాలో "మొదటి పోస్టుమాస్టర్ జనరల్" ఛార్జి తీసుకోవటం.

(3) **1854** – ఇంపీరియల్ పోష్టాఫీస్ ఆక్టు (Imperial Post Office Act) వలన 652 పోష్టాఫీసులకు అధికారులైన సలు గురు పోష్టుమాస్టరు జనరల్సు ఒక 'డైరెక్టర్ జనరల్' అధికారికి లోబడి పనిచెయ్యాలి. రైల్వేలు తపాలాలను తీసుకవెళ్ళే పద్ధతి ప్రారంభం అయింది.

(4) **1876** – ఇండియా 'జనరల్ పోష్టల్ యూనియన్'లో మెంబరుగా చేరుట.

(5) **1877** – V. P. P. పోష్టు కార్డులు, ఇన్సూరెన్సు, మనీఆర్డరుల సరఫరా చేపట్టింది.

(6) **1879** – జనరల్ పోష్టల్ యూనియన్ 'Universal Postal Union' (U. P. U)గా మారింది.

(7) **1914** – పోష్టు అండ్ టెలిగ్రాఫ్ డిపార్టుమెంటుల విలీనం.

## 5. స్టాంపు సేకరణ (Philately)కి దారితీసిన సంఘటన

పోష్టేజి స్టాంపుల సేకరణను "ఫిలేటలీ" (Philately) అంటారు. గ్రీకు భాషలో 'Philos' అనగా "ప్రీతి అయిన", "ateles" అనగా "టాక్సు రహితమైన" అని అర్థం. హాబీలన్నిటిలో ఫిలేటలీది అగ్ర స్థానం. దీనిని "హాబీలకు రాజు, రాజుల హాబీ" ("King of hobbies and hobby of kings") అంటారు. ఈ హాబీ సంపన్నుల్ని, సామాన్యులి, పిల్లల్ని, పెద్దల్ని, ఆకర్షిస్తుంది, సన్నిహితం చేస్తుంది దీనికి కారణం స్టాంపుల సేకరణలో ఇమిడియున్న అదృశ్యశక్తి. ఈ శక్తి వారిని పరవశింపచేస్తుంది. ఒకసారి ఈ శక్తిచే ఆకర్షింపబడినవారు సామాన్యంగా ఈ హాబీకి దూరంగా యుండలేరు. ఎక్కువగా వ్యాకులానికి (Worry) గురి అయిన వారిని ఈ హాబీ దారి మళ్ళించి ప్రశాంతత చేకూరుస్తుంది. అందుచేత ఇటువంటి హాబీ పూర్వాపరాలు తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

ఒక బ్రిటిషు యువతి విలాసం ఈ స్టాంపు సేకరణకు వూత యిచ్చింది. ఆమె తన డ్రెస్సింగు రూములో కాన్సిల్ అయిన పోష్టేజి స్టాంపుల్ని సరదాకోసం గోడలపై అతికించటం ప్రారంభించింది. ఆమెమే మొదటి స్టాంపుల సేకరణ వేత్త! ఆమె 16000 స్టాంపులు సేకరించి, అవి చాలక 1841 సంవత్సరంలో "లండన్ టైమ్స్" పత్రి లో పాఠకులను స్టాంపులను పంపించమని ప్రార్థించింది. అప్పటు ంచి స్టాంపుల సేకరణ వెర్రూత వేయసాగింది. స్టాంపు కలెక్టర్ల సంఖ్య నానాటికి హెచ్చయింది. విద్యావంతులు కొందరు ఆకర్షితులై స్టాంపుల సేకరణ ప్రారంభించి పుస్తకాలలో అతికించ నారంభించేరు. 1851 సంవత్సరంలో గ్రేటు బ్రిటన్‌లో "The family herald" అనే పత్రికకు స్టాంపు కలెక్టర్లు స్టాంపుల మారకం (exchange)కి ప్రకటించటంతో స్టాంపుల సేకరణ పుంజుకుంది. 1860 సంవత్సరం నాటికి స్టాంపు - సేకరణ ఒక స్థాయికి చేరుకుంది. అప్పటికి ఇంచుమించు ప్రపంచంలో అన్ని దేశాలు తమ తమ స్టాంపుల్ని విడుదలచేసేయి. 1860-70 సంవత్సరాల మధ్య కాలంలో ప్రపంచంలో అన్ని దేశాలలో వెలువడిన స్టాంపుల కేటలాగులు, స్టాంపు ఆల్బములు మార్కెట్టులోకి రావటంతో స్టాంపుల సేకరణ తారాస్థాయికి చేరింది. కొద్దిపాటి ఖర్చుతో గ్రేటు బ్రిటనులో మొదటి అంతర్జాతీయ స్టాంపు ఎగ్జిబిషన్ 19వ శతాబ్దం చివరిలో నిర్వహించబడింది. అందలి స్టాంపుల విలువ కొన్నివేల రూపాయిలు మాత్రమే. కాని నేడు నిర్వహించబడే అంతర్జాతీయ స్టాంపు ఎగ్జిబిషనులలోని స్టాంపులు కొన్ని కోట్ల రూపాయిలు విలువ గలిగినవై యున్నాయంటే స్టాంపు కలెక్షన్ ఎంత ప్రముఖ స్థానం చేరుకుందో ఊహించవచ్చు.

## 6. స్టాంపుల సేకరణ (ఫిలేటలీ) ప్రయోజనాలు

స్టాంపు సేకరణ అనేక ప్రయోజనాలతో కూడుకున్నదే గాక, "ఫారిన్ ఎక్స్చేంజి" కూడ సంపాదిస్తుంది. మానవ జీవిత సౌధానికి పునాదిరాళ్ళ వంటివారు చిన్నారులు. వారి తీరిక సమయాన్ని

సద్వినియోగం చేసుకునేటట్లు చూడటం బాధ్యత అటు ప్రభుత్వానికి ఇటు తలిదండ్రులకీ కూడ యుంది. అప్పుడే దేశానికి సౌభాగ్యం కలుగుతుంది. అందుకే ప్రభుత్వంవారు పాఠశాలల్లో లైబ్రరీలు, పిల్లల ఫిల్ములు, ఆటస్థలాలు మున్నగునవి వారి మనోవికాసాన్ని పెంపొందించటానికి నెలకొల్పుతున్నారు. ఏదో ఒక దానిలో పిల్లలకు అభిలాష ఉంటుందనటంలో సందేహంలేదు. చిన్న పిల్లలకు ఒక హాబీ యుంటే అది వారి ఒంటరితనాన్ని మరిపింప చేస్తుంది. ఆ హాబీ వారి ఆలోచనకు అవకాశం ఇచ్చేదిగాను, చెడుపనులనుండి దృష్టిని మరలించేదిగాను యుండాలి. ఫిలేటలీ పిల్లలికి పై విషయాల్లో బాగా సహకరిస్తుంది. వయస్సుతో ప్రమేయం లేకుండా చిన్నలు పెద్దలు వారి వారి స్టాంపు సేకరణలను పరిశీలించుకుని ఆనందం పొందుతూ యుండటం ముఖ్యంగా స్టాంపుల ఎగ్జిబిషనులలో గమనించవచ్చు. ఈ హాబీ ఇంకా అనేక ప్రయోజనాల్ని కలుగచేస్తుంది. ప్రపంచంలో వివిధ దేశాల చరిత్ర, జాగ్రఫీ, కరెన్సీలు, పరిశ్రమలు, ప్రాజక్టులు, ముఖ్య సంఘటనలు, ప్రఖ్యాత స్త్రీ పురుష సేవలు, స్టాంపుల సేకరణ చేసే చిన్నారులు సులబంగా పుస్తకాల ప్రమేయం లేకనే గ్రహిస్తారు. కొన్ని విషయాలు ఇతరులనడిగి తెలుసుకోవాలనే అభిలాష వారికి కలుగుతుంది. దీనివలన వారి లోకజ్ఞానం పెరుగుతుంది. బ్యాంకరు కన్నా స్టాంపు కలెక్టరుకి కొన్ని కరెన్సీల పరిజ్ఞానం బాగా తెలుస్తుంది. పౌండ్లు, స్టెర్లింగు గాక ఇతర పౌండ్లు, U. S. A. డాలర్లు గాక ఇతర డాలర్లు వున్నాయన్న విషయాలు స్టాంపు కలెక్టర్‌కి తెలిసినంతగా ఇతరులకు తెలియకపోవచ్చు. వాటినిబట్టి వాటి 'మారకపు' (exchange) విలువలు తెలుసుకోవటానికి చురుకైనవారు ప్రయత్నిస్తారు. ప్రపంచంలోని దేశాలు, వాటి ఉనికి, పాడిపంటలు, నాణ్యాలు, వగైరా విషయాలను స్టాంపు కలెక్టరు సులువుగా గ్రహిస్తాడు. అంతే గాక ఆ దేశ చరిత్రలో మార్పులు, ఎవరెవరు ఎప్పుడు పాలించింది వారి మతం, ఆచార వ్యవహారాలు వారి కంటికి కట్టినట్లు యుంటాయి. ఉదాహరణకు మన భారతదేశం తీసుకుందాం. **1855** నుంచి **1877** వరకు ఈస్టుఇండియా కంపెనీవారి స్టాంపులుండేవి. **1877**వ

సంవత్సరంలో భారతదేశపాలన విక్టోరియా మహారాణి స్వాధీనం చేసుకోవటంతో స్టాంపులపై ఇండియా అని మాత్రం వ్రాయబడింది. 1882 నుంచి 1947లో మనకు స్వాతంత్ర్యం వచ్చేవరకు మన దేశాన్ని పాలించిన చక్రవర్తిగాని, రాణిగాని తలయున్న స్టాంపులు ముద్రించబడ్డాయి. 1947 సంవత్సరంలో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సూచనగా విడుదల అయిన స్టాంపులు, భారతదేశం రిపబ్లిక్‌గా ప్రకటించిన వివరాలుగల స్టాంపులు దేశ చరిత్రని తెలియ చేయటం లేదా? మనదేశ స్వాతంత్ర్యానికి దారితీసిన కొన్ని ముఖ్య సంఘటనలు, ఇతర సంఘటనలు జాతీయ నాయకుల ఇతర సంఘ సేవా తత్పరుల కృషిని గుర్తుచేస్తూ అనేక స్టాంపులు విడుదల అయ్యేయి. వాటిలో కొన్ని ముఖ్యమైనవి 'జలియన్ వాలాబాగ్', 'క్విట్ ఇండియా', 'ఉప్పు సత్యాగ్రహం'. 'గాంధీ', 'లాలాలజపతి రాయ్', 'భగత్‌సింగ్', 'పటేల్', 'రాజారామమోహనరాయ్', 'వీరేశలింగం పంతులు', 'టంగుటూరి ప్రకాశం', 'సుభాష్‌చంద్రబోస్', ఇంకా ఎన్నెన్నో స్టాంపులు విడుదల అయ్యేయి. ఇవిగాక దేశ స్వాతంత్ర్యం వచ్చేక మన ప్రభుత్వం సాధించిన ప్రాజెక్టులు, మొదటి ఎయిర్‌మైలు ఫ్లైట్లు, నైటు ఎయిర్‌మైలు సర్వీసులు, షిప్పులు, హార్బర్లు, కోర్టులు, విద్యాలయాలు, కాలేజీలు, దేవాలయాలు, మాస్కులు, చర్చిలు మున్నగువాటిని స్టాంపులపై చూస్తున్నాం. అనేక 'సెంటినరీ'ల స్టాంపులు, 'గోల్డెన్ జూబిలీ' స్టాంపులు విడుదల అయ్యేయి. కొన్ని దేశాలలో మార్పులు సంభవిస్తూ యుండటం సహజం. వాటి మార్పుల్ని స్టాంపుల సేకరణ ద్వారా తెలుసుకోవచ్చు. ఏవైనా మార్పులు సంభవించినప్పుడు ఆ దేశాలు కొత్త స్టాంపుల్ని విడుదల చేస్తాయి. ఒకవేళ ఆ దేశ స్టాంపులు లభ్యం కాకపోతే, ఆ దేశాలు విడుదల చేసిన బ్రోచర్స్ (broachures) వల్లనైనా ఆయా మార్పులు తెలుసుకోవచ్చు.

స్టాంపు సేకరణలో ఒక దేశపు స్టాంపు కలెక్టర్లు మరొక దేశపు స్టాంపు కలెక్టర్లతో స్టాంపుల మారకం (exchange) కొరకు కలం స్నేహాలు చేస్తారు. ఈ పరిచయం విశ్వభాతృత్వానికి దారితీస్తుంది.

శలవలు లభించినప్పుడు స్నేహ దేశాల్కి స్టాంపు కలెక్టర్లు వెళ్ళి స్టాంపుల ఎక్స్ఛేంజి చేసుకోవటమే గాక కొత్త కొత్త అనుభూతులు పొందుతారు. ఇలా స్నేహితుల రాకపోకల వలన ఇతర దేశాలతో సంఘీభావం ఏర్పడి ప్రపంచ శాంతికి దోహదం కాగలదు. భారత దేశం కూడ ఇటీవల పరస్పర రాకపోకల (exchange visits) ఉద్యమం ప్రారంభించింది. అమెరికా ప్రెసిడెంటు ఐసన్‌హోవర్ స్థాపించిన "people to people" ప్రోగ్రాంవల్ల దేశాలమధ్య విశాల దృక్పథం ఏర్పడుటకు ఈ రాకపోకల ఉద్యమం తోడ్పడుతుందన టంలో సందేహంలేదు. దానితో ఆయా దేశాలు సన్నిహితమవు తాయి. ఇంతేగాక మానసిక వ్యాధుల్ని నయం చేయటంలో స్టాంపు కలెక్షన్ ప్రముఖపాత్ర వహిస్తుందని పరిశోధనలు తెలియచేస్తున్నాయి.

## ఫారిన్ ఎక్స్ఛేంజి సంపాదించే ఫైలేట్లీ

ఒక స్టాంపు అతికించిన లేఖ దాని గమ్యస్థానం చేరటంతో సరి అనుకోవటం సహజం. కాని అది పొరపాటు. అలా ఉపయోగించిన స్టాంపు మనకి అనేక విషయాల్ని తెలియచేస్తుంది. ఆ స్టాంపులు ఆకర్షనీయంగాయుంటే వాటిని సేకరించాలన్న ఆశక్తి కలుగుతుంది. అవి మిక్కిలి అరుదైనవి అయితే ఆదుర్దా మరీ హెచ్చు అవుతుంది. అంతే కాదు. వాటి పూర్వాపరాలు తెలుసుకోవాలనిపిస్తుంది. మొదట్లో స్కూలు పిల్లలు, రిటైరు అయిన వయసు మళ్ళిన వారు కాలక్షేపం కోసం ఈ హాబీని అలవాటు చేసుకునేవారు. కాని నేడు ఈ హాబీ అంతర్జాతీయ భాతృత్వంతోపాటు జ్ఞానోదయాన్ని, విరామాన్ని అందించటంలో ఇతర హాబీలకన్న ప్రత్యేకత కలిగియుండి గడచిన 40-50 సంవత్సరాలలో ఈ స్టాంపు కలెక్టింగు ప్రఖ్యాతమై ప్రపంచంలో నెం. 1 హాబీగా పరిగణింపబడుతోంది. అన్ని భాషలలోను ఈ హాబీని గురించిన కీలకములైన విషయాలు తెలియజేసే మ్యాగజైనులు ప్రచురణ అవటంతో దీని ప్రాముఖ్యం మరీ హెచ్చయింది. స్టాంపుల అమ్మకం అంతర్జాతీయ వ్యాపార స్థాయి చేరుకుంది. నేడు స్టాంపుల బిజినెస్ యూరప్‌లో అనేక మిలియన్ల పౌండ్లు, U. S. A.,

# 8. ఫిలటిక్ బురూలు - స్టాంపు కేటలాగులు

కొత్త స్టాంపు విడుదలను, ఫస్టుడే కవర్లను స్టాంపు కలెక్టర్లకు స్టాంపు డీలర్లకు అందచేయటానికి 'ఫిలటిక్' బురూలను ప్రపంచం అంతటా పెద్ద పెద్ద పట్టణాలలో అన్ని దేశాల ప్రభుత్వాలు నెలకొల్పాయి. ముందుగా డిపాజిట్ కట్టించుకుని ఆ సంవత్సరంలో వెలువడే కొత్త స్టాంపులను, ఫస్టుడే కవర్లను స్టాంపు కలెక్టర్లకు, డీలర్లకు వారి వారి కోరికలననుసరించి పోష్టాఫీసువారు అందచేస్తారు.

భారతదేశంలో 'స్టాంపుల సేకరణ' హాబీ రోజురోజుకి అనేకులను ఆకట్టుకోవటంతో పోష్టల్ డిపార్టుమెంటు వారు 'ఫిలటిక్ బురూ'లను ముఖ్య కేంద్రాలలో స్థాపించి కొత్తగా విడుదల అయిన స్టాంపుల్ని, ఫస్టుడే కవర్లని స్టాంపు కలెక్టర్లకు, స్టాంపు డీలర్లకు విక్రయిస్తున్నారు. కొత్త స్టాంపులు ఫస్టుడే కవర్లు పెద్ద పట్టణాలైన బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, హైదరాబాదు మున్నగు కేంద్రాలలో బాగా అమ్ముడు అవుతున్నాయి. విదేశాల్లో కూడ వీటి అమ్మకానికి ఏజంట్లను నియమిస్తున్నారు. ప్రతీ దేశం తన స్టాంపుల్ని కొన్ని సందర్భాలలో విడుదల చేస్తుంది. వాటిలో కొన్ని "నిశ్చితములు" (definitives). కొన్ని "జ్ఞాపకార్థములు" (Commemoratives), కొన్ని 'ప్రత్యేక స్టాంపులు' (Special Stamps) స్టాంపు కలెక్టరు వాటిలో తాను ఎంపిక చేసుకున్న సబ్జెక్టుకు ఉపయోగపడేవాటిని సేకరించాలనుకుంటారు. అందుకుగాను స్టాంపు డీలర్లు ఒక్కొక్క దేశం ఒక సంవత్సరంలో విడుదల చేసిన స్టాంపుల్ని కొని స్టాకు చేస్తారు. వాటి నమూనాలను ఒకే కేటలాగులో ముద్రిస్తారు. దీనిని "స్టాంపు కేటలాగ్" అంటారు. స్టాంపు కలెక్టరు కొత్త స్టాంపుల సేకరణ కోసం ఎంత సొమ్మైనా ఖర్చుచేసి వాటిని తన ఆల్బములో చేర్చటానికి ఆరాటపడ్తారు. కొత్త స్టాంపులు ఏవి విడుదల అయేయో తెలుసుకునేందుకు అనేక భాషలలో ఏటా వేలమీద స్టాంపుకేటలాగులు ప్రచురణ అవుతున్నాయి.

ప్రపంచానికి మొదటి స్టాంపు మే 6, 1840లో ఇచ్చిన గ్రేటు బ్రిటను 1964 సంవత్సరం వరకు ఫిలటిక్ సేల్సు కౌంటర్ని

# 8. ఫిలటిక్ బురూలు - స్టాంపు కేటలాగులు

కొత్త స్టాంపు విడుదలను, ఫస్టుడే కవర్లను స్టాంపు కలెక్టర్లకు స్టాంపు డీలర్లకు అందచేయటానికి 'ఫిలటిక్' బురూలను ప్రపంచం అంతటా పెద్ద పెద్ద పట్టణాలలో అన్ని దేశాల ప్రభుత్వాలు నెల కొల్పాయి. ముందుగా డిపాజిట్ కట్టించుకుని ఆ సంవత్సరంలో వెలువడే కొత్త స్టాంపులను, ఫస్టుడే కవర్లను స్టాంపు కలెక్టర్లకు, డీలర్లకు వారి వారి కోరికలననుసరించి పోష్టాఫీసువారు అందచేస్తారు.

భారతదేశంలో 'స్టాంపుల సేకరణ' హాబీ రోజురోజుకి అనేకులను ఆకట్టుకోవటంతో పోష్టల్ డిపార్టుమెంటు వారు 'ఫిలటిక్ బురూ'లను ముఖ్య కేంద్రాలలో స్థాపించి కొత్తగా విడుదల అయిన స్టాంపుల్ని, ఫస్టుడే కవర్లని స్టాంపు కలెక్టర్లకు, స్టాంపు డీలర్లకు విక్రయిస్తున్నారు. కొత్త స్టాంపులు ఫస్టుడే కవర్లు పెద్ద పట్టణాలైన బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, హైదరాబాదు మున్నగు కేంద్రాలలో బాగా అమ్మకడు అవుతున్నాయి. విదేశాల్లో కూడ వీటి అమ్మకానికి ఏజంట్లను నియమిస్తున్నారు. ప్రతీ దేశం తన స్టాంపుల్ని కొన్ని సందర్భాలలో విడుదల చేస్తుంది. వాటిలో కొన్ని "నిశ్చితములు" (definitives). కొన్ని "జ్ఞాపకార్థములు" (Commemoratives), కొన్ని 'ప్రత్యేక స్టాంపులు' (Special Stamps) స్టాంపు కలెక్టరు వాటిలో తాను ఎంపిక చేసుకున్న సబ్జెక్టుకు ఉపయోగపడేవాటిని సేకరించాలనుకుంటారు. అందుకుగాను స్టాంపు డీలర్లు ఒక్కొక్క దేశం ఒక సంవత్సరంలో విడుదల చేసిన స్టాంపుల్ని కొని స్టాకు చేస్తారు. వాటి నమూనాలను ఒకే కేటలాగులో ముద్రిస్తారు. దీనిని "స్టాంపు కేటలాగ్" అంటారు. స్టాంపు కలెక్టరు కొత్త స్టాంపుల సేకరణ కోసం ఎంత సొమ్మైనా ఖర్చుచేసి వాటిని తన ఆల్బములో చేర్చటానికి ఆరాటపడ్తారు. కొత్త స్టాంపులు ఏవి విడుదల అయేయో తెలుసుకునేందుకు అనేక భాషలలో ఏటా వేలమీద స్టాంపుకేటలాగులు ప్రచురణ అవుతున్నాయి.

ప్రపంచానికి మొదటి స్టాంపు మే 6, 1840లో ఇచ్చిన గ్రేటు బ్రిటను 1964 సంవత్సరం వరకు ఫిలటిక్ సేల్సు కౌంటర్ని

సెంట్రల్ G. P. O. లో తెరవబడిపోవటం శోచనీయం! కాని 1966కి ఆ కౌంటర్ని ఎడిన్బరోకి మార్చవలసి వచ్చిందీ అంటే అమ్మకాలు ఒక్కసారి పెరగటం మరీ ఆశ్చర్యకరమైన విషయం! అనతి కాలము లోనే ఎడిన్బరో ఫిలటెలిక్ బ్యూరోలో అమ్మకం £ 1,000,000 (Rs. 1,80,00,000/-) ఉన్నా, ప్రత్యేకంగా ఫిలటిక్ కౌంటరు ఆఖరి 12మాసాలలో మరో £250.000 (Rs. 45,00,000/-)ల అమ్మకం జరిగింది. అంటే Rs. 2,25,00,000/- రూపాయిల విలువచేసే స్టాంపులు బ్రిటనులోని ఫిలటలిస్టులకు, ఇతర దేశాల ఫిలటలిస్టులకు అమ్ముడయేయన్నమాట! దీనితో పోల్చిచూస్తే ఇండియన్ స్టాంపులు ఎంత తక్కువ అమ్ముడు అయేయో తెలుస్తుంది. 1964-65లో Rs.37,711/-యున్నా, 1965-66లో Rs.1,50,589/-యున్నా విదేశమారక ద్రవ్యాన్ని సంపాదించింది. U. S., కెనడాలలో స్వంత ఏజంట్లు యున్నా ఇలా జరిగిందీ అంటే ప్రతి విడుదలకి ముందుగా పబ్లిసిటీ లేకపోవడమే.

## 9. స్టాంపుల తరగతి వారి విభజన

**(Classification of Stamps)**

పోస్టేజి స్టాంపుల్ని 8 తరగతులుగా విభజించవచ్చు.

(1) నిశ్చితములు (definitives) :- దీర్ఘ కాలం వాడటానికి ఉపయోగించే స్టాంపులు. ఈ స్టాంపుల స్టాకు అయిపోగానే తిరిగి ముద్రింపబడతాయి. ఉదాహరణకు పులి తలగల 15 పై. స్టాంపు, 5 పై. కుటుంబ నియంత్రణ స్టాంపు, 10 పై రైలు ఇంజను స్టాంపు, 5 పై. చేప స్టాంపు, 20 పై. మామిడిపళ్ళ గుత్తి స్టాంపు ఈ స్టాంపుల కంట్రాక్టు మార్పిడి సమయాల్లో వేరే వాటరు మార్కు కాగితంపై ముద్రింపబడతాయి. ఉదాహరణకు 1926లో థామస్ డిలారూ (Thomas delarue) కంపెనీవారి స్టాంపుల ముద్రణ కంట్రాక్టు రద్దయి, నాసిక్‌లో ఇండియా సెక్యూరిటీ ప్రెస్‌లో ముద్రణ ప్రారంభం అయింది. తిరిగి 1957 సంవత్సరంలో ఇండియా మ్యాపు డిఫిని

టిల్స్‌ను 'మల్టీస్టార్' వాటరు మార్కు చేశారు. అటు తరువాత 'అశోక లయన్' వాటరు మార్కు చేసిన స్టాంపుల ముద్రణకు ఉపయోగించటం జరిగింది.

(2) జ్ఞాపకార్థములు (Commemoratives): - ప్రత్యేక సందర్భాలను, సంఘటనలను పురస్కరించుకుని ముద్రించే స్టాంపులు, ప్రారంభోత్సవాలు, (15-8-1947 స్వాతంత్ర్య దినం), సెంటినరీ సెలబ్రేషన్లు (1961 ఆర్కియాలజికల్ సర్వే ఆఫ్ ఇండియా), వ్యక్తి జయంతులు (1961 బర్త్ సెంటినరి ఆఫ్ మాలవ్యా), ప్రత్యేక సందర్భాలు (ఒలింపిక్ క్రీడోత్సవాలు), విశ్వ విద్యాలయాల స్థాపనలు (20 పై కాశీ విద్యాపీఠ్ స్టాంపు), అనివర్సరీలు (20 పై చాప్టర్ ఆఫ్ సైరస్ ది గ్రేట్ 2500 అనివర్సరీ స్టాంపు). మహనీయుల ప్రతి రూప చిత్రాలన్నీ కమెమొరేటివ్స్ కావు. అలాగే సంఘటనలు అన్నీ కమెమొరేటివ్స్ కావు. కమెమొరేటివ్స్ ముద్రణ వెనుక (background) ఒక నిర్దిష్టమైన విషయం యుండాలి. 1931 సంవత్సరంలో "న్యూఢిల్లీ ఇనాగురేషన్" సందర్భంగా మొదటి ఇండియన్ చిత్రాల స్టాంపులు ముద్రించబడ్డాయి. ఈ స్టాంపులపై న్యూఢిల్లీలోని దృశ్యాలు యున్నాయి. తరువాత 1935 సంవత్సరంలో 5వ జార్జి సిల్వర్ జూబ్లీకి కమెమొరేటివ్ స్టాంపులు విడుదల అయేయి.

1937 సంవత్సరంలో ముద్రించిన స్టాంపులలో తపాలాలు తీసుకు వెళ్ళటానికి ఉపయోగించిన వివిధ సాధనాల చిత్రాలున్నాయి. 1946 సంవత్సరంలో రెండవ ప్రపంచ యుద్ధ విజయం జ్ఞాపకార్థం నాలుగు స్టాంపులు విడుదల అయేయి.

15–8–1947 నుంచి 15–8–1973 సంవత్సరాల మధ్య కాలంలో 248 కమెమొరేటివ్ స్టాంపులున్నూ, స్పెషల్ స్టాంపులున్నూ విడుదల అయేయి. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చేక విడుదల అయిన మొదటి స్టాంపు త్రివర్ణ పతాకంతో 21-11-1947న వెలువడింది. 1948 సంవత్సరంలో విడుదల

అయిన స్టాంపులలో 'గాంధి సర్వీసు' స్టాంపునకు చాలా ప్రాముఖ్యత యుంది. స్విట్జర్లాండ్‌లో ముద్రించబడ్డ గాంధీ స్టాంపులపై నాసిక్ లోని సెక్యూరిటీ ప్రెస్ "Service" అను పదము ప్రింటింగు అప్పటి గవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారి కోరికపై జరిగింది. ఆ స్టాంపులు నేడు చాలా విలువ గలిగి యున్నాయి.

కమెమొరేటివ్ స్టాంపుల ఎంపిక కొన్ని సమస్యలతో కూడి యుంటుంది. ఇండియాలో పలుకుబడిగల వ్యక్తులున్నారు. అనేక ప్రాంతీయ మతాలున్నాయి. వారు తమ కిష్టమైన ధ్యేయములకొరకు స్పెషల్ స్టాంపుల విడుదలకు ప్రభుత్వంపై ఒత్తిడి చేసే ప్రమాదం యుంటని, ఆ ఒత్తిడికి లొంగి అనేక కమెమొరేటివ్‌లను విడుదల చేస్తుంటవన్న అపోహలను ఫిలటలిస్టులు వెలిబుచ్చేరు. ఒక సంవత్స రంలో ప్రపంచంలో అన్ని దేశాలు విడుదల చేసిన కమెమొరేటివ్‌లను కొనటానికి వారు ఇష్టపడరు. అది కష్టం కూడాను. అందుచేత అనేక దేశాలు కమెమొరేటివ్‌ల విడుదల అదుపు చేయుటకు కొన్ని పద్ధతులు అవలంభించేయి. అమెరికాలో మొదట్లో కమెమొరేటివ్‌ల విడుదలలను కాంగ్రెస్, సెనేట్‌ల నుంచి ఎంపిక అయిన "పోష్టాఫీస్ కమిటీ" చేపట్టింది. రాను రాను **1950** సంవత్సరం ప్రాంతంనుంచి రాజకీయ వేత్తలు, పబ్లిక్ ఆర్గనైజేషన్లు మితిమీరి వత్తిడి చేయుటంతో వేలాది కమెమొరేటివ్‌లను పరిశీలించి ఎంపిక చేయుటం పెద్ద సమస్య అయింది.

అందుచేత **1955** సంవత్సరంలో ఆ కమిటీవారు ఈ ఎంపికని పోష్టుమాష్టర్ జనరల్‌కు వదలిపెట్టేరు. పోష్టుమాష్టరు జనరల్ ఆర్థర్ సమ్మర్ ఫీల్డ్ రెండు సంవత్సరాలపాటు వీరితో పెనుగులాడి విసిగి పోయేడు. చివరికి 'సిటిజన్స్ ఎడ్వైజర్ కమిటీ'ని ఏర్పాటుచేసి బాధ్యతలు వానికి వప్పచెప్పేడు. ఈ కమిటీని యధాతథంగా యుంచుతూ ప్రెసిడెంటు కెనెడి కమెమొరేటివ్‌ల విడుదలను **42**నుంచి **15**కి తగ్గించేడు. **1960** సంవత్సరంలో సమ్మర్‌ఫీల్డ్ 4వ కమెమొ రేటివ్‌లను విడుదల చేసి ప్రభుత్వానికి రు. **1,50,00,000/-**లను స్టాంపుల అమ్మకంవల్ల లాభం చేకూర్చేడు. తరువాత వచ్చిన కొత్త

పోష్టుమాష్టర్ జనరల్ జె. ఇ. ఎడ్వర్డు డే 1961 సంవత్సరంలో 14 కమెమొరేటివ్‌లను విడుదల చేసి రు. 1,35,00,000/-లను లాభం చేకూర్చేడు.

ఇండియాలో కమ్యూనికేషన్స్ మినిష్టరీ వారు డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోష్ట్సు అండ్ టెలిగ్రాఫ్స్‌వారి సాయంతో కమెమొరేటివ్‌ల ఎంపికను చేపట్టింది. తదుపరి, ప్రభుత్వం కొందరి వ్యక్తులు, ఎసోసియేషన్ల ఒత్తిడికి తట్టుకోలేక ఫిలటిక్ ఎడ్వైజరీ కమిటీని స్ృష్టించింది. ఆ కమిటీ మూడుమాసాలకొకసారి సమావేశమై డిపార్టుమెంటు వారికి వచ్చిన సూచనలన్నింటిని పరిశీలించి తుది నిర్ణయం తీసుకొని కమెమొరేటివ్‌ల ఎంపికను చేపట్టుతుంది.

ఈ కమిటీ 1960లో 6, 1961లో 16, 1962లో 15 కమెమొరేటివ్‌లను విడుదల చేసింది. 1962 లోనే ఇండోచీనా, కాంగోలలో యున్న భారత సైన్యానికి నాలుగేసి స్పెషల్ స్టాంపుల చొప్పున విడుదల చేసింది. 1963లో 15 కమెమొరేటివ్ స్టాంపులు విడుదల అయేయి. అందులో ఆఖరి స్టాంపు "యూనివర్సల్ డిక్లరేషన్ ఆఫ్ హ్యూమన్ రైట్స్" సంస్థయొక్క 15వ వార్షికోత్సవ సూచనగా డిసెంబరు 10వ తేదీన విడుదల అయింది.

ఇండియా స్పెషల్ స్టాంపుల విడుదల నడుపుచేసి, స్వదేశీ, విదేశీ స్టాంపు కలెక్టర్ల మన్ననల నందుకుంది. స్టాంపు కలెక్టర్ల ప్రోత్సాహం బాగా లభించింది.

స్టాంపుల పూర్వాపరాలు తెలియచేసే అంశాల ఫోల్డర్లను 'ఫస్టు డే కవర్ల'లో యుంచి ప్రథమంలో వాటిని ఉచితంగా ఇచ్చేరు. కాని మే 8, 1963 నుంచి 7 నయాపైసలు దాని ప్రింటింగు ఖర్చులకు గాను చార్జి చేసేరు. ప్రముఖ పత్రికల సూచనల ద్వారా Mrs.ఎలియనార్ రూజ్వెల్టు స్టాంపు డిసెంబరు 10, 1963 లోను, ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ ఓరియంటలిస్ట్సు న్యూఢిల్లీ సమావేశం, ఉత్కలమని పండిట్ గోపబంధుదాస్ గౌరవార్థం 1964 జనవరి 4వ తేదీన కమెమొరేటివ్‌లు విడుదల అయేయి. 1973 నవంబరు 14న

"ఇండిపెక్స్" ఎగ్జిబిషన్ సందర్భంలో మూడు కమెమొరేటివ్ మల్టీకలర్ స్టాంపుల్ని 20 పై, 1 రూ, 2 రూపాయిల విలువలవి విడుదల అయేయి. అంతేగాక ఒక 15 పైసల స్టాంపు 'ఇండిపెక్స్' 73 నిర్వహించటానికి అంతర్జాతీయ సహకారాన్ని తెలియచేస్తుంది. "స్టాంపుపైన స్టాంపు" ఒక రూపాయి విలువ స్టాంపు 1 1/2 అణా స్టాంపుపై ముద్రించినది. "భారత ఇండిపెక్స్" జ్ఞాపకార్థం విడుదల చేసిన దానిపై 'మచిలీపట్నం కలంకారీ ఏనుగు' చెక్కబడింది. 2 రూపాయిల స్టాంపు నృత్యంచేసే నెమలిని చూపిస్తుంది. దీనికి పూర్వం 8, జనవరి 1973లో రూ. 1-45 స్టాంపు నొకదానిని "ఇండిపెక్స్ లోగో" సూచించేదాన్ని విడుదల చేయటం జరిగింది.

1973 నవంబరు 16 'ఇండిపెక్స్ ఎగ్జిబిషన్'లో 'ఏరో ఫిలేట్లీ డే'గా పరిగణించబడింది. ఆ రోజున రెండువేల కవర్లు పై నాలుగు 'ఇండిపెక్స్' స్టాంపులతోను, స్పెషల్ కేన్సిలేషన్స్తోను, ఒక హాట్ ఎయిర్ బెలూనులో నెదర్లాండ్కి చెందిన డా. బెన్‌మెన్ గాలిలోకి విడిచిపెట్టేరు. ఆ కవర్లు లభించిన వారిది మహా అదృష్టం! వాటికి మంచి విలువ లభించింది. ఈ ఫ్లైట్‌ని "ఎయిర్‌మైల్ సర్వీస్ ఆఫ్ ఇండియా" వారు నిర్వహించేరు. ప్రతి సంవత్సరం కొత్త కొత్త కమెమొరేటివ్ స్టాంపుల విడుదలలను గమనిస్తూనే యున్నాం.

(3) ఎయిర్‌మైల్ స్టాంపులు (Air-Mail Stamps) 1920 సంవత్సరం నుంచి తపాలాలను విమానాలపై పంపించుట ప్రారంభించినప్పట్నుంచి 'ఎయిర్ స్టాంపులు' (Air stams) అను ఒక స్పెషల్ క్లాస్ స్టాంపులు వాడుకలోకి వచ్చేయి. భారతదేశం 1929 అక్టోబరు 22న తొలి ఎయిర్ స్టాంపుని విడుదల చేసింది. ఈ స్టాంపుల్ని సాధారణ స్టాంపులవలె వాడుకోవచ్చు. కాని 1948 జూన్ 8న విడుదల అయిన ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ (Air India International) కమెమొరేటివ్ స్టాంపుని సాధారణ స్టాంపుగా వినియోగించరాదు. వాటిని ఎయిర్ ఇండియావారు ప్రారంభ ఫ్లైట్‌లో లండన్ చేర్చే ఉత్తరాలకు మాత్రమే వాడటం అయింది.

(4) తాత్కాలికములు (Provisional): కొన్ని సందర్భాలలో స్టాంపుల కొరత వచ్చినపుడు స్టాంపుల ముద్రణ తొందరగా జరగాలి. అలాంటి సమయాలలో ఉప్పట్లోయున్న ఇతర స్టాంపులపై ఓవరు ప్రింటింగు (Overprinting) గాని సర్చార్జిగాని (Surcharge) చేస్తారు. వాటినే 'ప్రొవిజనల్స్' (Provisionals) అంటారు. తాత్కాలికంగా అవసరార్థం విడుదల అయిన ఈ స్టాంపులు అచిరకాలంలో 'డిఫెనిటివ్స్'ని విడుదలచేసి స్టాంపుల కొరతను భర్తీ చేస్తారు. ఇటువంటి ప్రొవిజనల్ స్టాంపులు భారతదేశంలో 1891 సంవత్సరంలో 4 1/2 అణాల స్టాంపుపైన సర్చార్జి చేయబడిన 2 1/2 అణాల స్టాంపు, 1898, 1905, 1922 సంవత్సరాలలో 1/2 అణా స్టాంపుపై "1/4", 1921 సంవత్సరంలో 1 అణా స్టాంపుపై "Nine pies", 1946 సంవత్సరంలో 1 అణా 3 పైసల స్టాంపుపై "3 Pies" ఉదాహరణలు. ఇవిగాక 'Service' స్టాంపులపై ఓవరు ప్రింటింగు గాని సర్చార్జి చేయటంగాని జరిగింది. 1960 సంవత్సరంలో కాళిదాసు కమెమొరేటివ్ స్టాంపు రు. 1-03 పై '1 Re' అని ఓవరు ప్రింటు చేయడం జరిగింది. ప్రొవిజనల్ స్టాంపుల విడుదలలో కత్తిరింపు (bisected) రకం ఒకటి యుంది. దీనిని అరుదుగా చేస్తారు. హెచ్చు 'డినోమినేషన్' స్టాంపుని 'డయాగనల్'గా కత్తిరించి దానిలో సగం విలువకు విక్రయిస్తారు. దీనికి ఉదాహరణ. ఈస్టుఇండియా పోస్టేజి 1 అణా, 4 అణాలు, 8 అణాల స్టాంపుల్ని అడ్డంగా కత్తిరించి 1/2 అణా, 2 అణా, 4 అణాల స్టాంపులుగా కొరత సమయంలో విక్రయించబడ్డాయి. అటువంటి స్టాంపులు గల కవర్లు లభ్యమైతే వాటిని కవరుతోసహా సేకరించాలి. స్టాంపుల మార్కెట్టులో వాటి విలువ బాగా యుంటుంది.

(5) అఫీషియల్ (Official) స్టాంపులు - సర్వీసు (Service) స్టాంపులు: ప్రభుత్వ ఆఫీసులలో పోస్టల్ సర్వీసు దుర్వినియోగం కాకుండా అదుపు చెయ్యడానికి ఈ స్టాంపుల్ని విడుదల చేసేరు. సుమారు 1866 నుంచి 1948 వరకు ఇండియన్ డిఫెనిటివ్ స్టాంపులపై "On Her/His Majesty's Service" ని "On H. M. S." ని

'Service'గా పరిచి ఆ స్టాంపులను ప్రభుత్వ ఆఫీసులలో వాడకానికి విడుదల చేసేరు. 1950 సంవత్సరం జనవరి నెలలో భారతదేశం స్పెషల్ 'Service' స్టాంపుల్ని విడుదల చేసింది.

1885 సంవత్సరంలోను, 1911 సంవత్సరంలోను పోష్టాఫీసులు స్టీమర్లపై విదేశాలనుంచి వచ్చే పార్శిళ్ళపై కస్టమ్స్ డ్యూటీ వసూలు నిమిత్తం ఇండియన్ స్టాంపులపై 'Postal Service', 'I.P.N.' (Indian Postal Note) అని ఓవరు ప్రింటింగు చేసేయి. ఇవి పోష్టేజి స్టాంపులుగా ఉపయోగించబడలేదు.

(6) మిలిటరి (Military) స్టాంపులు : భారతదేశంలో మిలిటరీ స్టాంపులు ఇటీవల విడుదల అయ్యాయి. బ్రిటిషువారి పాలనలో భారత సాయుధ దళాన్ని విదేశాలలో యుద్ధ ప్రాంతాలలోని బ్రిటిషు సైన్యాలకు సహాయం చేయవలసినదిగా కోరేవారు. ఇండియాలో స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కాలంలో ఇండియన్ దళాలు కొరియా, ఇండోచీనా, గాజా, కాంగో దేశాల 'శాంతి మిషన్'లలో పాల్గొన్నాయి. ఆ సైనికుల పోష్టు అవసరాలకు 'ఫీల్డు పోష్టాఫీసులు' ( F. P. O. ) వారితో వెళ్ళేవి. ఆ పోష్టాఫీసులు ఇండియన్ స్టాంపుల్ని ఉపయోగించేయి. ఒక ప్రత్యేక దండయాత్ర (expedition) లేదా ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితం చేసేందుకు 1900 సంవత్సరంలో ఓవరు ప్రింటింగు చేసేరు. వాటిని స్థానిక నాణేలతో చౌకగా కొనకుండ యుండటానికి అలా ఓవరు ప్రింటింగు చేసేరు. ఆ ఓవరు ప్రింట్లు 'స్పెషల్ మిషన్లు' సాధించిన పనిని చాటిస్తాయి.

(7) ఛారిటీ (Charity) స్టాంపులు: జాతిసేవకు (National Cause) ధర్మార్థమైన హేతువునకు (Charitable Purpose) కొన్ని సందర్భాలలో పోష్టల్ డిపార్టుమెంటు వారు లోకోపకార (Philantraphic organisations) సంస్థలకు చేయూతనిస్తారు. అప్పుడు 'ఛారిటీ' స్టాంపుల్ని విడుదల చేస్తారు. అలాంటి స్టాంపులపై వాటి పోష్టలు విలువను, ధర్మానికి కేటాయించిన మొత్తాన్ని తెలియచేయడానికి, దేనికెంత కేటాయించింది ప్రింటు చేస్తారు. ఉదాహరణకు 2P+1P,

10P+1P, మున్నగు స్టాంపులు. ఈ విధంగా చాలా దేశాలలో ఛారిటి స్టాంపుల్ని, రెడ్‌క్రాస్, యాంటీ ట్యూబర్ క్యులోసిస్ కాంపైన్ మొదలగు వాని కొరకు ముద్రించబడుతున్నాయి. కాని భారతదేశం ఈ విధంగా నిధులు సేకరణకు ఇష్టత చూపించటంలేదు.

(8) పోస్టేజి డ్యూ (Postage Due) : ఈ రకం స్టాంపులు ముఖ్యంగా విదేశాలలో విరివిగా ఆచరణలో యున్నాయి. ఇండియాలో ఇంకా ఈ పద్ధతి ప్రవేశపెట్టబడలేదు. ఈ స్టాంపులలో మధ్య డిజైను యుండదు. పెద్ద అక్షరాలలో విలువలు వ్రాయబడుతాయి. వీటిని తక్కువ పోస్టేజి అతికించిన పోస్టలు కవర్లు, పార్సిళ్ళకు అతికిస్తారు. పోస్టల్ వారికి ఎంత మిగతా ఛార్జీ చెల్లించాలో తెలియచేస్తుంది. ఆ విలువని ఎడ్రసీలు చెల్లించాలి,

## 10. ప్రతిష్టాకరమైన స్టాంపులు

### (Prestegious Stamps)

ప్రతిష్టాకరమైన స్టాంపులలో ముఖ్యమైనవి (1) ఒక సెంటు బ్రిటిషు గయూనా స్టాంపు. (2) పోష్టాఫీస్ మార్షియస్ స్టాంపు (3) 1886 డొమినిక స్టాంపు. వీటి చరిత్రలు చాల అద్భుతంగా యున్నాయి. ఆ స్టాంపుల్ని సేకరించటం సామాన్య విషయంకాదు. ఒక్కొక్క స్టాంపు కొన్ని వేలు, లక్షలు రూపాయిల విలువ గలిగి యుంటుంది. ఇటువంటి అరుదైన స్టాంపుల్ని స్వంతం చేసుకోవాలని కోటీశ్వరులు పోటీ పడుతూ యుంటారు. అందుచేత వీటికి ఒక నిర్ణీత విలువ అన్నది యుండదు. అరుదైన స్టాంపుల్ని అమ్మదలచు కున్నవారు వేలంలోనే అమ్ముతారు. పోటీజాగా యుంటుంది. ప్రఖ్యాత వేలాల సంస్థలు ఈ వేలాల్ని నిర్వహిస్తాయి. లండన్‌నగరం స్టాంపుల ప్రచారానికి హృదయం వంటిది. వేలం నిర్వహించేముందు ఆస్టాంపుల

యొక్క ప్రత్యేకతల్ని బాగా ప్రచారం చేస్తాయి. అలాటి సంస్థలు ఇంగ్లాండులోనే గాక అమెరికా, గ్రీస్, ఫ్రాన్స్ దేశాలలో కూడ యున్నాయి. ఇండియాలో "స్టాంపు ఎంటర్ ప్రయిజస్ ఆఫ్ కలకత్తా" (Ms. Stamp Enterprisers of Calcutta), "బి.సి. లుహాడియా ఆఫ్ జైపూర్" (B.C. Luhadia of Jaipur) సంస్థలు ప్రఖ్యాతమైనవి.

1860 సంవత్సరం ప్రాంతంలో స్టాంపు కలెక్షన్ హాబీగా భావించబడినా, పెద్ద పెద్ద వారు దీన్ని చేపట్టడంతో స్టాంపుల తయారి విషయం, చరిత్రలపై స్టాంపు కలెక్టర్ల మోజు హెచ్చయింది. ముఖ్యంగా డ్యూక్ ఆఫ్ యార్క్ [పంచమ జార్జి] స్టాంపు కలెక్షన్‌పై ఆసక్తి చూపటంతో స్టాంపుల చరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభం అయింది. లండన్ ఆక్షన్ల సంవత్సరిక టర్నోవరు £ 1,000,000 మించిపోయింది. అరుదైన స్టాంపులు చాలావరకు ఆక్షన్ల ద్వారానే అమ్ముడయేవి. న్యూయార్కు వాసి ఆల్ఫ్రెడ్ హెచ్ కాస్పరీ యొక్క విలువైన స్టాంపుల కలెక్షను 16 ఆక్షన్లలో £ 1,000,000 లను సంపాదించి పెట్టింది. అనేక అరుదైన విడి స్టాంపులు ఒక్కొక్కటి £ 1,000లకు అమ్ముడయేయి. P. Iarvon Ferrary స్టాంపు కలెక్షన్ 1922లో పారిస్‌లో అమ్మినప్పుడు 1 సెంటు బ్రిటిషు గయానా స్టాంపు £ 7,343 రాబట్టింది. 1959లో ఒక 1d మారిషస్ 'Post Office' స్టాంపు £ 4,500లకు అమ్ముడయింది.

ఎలిజబెత్ II రాణిగారి స్టాంపు కలెక్షను బ్రిటిషు కామన్వెల్తు దేశాల్లో కెల్లా పెద్దదని, మిక్కిలి విలువైనదని. దీనిని బకింగ్‌హామ్ పాలెసులోని స్టాంపు రూములో భద్రపరచేరు.

థామస్ కియె టాప్లింగ్ (Thomas Keay Tapling) అను ప్రఖ్యాత స్టాంపు కలెక్టరు తన కలెక్షన్ని బ్రిటిషు మ్యూజియంకు బహూకరించాడు. అమెరికాలోని వాషింగ్టన్ నగరంలోని స్మిత్సో

నియన్ (Smithsonian) సంస్థలో అమెరికా జాతీయ పోస్టేజి స్టాంపుల కలెక్షను భద్రపరచేరు.

ఒకొక్కొక్క స్టాంపు కలెక్టరు తన జీవిత కాలంలో సేకరించిన అరుదైన స్టాంపుల్ని ఈ సంస్థల ద్వారా వేలంలో అమ్ము జూపుతారు. ఇంగ్లాండు రాణీగారి స్టాంపుల సేకరణ చాలఅరుదైనది. అది మిక్కిలి పెద్దదైన వాటిలో ఒకటి. దానిని "ఇండిపెక్స్ 73" (Indipex 73) ఎగ్జిబిషన్‌లో ప్రదర్శించేరు.పంచమ జార్జిచక్రవర్తి ఒకప్పుడు స్టాంపులు తనకు జీవితకాలంలో అత్యంత సుఖాన్ని ప్రసాదించేయని తెలియ చేసాడు. అరుదైన స్టాంపుల చరిత్రలు మైమరపించి గగుర్పాటు కలుగ చేస్తాయి.

## (1) 1 సెంటు బ్రిటిషు గయానా స్టాంపు

**(I Cent British Guiana Stamp)**

**1856** సంవత్సరంలో విడుదల అయిన "1 సెంటు బ్రిటిషు గయానా స్టాంపు ప్రపంచంలోకెల్లా అతి అపూర్వమైనది. అరుదైనది విచిత్ర చరిత్ర గలదీని. ఇంత అరుదైన స్టాంపుని సేకరించుట ప్రపంచంలో కోటీశ్వరులకు ప్రతిష్టాకరంగా పరిగణింప బడుటతో వేలంలో దీని విలువ కనీ వినీ ఎరుగని స్థాయి చేరుకుంది.

బ్రిటిషు గయానా పోస్టు స్టాంపుల్ని మొదట్లో "వాటర్‌లో అండ్ సన్స్" అనే బ్రిటిషు ప్రింటింగు సంస్థ ముద్రించింది. 1856 సంవత్సరంలో బ్రిటిషు గయానాలో స్టాంపుల స్టాకు అయిపోయింది. కొత్తవి సరఫరా అవలేదు. అందుచేత బ్రిటిషు గయానాలోని పోస్టు మాష్టారు అదే డిజైనులో కొంత సీలు అయిన-ఒక నౌక "Damus Petimusque Vicis Bim" (We give and we seeks in return) అనే ఆశయం (moto)తో స్థానికంగా 4 సెంట్లు స్టాంపులు తొందరగా ముద్రింపచేసేడు. ఈ కొత్త స్టాంపులు మేగ్నెటా పేపరు పై

నల్ల ఇంకులో ప్రింటు అయేయి. కానీ ఆ ఇంకు మంచిది కాకపోవుటచే ఇతరులు ఫోర్జరీ చేయుటకు వీలుకాకుండా స్టాంపు అమ్మే ముందర పోష్టల్ అధికారులను వాటిపై సంతకము చేయాలని ఆ పోష్టుమాష్టారు ఆదేశించేరు. 17 సంవత్సరాల తరువాత 1873 సంవత్సరంలో "L. వెర్నర్ వాగన్" అనే 12 సంవత్సరాల బ్రిటీషు గయానా బాలుడు స్టాంపు సేకరణ చేస్తూ తన ఫామిలీ లెటర్లలో 'E.D. Wright' ఇనీషియల్ గల 1 సెంటు స్టాంపుని గమనించేడు. ఒక 4 సెంట్ల స్టాంపు 1 సెంటు విలువలో పొరపాటున ప్రింటు అయినట్లు ఆ బాలునికి అప్పటిలో ఏమి తెలుస్తుంది? ఇతర స్టాంపులతోపాటు ఆ స్టాంపుని కూడా తన ఆల్బంలో చేర్చేడు. ఆ స్టాంపు నలుమూలలు కత్తిరించబడి పరిశుభ్రంగా కూడా లేదు. వాగన్ దానిని అమ్మి ఆకర్షనీయమైన 'ఫారిన్' స్టాంపులు కొందామని నిశ్చయించుకున్నాడు. స్థానికంగా యున్న స్టాంపు కలెక్టర్ 'N.R. కిన్నాన్'కి అతికష్టంపై ఆ స్టాంపుని 6 షిల్లింగులకు [రు. 5-40] అమ్మివేసేడు. అది అతి విలువైన స్టాంపు అని పాప మతనికేమి ఎరుక !

ఐదు సంవత్సరాల అనంతరం ఆ స్టాంపుని కిన్నాన్ లివర్‌పూల్ లోని "థామస్ రిడ్‌పాత్" అనే స్టాంపు కలెక్టరికి £ 120 [రు. 2, 160/-]కి అమ్మివేసేడు. కానీ రిడ్‌పాత్ దాన్ని అట్టే కాలం వుంచుకోలేదు. అదే సంవత్సరంలో ప్రఖ్యాత ఫ్రెంచ్ స్టాంపు కలెక్టర్ "ఫిలిప్‌లా రీ నోటిరి వాన్ ఫిర్రారీ (Ferrary)"కి £ 150 పౌన్లకి (రు. 2700/-) దాన్ని అమ్మివేసేడు. క్రమేణా ఆ స్టాంపు యొక్క అపురూపత ప్రపంచమంతా వ్యాపించింది. ఫెర్రారీ మట్టుకు ఆ స్టాంపుని తన జీవితకాలంలో అమ్మలేదు. 1917 సంవత్సరంలో తాను చనిపోయే ముందు తన స్టాంపు కలెక్షన్‌ను బెర్లిన్ పోష్టల్ మ్యూజియంలో యుంచాలని తన వీలునామాలో వ్రాసేడు. దాని ప్రకారం

అతని స్టాంపుల నన్నింటినీ బెర్లిన్ పోష్టల్ మ్యూజియంకు తరలిం చడం జరిగింది.

కాని ఫ్రెంచి వారు జర్మనీపై పందెత్తినప్పుడు జర్మనీ ఓడిపోయింది. దాని ఫలితంగా ఫ్రెంచి ప్రభుత్వం యుద్ధ ఖర్చుల (War Repatriation) ఎకౌంటు క్రింద ఆ స్టాంపులను శత్రుధనంగా పరిగణించింది. **1921 – 1925** సంవత్సరాల మధ్యకాలంలో ఆ స్టాంపు వేలం **14** పర్యాయాలు జరిగింది. **1922** సంవత్సరంలో 'ఆర్థర్ హింద్' అను ఒక అమెరికా కోటీశ్వరుడు ఒక వేలంలో ఆ **1** సెంటు బ్రిటిషు గయానా స్టాంపు £ **7343** పౌన్లకి [రు. **1, 32,000/-**] కొన్నాడు. **1933** సంవత్సరంలో ఆర్థర్‌హింద్ చని పోయే పర్యంతం ఆ స్టాంపు అతని వద్దనే యుంది. అతని స్టాంపు కలెక్షన్ని అతని ఎస్టేటులో భాగంగా ప్రభుత్వం పరిగణించగా, అతని భార్య ఆ ఒక సెంటు బ్రిటిషు గయానా స్టాంపు తన భర్త తనకిచ్చిన కానుక అని కోర్టులో వాదించి కేసు గెలుచుకుంది. **1940** సంవ త్సరం వరకు ఆమె ఆ స్టాంపుని బ్యాంకు వాల్టులో భద్రపరిచింది. తరువాత అదే సంవత్సరంలో ఆ స్టాంపుని ఆమె $ **40,000** డాల ర్లకు [రు. **30000**౦/-] ఒక ఆస్ట్రేలియన్ స్టాంపు కలెక్టరికి అమ్మివేసింది. దాన్ని కొన్నవారి పేరు రహస్యంగా యుంచాలని కోరేడు. కానీ **1970**లో దాన్ని న్యూయార్కులో వేలం వేసిన ప్పుడు ఫ్లోరిడాలో నివసిస్తున్న ఫ్రెడరిక్ T. స్మాల్ (Frederiek T.Small) అనే ఆస్ట్రేలియన్ ఇంజనీరు ఆనాడు కొన్నట్లు తెలిసింది.

ఆ పెద్దమనిషి చేతిలో ఆ స్టాంపుయుండగా 'Mr. పిన్చర్ కెన్ని' **1965** జనవరి **26** వ తేది సాయంత్రం న్యూయార్కు నుండి 'సిల్వర్ రెడ్ బోయింగ్ **707**'లో లండన్ ఎయిర్ పోర్టులోకి దిగి 'స్టేన్లీగిబ్బన్ కేటలాగ్ సెంటినరీ' ఎగ్జిబిషన్‌కి ఆ స్టాంపుని తీసుక వచ్చేడు. ప్రెస్‌రిపోర్టర్లు, న్యూస్‌రీల్, కెమేరామెన్ తదితరులతో ఆ

ఎయిర్‌పోర్టు కిక్కిరిసిపోయింది. ప్రజల ఆదుర్దాకి అంతులేదు. ఈ ఒక సెంటు స్టాంపు £ 200,000 (రు. 36,00,000/)లకు ఇన్సూరు చేయబడింది! స్పెషల్ బాడీగార్డుల సాయంతో దాన్ని ఎగ్జిబిషన్‌లో ప్రదర్శించటానికి ప్రత్యేక ఏర్పాట్లు చెయ్యబడ్డాయి. మర్నాడు ఉదయం విలువ కట్టుటకు అతీతమైన ఆ చిన్న కాగితం ముక్క ఆ రోజు 'టాపిక్' అయింది. న్యూస్ పేపర్లలో హెడ్‌లైన్స్, B. B. C. లో స్పెషల్ ప్రోగ్రాములు ఆ స్టాంపుని గురించినవే ఆనాడు!

ఈ స్టాంపుని ఏప్రిల్ 1970 లో న్యూయార్కులో తిరిగి వేలం వేసేరు. ఆక్షనుహాలు కోటీశ్వరులతో క్రిక్కిరిసి యుంది. వేలం పాట పోటీలమీద మిన్నంటుతూయుండే, ప్రేక్షకుల ఉద్రేకానికి (Excitement) పరిమితులు లేవు. ఆ ఒక సెంటు బ్రిటిషు గయానా స్టాంపు చివరికి $ 2,80,000 (రు. 21,00,000/-) డాలర్లకు పెన్సిల్‌వేనియాలోని Miner Stamp లు ప్రొప్రయిటరు వీన్‌బర్గ్ (Mr. Weinberg) తన వ్యాపార మదుపుకి కొన్నాడు. 1980 ఏప్రిల్‌లో ఈ స్టాంపు కేటలాగు వెల $ 425,000. ఈ స్టాంపుతో వీన్‌బర్గ్ ప్రయాణం చేసేటప్పుడు ఇద్దరు సాయుధ గార్డులు తన వెంట యుండే వారని తెలియచేసేడు. కొంతకాలం అయేక ఇది ఒక అమెరిన్ వేలంలో యు. యస్. ఒక మిలియన్ డాలర్లకు అంటే ఒక కోటి రూపాయలకు అమ్ముడయిందని ప్రముఖ భారత ఫిలటలిస్టు శ్రీ ఎం. సి. శుభాని తెలియచేసేరు.

ఈ స్టాంపు "ప్రపంచ ఫిలటిక్ రేరిటీ"గా భావించబడుతోంది. ఈ స్టాంపుని 1980 సంవత్సరంలో 'India 80' ఎగ్జిబిషనులోని 'హాల్ ఆఫ్ నేషన్స్' (Hall of Nations) లో మధ్యభాగంలో బుల్లెట్ ప్రూఫ్ డోమ్ ఆకారం గల కేసులో ప్రదర్శించబడింది. గిబ్బన్ వారి కేటలాగులో దాని విలువ £ 42500 అని ప్రచురించేరు. ఎగ్జిబిషన్

నిర్వాహకులు దాని విలువను పది మిలియనుల రూపాయలని కట్టేరు. అప్పటికీ ఈ స్టాంపు Mr. Grivin Weinberg of U.S ఆధీనంలోనే యుంది. ఈ స్టాంపు 1971లో న్యూయార్కులోని Waldorb Astoria Hotel లో మిక్కిలి ప్రతిష్ఠాకరమైన 'కలెక్టర్స్ క్లబ్' 75 వ అని వర్సరీ సందర్భంలో ప్రదర్శించబడింది.

## (2) 'పోష్టాఫీస్' మార్షియస్ స్టాంపు 1847

'పోష్టాఫీస్' మార్షియస్ స్టాంపు చరిత్ర విస్మయం కలిగిస్తుంది. మార్షియస్ హిందూ మహాసముద్రంలో ఒక చిన్న ద్వీపం. పోష్టేజి స్టాంపుల విడుదల చేయుటలో ప్రపంచంలో ఐదవ స్థానం అలంకరించింది. 1847 సంవత్సరంలో మార్షియస్ 1d, 2d స్టాంపులు ముద్రించటానికి తలపెట్టింది. మార్షియస్ గవర్నరు భార్య లేడీగోమ్‌కు 30 సెప్టెంబరు 1847 న ఫాన్సీబాల్ (Fancy ball) ఏర్పాటు చెయ్యాలన్న సంకల్పం కలిగింది. తన స్నేహితులకు ఆహ్వానాలు పంపించుటకు వ్యవధి తక్కువ అవటం ఆమెకు అదో పెద్ద సమస్య అయింది. అదే సమయంలో ఆమెకు లండన్ నుంచి అనేక లేఖలు వచ్చేయి. వాటిపైన విక్టోరియా మహారాణి తలగల చిన్నలేబిల్సు కనిపించేయి. అంతకుపూర్వం ఈ లేబిల్సుయుండేచోట సాధారణ పోష్టు మార్కులుండేవి. దీనిని గమనించిన గోమ్‌కు ఒక ఆలోచన తట్టింది. మార్షియస్ కోలనీ కూడ తన స్టాంపుల్ని ముద్రించి వాటిని తాను ప్రథమంగా వాడుక చేసిన ఖ్యాతి తనకు దక్కాలనుకుంది. వెంటనే జె. బర్నార్డ్ అనే వాచిమేకరు ప్లేటుపై డిజైన్లు చెక్కగలడని తెలిసి అతనిని 1 d, 2 d, డైస్‌లను తయారుచేసి పట్టుకొని రమ్మని ఆదేశించింది. సెంటరులో విక్టోరియారాణి తలపైన 'Postage' దిగువని 'Value', 'Martius', కుడివైపు 'Post Paid', ఎడమవైపుయుండాలని చెప్పింది. ఒక్కొక్క రకానికి 500 స్టాంపులు అర్జంటుగా ముద్రిం

చాలని చెప్పింది. బెర్నార్డు ఆ డిజైను పూర్తిచేసి స్టాంపులు ముద్రించేడు. కాని 'Post Paid' బదులు 'Post Office' అని డిజైనులో చెక్కేడు. ఈ పొరపాటు ఒక విచిత్ర సంఘటన వలన జరిగింది. బెర్నార్డు 'Martius', 'Postage' 'Value' అను డిజైనులో చెక్కిన తరువాత పోష్టుమాష్టరు ఏమేమి చెక్కాలో వ్రాసి యిచ్చిన చీటీ తన పడక పోవటంతో, ఎడమచేతవైపు ఏమి చెక్కాలో జ్ఞప్తికి రాలేదు. అందుచేత పోష్టుమాష్టార్ని కలిసి తెలుసుకుందామని తొందరగా బయలుదేరేడు. పోష్టాఫీసుకు చేరగానే బెర్నార్డుకి 'Post office'అన్న బోర్డు ఎదురయింది. ఆ మాటే తను మరచిపోయినదనుకొని తిరిగి వెనక్కి వెళ్ళి 'Post office' అని ఆ డిజైనులో చెక్కేడు. ఫలితంగా ఆ స్టాంపులు తప్పుడుగా 'Post Paid' బదులు'Post office' అని ముద్రించబడ్డాయి. లేడీగామ్‌కి దాని ప్రసక్తిలేదు. తన సందడిలో ఆ స్టాంపుల నతికించి ఆహ్వానాలు పంపించేసింది. ఆ స్టాంపులే నేడు ప్రపంచంలో మిక్కిలి అరుదైనవిగా ఖ్యాతి చెందేయి. నేడు ఆ 1 d, 2 d స్టాంపులు రెండుగల (మార్షియస్ 1847) కాన్సిలేషన్ కవరు 7 లక్షల రూపాయలకు మించి విలువ కలిగియుందీ అంటే అరుదైన ఫిలటలిస్టుల మోజు ఎంతయుందో ఊహించవచ్చు.

ఈ స్టాంపులు 20 సెప్టెంబరు 1847న అమ్మకానికి విడుదల అయేయి. కాని 1864 సంవత్సరం వరకు ఆ పొరపాటును ఎవరూ గమనించలేదు. 1864 సంవత్సరంలో Madam Borchard (Wife of Bordeaur merchant) ఈ అపూర్వ స్టాంపుల్ని పన్నెండింటిని తన భర్తయొక్క లేఖలలో గమనించింది. ఆమె అదృష్టం పండింది. ఈ రకం స్టాంపులు 26 మాత్రమే యున్నట్లుప్రతీతి. అందులో పద్నాల్గు 1 d విన్ని, పన్నెండు 2 d స్టాంపులున్న. చేతులు మారుతున్న కొద్దీ వాటి విలువలు ఆకాశాన్నంటుతున్నాయి.

ఈ రెండు స్టాంపులు గల కవరొకటి బొంబాయిలో 'Thos 'Jerrom Esq' అను నాతనికి 4 జనవరి 1850లో పోస్టు అయింది. దీని చరిత్ర మరీ చిత్రంగా యుంది. ఈ కవరు భారతదేశంలో నడి బజారులో ఒకరికి దొరికింది. దాన్ని 'హోవార్డు' (Moward) అనునాతడు £ 50 (రు. 900/-)కి కొన్నాడు. అతడు దాని లండన్‌లో £ 1600 (రు. 28,800/-)లకు అమ్మేడు. 1906 సంవత్సరంలో ఆ కవరు తిరిగి £ 2200 (రు. 39,600/)లకు అమ్మబడింది. 1917 సంవత్సరంలో అది ఎ. ఎఫ్. లిచ్-టెన్‌స్టీన్ (Mr. A. F. Lich-Tenstein అను నాతడు $ 5,000 కి కొన్నాడు.

అతడు 1947 సంవత్సరంలో చనిపోయేడు. తరువాత అతని కుమార్తె దాన్ని అంకించుకుంది. 1968 సంవత్సరంలో $ 3,80,000 డాలర్లకు (రు. 28,50,000/) ఆమె "రేమాండ్ హెచ్ విలికంపెనీ ఆఫ్ న్యూ ఆర్లియన్స్ Raymond H. Weileco of New orleansకి అమ్మివేసింది. నిజంగా ఒక చిన్న కాగితం ముక్క సేకరణ అంత భాగ్యానికి నోచుకుందంటే నమ్మశక్యంగాని విషయం కాదా! మార్షియస్ 1d. 2d స్టాంపులు ప్రపంచంలోని అతి ప్రతిష్టాకరమైన స్టాంపులని వేరే చెప్పనక్కరలేదు. ఈ కవరు 1971 లో న్యూయార్కులోని waldorb Astoria Hotel లో మిక్కిలి ప్రతిష్టాకరమైన కలెక్టర్ల క్లబ్బు 75 వ వార్షికోత్సవ సందర్భంలో ప్రదర్శించబడింది.

## (3) 1886 డొమినిక స్టాంపు

'డొమినిక' అరేబియన్ సముద్రంలో ఒక ద్వీపం. దీనిని క్రిష్టఫర్ కొలంబస్ 1494 నవంబరు 3 వ తేదీన "The Lord's Day" (Dies Dominica) కనుగొన్నాడు. దీని ఆక్రమణ కోసం బ్రిటిషు ఫ్రెంచి వారు సుమారు 200 సంవత్సరాలపాటు పోరాడేరు. చివరకు ఫ్రెంచి వారు దీనిపై హక్కులను వదులుకున్నారు. ఈ ద్వీపం అనేక టూరిస్టు

లను ఆకర్షిస్తుంది. 365 నదులు, ఎత్తైన పర్వత శిఖరాలు కలిగి, ఒక ప్రక్క అరేబియన్ సముద్రం, మరియొకవైపు అట్లాంటిక్ మహా సముద్రం కలిగి అందంలో అందాలొలే ద్వీపం ఇది. అనేక అమెరికన్ టూరిష్టులను ఆకర్షిస్తుంది. దీనికి మంచి ఫిలటిక్ చరిత్ర వుంది. 1886 సంవత్సరంలో డొమినిక విడుదలచేసిన 6d పై 1d ముద్రించిన స్టాంపు చాలా అరుదైనవి. దీని విలువ సుమారు £ 3000 పైబడి యుంది.

## (4) ప్రపంచ రికార్డు వెల సంపాదించిన U.S. స్టాంపు

135 సంవత్సరాల క్రితం 2 సెంట్ల విలువగల లేడియం-సిగిల్ (Lady Megill) అనే U. S. స్టాంపు ఇటీవల 1987 సంవత్సరం అక్టోబరులో వేలంలో $ 1.1 మిలియన్ల వెల సంపాదించినట్లు న్యూయార్క్ ఆక్షనర్ల వలన తెలియవచ్చింది. ఒక సింగిల్ స్టాంపు ఇంత వెల సంపాదించటంలో ప్రపంచ రికార్డుగా పరిగణింపబడింది. ఒక జపాన్ బ్యాంకు "లేడియం సిగిల్" (Lady MC. gill) అనే ఈ స్టాంపుని 9 అక్టోబరు 1987 న కొన్నట్లు 'కోచ్ ఇన్వెస్టు మెంట్సు' (Coach Investments) చైర్మన్ Mr. మార్క్ రౌసో (Marc Rousso) తెలియ చేసేరు. బ్యాంకు పేరు చెప్పడానికి ఆయన నిరాకరించేరు. ఇంతకు పూర్వం ప్రపంచ రికార్డు వెల సంపాదించిన ఒక సింగిల్ స్టాంపు 1985 బ్రిటిషు గయానా ఒక సెంటు మాగ్నెటా స్టాంపు. దీనిని న్యూయార్క్‌లోని వాల్‌డార్ఫ్ ఆస్టోరియా (Newyork's Waldorf Astoria Hotel) హోటల్‌లో $ 935,000కి ఏప్రిల్ 5, 1980 లో ఒక అజ్ఞాత స్టాంపు కలెక్టరు వేలంలో కొన్నాడు.

# 11. పోస్టలు చరిత్రలో ప్రఖ్యాత స్టాంపు విడుదలలు

పోస్టలు చరిత్రలో అనేక ప్రఖ్యాత స్టాంపు విడుదలలో ముఖ్యమైనవి.

(1) గ్రేటు బ్రిటనుదొంకి 'పెన్నీ బ్లాక్' - మొదటి జిగురు గల స్టాంపు.

(Peuny Black of Great Britain - First adhesive stamp - 6 th May 1840.)

(2) మారిషియస్ 2 d 'పోస్టాఫీస్' స్టాంపు.

(2 d "Post Officc Mauritius" — 1847.)

(3) కేప్ ఆఫ్ గుడ్ హోప్ 'త్రికోణ' స్టాంపు.

(Cape of Good Hope 'Triangular' — 1853.)

(4) బ్రెజిల్ దేశ 60 రీస్. - స్టాంపు.

(60 - reis of Brazil, nicknamed "The bull's eye" - 1843)

(5) దక్షిణ ఆఫ్రికా యుద్ధ కాలపు 'బన్టాం' స్టాంపు.

("Bantam" War-time stamp of South Africa, Printed halfsize to sane paper - 1942)

(6) చైనా దేశ 'డ్రాగన్' స్టాంపు.

("Dragon" stamp of China - 1894.)

(7) రెండవ ప్రపంచ యుద్ధంలో 'కేయన్' నగర ధ్వంసాన్ని సూచించే ఫ్రెంచి స్టాంపు.

(French stamp sho showing ruins oj Caen - 1945).

(8) 'అన్నిగోని' చిత్రాన్ని సూచించే బ్రిటిషు కామన్వెల్తు. ఫి. జి. స్టాంపు.

(British Commonwealth Stamp showing the Annigori Portrait. (Fiji) - 1961)

(9) ప్రపంచ ఆరోగ్య సంస్థ స్టాంపు.

(W. H. O. Stamp With malaria eradication overprint. (Switzerland) — 1962.)

(10) అమెరికా ఫెడరల్ స్టాంపుల్ని విడుదల చేయుటకు పూర్వం అలెగ్జాండ్రియా పోష్టుమాస్టరు విడుదల చేసిన స్టాంపు — 1845.

(11) 1918లో విడుదల అయిన 24 సెంట్ల అమెరికా ఎయిరు మైలు తలక్రిందు స్టాంపులు.

(12) 1851లో హవాయ్యిన్ 2, 5 సెంట్ల "మిషనరీ" స్టాంపులు.

(13) గులాబి రంగు బదులు ఆకుపచ్చ రంగులో ప్రింటు అయిన 1851 సంవత్సరపు 9 - క్రియుట్జర్ స్టాంపు.

(14) ఆకుపచ్చ రంగుకు బదులు పసుపు రంగులో ప్రింటు అయిన స్వీడన్ 3 స్కిల్లింగ్ స్టాంపు — 1855.

## 12. పోష్టేజి స్టాంపుల ముద్రారాక్షసాలు

పోష్టేజి స్టాంపుల్ని ముద్రించేముందు, విడుదల చేసేముందు పోష్టల్ డిపార్టుమెంటు వారు అతి జాగ్రతతో పరిశీలిస్తారు. అయినా కొన్ని స్టాంపులు వారి దృష్టిని తప్పించుకుని తప్పులతో బయట పడుతూ యుంటాయి. స్టాంపుల ముద్రణలో తప్పుల్ని గమనించగానే ప్రభుత్వం వాటి విడుదలను వెంటనే నిలుపు చేస్తుంది. ఒక్కొక్కప్పుడు తప్పులున్న కొన్ని స్టాంపులు బైటపడి అమ్ముడై పోతాయి. స్టాంపుల్ని కొనేవారు కూడ ఆ ప్రింటు తప్పుల్ని గమనించక పోవచ్చు. కొన్ని చేతులు మారేక గాని, కొన్ని సంవత్సరాలు గడిచేక గాని, అవి ఏ స్టాంపు కలెక్టరు సూక్ష్మదృష్టికో గుర్తై వెలుగులోకి వస్తాయి. ఆ

స్టాంపు కలెక్టరు అలాటి స్టాంపుల్ని సేకరించి భద్ర పరుస్తాడు. సాధారణంగా ప్రింటింగు పొరపాట్లు గల స్టాంపులు చాలా స్వల్ప సంఖ్యలో యుంటాయి. అందుచేత ఆ స్టాంపులు చాలా అరుదుగా లభ్యమవుతాయి. వాటి విలువలు వేలమీద లక్షలమీద యుంటాయి.

స్టాంపులు పెద్ద మొత్తంలో ముద్రించబడతాయి గనుక, మానవతా తప్పులు, యాంత్రిక తప్పుల వలన "ప్రింటింగులో తప్పులు" తరచు కానవస్తాయి. పేపరులో ఒక ముడత ప్రింటింగు ప్లేటు చేరితే ఒక తెల్ల గీత ఆ ప్రింటింగు షీటుకి అడ్డంగా పడుతుంది. లేదా, ఒక కాగితం మడతపడితే ప్రింటుకాని కాళీ భాగం కనపడుతుంది. ఒక చిన్న దుమ్ము కణము ప్రింటింగు ప్లేటు పైన యుంటే అది ఎక్కువ ఇంకు పీల్చుకుని షీటుపై అనవసరమైన 'ఇంప్రెషన్' కలుగచేస్తుంది. ఆ దుమ్ము కణం ఒకవేళ ప్రింటు కారక ముందు జారిపోతే ఆ చోట స్టాంపు డిజైనులో తెల్లటి మచ్చ ఏర్పడుతుంది. ఇటువంటి వాటి వలననే 1947 సంవత్సరంలో విడుదల అయిన ఇండిపెండెన్స్ కమెమొరేటివ్ స్టాంపులలో 'కామా' మాదిరి మచ్చ "7" పైన కానవచ్చింది. ఈ మాదిరిగా ఒక షీటు ప్రింటింగు ప్లేటు చేరేముందు తలక్రిందు పడితే ప్రింటెడు డిజైను గమ్‌వైపు పడుతుంది. ఇలాటి స్టాంపుల్ని కొన్నింటిని పరిశీలిద్దాం.

## (1) మిస్సింగు కలరు తప్పులు - డిజైనులో తప్పులు

స్టాంపుల ముద్రణలో రెండుగాని అంతకన్న హెచ్చు రంగులుగాని వాడవలసివస్తే ఒక ప్రత్యేక ప్రింటింగు ప్లేటుని ఒక్కొక్క రంగుకి వాడాలి. అందుచేత ప్రింటింగు పేపరును ఆయా రంగుల కోసం ఒక ప్లేటు తరువాత మరో ప్లేటు వద్దకు ప్రింటింగు పూర్తి అవడానికి పంపించాలి. అలాటి సందర్భాలలో మొదటి రంగు ఇంప్రెషన్ పడ్డాక రెండవ ఇంప్రెషన్ ముద్రించేటప్పుడు రెండు షీట్లు అంటుకపోతే ఆ రెండవ ఇంప్రెషనుపై షీటు మీద మాత్రమే పడి క్రింది

షీటు మీద పడదు. ఇలాటి సందర్భాలలో "మిస్సింగ్ కలరు" తప్పుకి తావిస్తుంది. వీటినే "స్టాంపుల పొరపాట్లు" లేక "ఫ్రీక్స్" (freaks) అంటారు. ఫిలటలిస్టులు ఇటువంటి వాటిని వెయ్యి కళ్ళతో వెదికిపెట్టా యుంటారు. వారికి అవి వినోదం కలుగ చేయటమే గాక వారి కలెక్షను మంచి విలువ నిస్తాయి. మొదటి ఇంప్రెషన్ అయిన రెండవ ఇంప్రెషన్ తలక్రిందుగా పడి "తలక్రిందు డిజైన్"కి తావిస్తుంది. ఇండియన్ స్టాంపులలో ఈ మిస్సింగు కలరు తప్పు 1963లో రెడ్ క్రాస్ సెంటినరీ స్టాంపులలో "రెడ్ క్రాస్" లేకుండ యున్నది దీనికి చక్కటి ఉదాహరణ.

## (2) తలక్రిందు స్టాంపులు

**(Invert Strmps)**

1854 సంవత్సరంలో విడుదల అయిన నాలుగు అణాల ఇండియన్ స్టాంపులలో రాణి తలక్రిందు ముద్రణ "ఇన్వర్టు స్టాంపులకు" ఉదాహరణ. ఈ స్టాంపుల్ని లిథోగ్రాఫ్ ప్రోసెస్సులో 1854 లో సర్వేయర్ జనరల్ ఆఫీసు విడుదల చేసింది. ఆ వరం వరలో నాలుగు అణాల స్టాంపులు మాత్రమే రెండు రంగులలో ప్రింటు చేయబడ్డాయి. మిగతావన్నీ ఒకే రంగులో ప్రింటు అయ్యేయి. ఫ్రేము, స్టాంపు తల వేరువేరు ఆపరేషన్లలో ప్రింటయేయి. ప్రింటింగు హడావిడిలో ఫ్రేము సంబంధం లేకుండా తలక్రిందు వైపు యుంది. కాని ఈ పొరపాటు మరి ఇరవై సంవత్సరాల వరకు కనుగొన బడ లేదు. ఫ్రేములో తలక్రింది వైపు యున్న స్టాంపులు సుమారు ఇరవై నాలుగు యున్నట్లు అంచనా. ఒక్కొక్క స్టాంపు నేడు £ 1,400 (రు. 25,200/-) పైగా విలువ కలిగియుంది. కెప్టెన్ త్రూయిల్లర్ చేసిన ఈ చిన్న పొరపాటు తరువాతి సంతతివారు పెద్ద వ్యాపారం చేసుకుని ఎంతో డబ్బు చేసుకోవటానికి దారి తీస్తుందని ఎవరు కలగన్నారు! ఈ స్టాంపులు మిక్కిలి అరుదైనవి, విలువైనవి కూడ.

"కట్ టు షేప్" (cut to shape) స్టాంపు ఒక్కొక్కటి రు.1500/- లున్నా, "కట్ ఎ స్క్వేర్" (cut a square) స్టాంపు ఒక్కొక్కటి రు. 40,000/- లున్నా విలువ కలిగి యున్నాయి. "కట్ ఎ స్క్వేర్' స్టాంపులు రెండు మాత్రమే లభ్యమయేయి. ఆ స్టాంపుల విలువ ఇంతగా మారుతుందని కలలోనైనా ఎవరూ ఊహించలేరు. స్టాంపుల ప్రపంచంలో చిత్రం అదే! స్టాంపుల ముద్రణలో పొరపాట్లు రావటం హఠాత్ సంఘటనలు కూడా. అలాటి సంఘటనలు చాల అరుదు గాన అవి నమ్మశక్యం గాని విలువలకు దారితీసేయని ప్రఖ్యాత ఫిలటలిస్టు "జాన్‌లు నిక్లిన్" అన్నాడు. అరుదైన ఈ చిన్న కాగితం ముక్కలను స్వంతం చేసుకోవాలన్న ఆకాంక్ష మానవుని లోని సాధారణమైన నైజం అవటమే ఆ స్టాంపులకు అంత విలువ రావటానికి కారణం అయింది. ఈ పొరపాట్లు వెలుగులోకి వచ్చేకనే వాటికి విలువ వచ్చింది. అంతకు పూర్వం అవి పనికిరాని కాగితం ముక్కలే గదా! వీటికి ఇంత ప్రాముఖ్యం, భవిష్యత్తులో కలుగుతుం దని ఎవరు జోశ్యం చెప్పగలరు.

1869 సంవత్సరంలో ఇలాటి పొరపాటే అమెరికాలో 1,2,3,6,10,12,15,24,30,90 సెంట్ల స్టాంపులు ముద్రించి నపుడు జరిగింది. తక్కువ విలువల స్టాంపుల్ని ఒకే రంగులోను హెచ్చు విలువల ఆఖరి నాలుగు స్టాంపులు రెండు రంగులలోను ముద్రించింది. ఈ స్టాంపులు అమ్మే ఏజంటు 15 సెంట్ల విలువగల స్టాంపుల పూర్తి షీటులో మధ్య భాగంలోని బొమ్మ తలక్రిందులుగా యున్నట్లు గమనించేడు. ఆ స్టాంపు కొలంబసు తీరము చేరటాన్ని సూచించింది.

1918 సంవత్సరంలో 24 సెంట్లు. 30 సెంట్లు స్టాంపులలో కూడ ఇలాంటి 'పొరపాట్లు' తెలియవచ్చింది. ఇటువంటి 'ఇన్‌వర్డ్' స్టాంపులు సుమారు ఎనిమిది యున్నాయి. వాటిలో 15 సెంట్ల స్టాంపు మిక్కిలి అరుదైనది. ఒక్కొక్క దాని విలువ £ 16000

(రు. 2,88,000/). 30 సెంట్ల స్టాంపు ఒక్కొక్క £ 7,500 (రు. 1,35,000/-) లున్నా, 24 సెంట్ల ఇన్వర్టు స్టాంపు ఒక్కటే £ 6,500 (రు. 1,17,000/-) లున్నా విలువ గలిగియున్నాయి. స్టాంపు కలెక్టర్లు సూక్ష్మంగా తమ స్టాంపుల్ని పరిశీలించకపోతే ఎంతో అదృష్టాన్ని పోగొట్టుకుంటారు. స్టాంపుల పరిశీలన విషయంలో W. T. రోబె(W. T. Robay) అను వాషింగ్‌టన్ ఫిలటలిస్టు కథ ప్రతి ఒక్క స్టాంపు కలెక్టరు గుర్తించుకోవాలి. ఇతడు "U. S. A. 24 సెంట్ల ఎయిర్‌మైల్ ఇన్వర్టు "(U. S. A. 24 cents Air Mail Invert) ని 13 మే. 1918 సంవత్సరంలో ఒక 14 సెంట్ల స్టాంపు షీటు కొన్నప్పుడు గమనించేడు. ఆ స్టాంపు డిజైను "ఎగురుతున్న ఏరోప్లేన్". అది రెండు రంగులలో యుంది. అతడు స్టాంపు మధ్యలోయున్న ఏరో ప్లేను తలక్రిందుగా యుండుటను గమనించేడు. మరేముంది! అదృష్టదేవత అతనిని వరించింది. ఆ షీటు అపూర్వమైనదని అతనికి తెలుసు. ఒక వారం రోజులయేక ఆ షీటును అతడు $ 15,000 (రు. 1,10,000/-)లకు అమ్మివేసేడు. అది చేతులుమారి $ 20,000 (రు. 1,47,000/-) లకు కల్నల్ గ్రీన్ చేతిలో పడింది. దాని నతడు బ్లాకులుగాను, విడివిడిగాను అమ్మేడు. 1940 సంవత్సరం నరికి ఒక్కొక్క స్టాంపు విలువ $ 4,100 (రు 30,200/-) లకు చేరింది!

1871 సంవత్సరంలో జపాన్ ప్రభుత్వం విడుదల చేసిన స్టాంపులలో మధ్యభాగం ప్రింటింగులో తల క్రిందులయింది. ఈ స్టాంపు విడుదల అయి 100 సంవత్సరాలు దాటేక ఈ తప్పు 1973 సంవత్సరంలో గమనించబడింది.

మార్షియస్ 1847 లో ప్రింటు అయిన 1 పెన్నీ స్టాంపు 2 పెన్నీల స్టాంపులు, 1848 కి చెందిన 2 పెన్నీల స్టాంపులలో 'పెన్స్'కు బదులు 'పైనో' అని తప్పుగా ముద్రణ జరిగింది.

ఇంత డిజైనులో తప్పులు డిజైనరు అశ్రద్ధ వలనగాని ఎన్గ్రేవరు అశ్రద్ధ వలనగాని వస్తాయి. అలాగే ప్రింటింగుప్లేటు తప్పుగా తయారు అవుతుంది. 'మార్షియస్ జోష్టాఫిన్' స్టాంపు, ఇండియన్ స్టాంపులలో 1926 లో విడుదల అయిన 1 1/2 అణా స్టాంపు, 1949 ఆగస్టు 15 న విడుదల అయిన 'ఆర్కియాలాజికల్' సీరిస్‌లో బోధిసత్వుని చిత్రంలో ఎడమవైపు చెయ్యి ఎడమకాలుపై. కుడిచెయ్యి నేలకు తగులుతున్నట్లు ముద్రించటం ఉదాహరణలు. ఈ తప్పుని తెలుసుకున్న భారత ప్రభుత్వం 1950 జూలై 15 న తిరిగి బోధి సత్వుని స్టాంపు ముద్రించి విడుదల చేసింది. తప్పులున్న స్టాంపుల్ని వందలు-వేలు రూపాయలనిచ్చి కొనుక్కునే వారెందరో యున్నారు.

## (3) ఓవరు ప్రింటింగు ఆపరేషను తప్పులు

తాత్కాలికంగా విడుదలైన స్టాంపులపై 'సర్చార్జి' వసూలుకు ఓవరు ప్రింటింగు చేసిన సందర్భాలలో తప్పులు రావచ్చు."తలక్రిందు ప్రింటులు, "డబుల్ ప్రింటులు", "తప్పు ఇంప్రెషన్లు" యుండవచ్చు. ఉదాహరణకు 1905 లోను, 1922 లోను 11/2 అణా స్టాంపులపై 1/4 అణాముద్ర ఓవరు ప్రింటు చేసినప్పుడు 'తలక్రిందు ఓవరు ప్రింటు' సందర్భాలు వున్నాయి. 1921లో 1a (అణా)స్టాంపుపై 9a ఓవరు ప్రింటు చేసినప్పుడు 'తలక్రిందు ఓవరు ప్రింటు' అయింది. 'NINE - NINE,' 'PIES–pIES' ఓవరు ప్రింటు స్టాంపులు కూడ యున్నాయి. ప్రింటింగు తప్పులను సకాలంలో కనుగొంటె పోస్టల్ డిపార్టుమెంటువారు వాటిని వెంటనే ప్రింటింగు స్టేజిలోనే ధ్వంసం చేస్తారు. కాని పొరపాటు వలన పైకి వచ్చిన కొన్ని స్టాంపులు సూక్ష్మ బుద్ధిగల స్టాంపు కలెక్టర్ల చేతుల్లో చిక్కుకుంటాయి- వాటితో వారు మంచి డబ్బు చేసుకోవటానికి అవకాశం ఏర్పడుతుంది.

## (4) తలక్రిందుల వాటరు మార్కు తప్పులు

తలక్రిందు వాటరుమార్కు తప్పులు ప్రింటింగు యంత్రంలో షీటును తలక్రిందుగా పొరపాటున అందించుటచే కలుగుతుంది. షీట్లను ప్రక్కల నుంచి అందిస్తే "సైడువేస్ వాటరు మార్కు" నమూనాలు ప్రింటు అవుతాయి. దీనికి ఉదాహరణ 1959-60 లో విడుదల అయిన 1 రూ, 5 రూ. 10 రూ "సర్వీస్" లయన్ కేపిటల్ వాటరు మార్కు స్టాంపులు, స్వాతంత్ర్యానికి పూర్వం విడుదల అయిన వాటిలో 'తలక్రిందు వాటరు మార్కు' తప్పులు తరచుగా కనబడినా, స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం విడుదల అయిన సిరీస్‌లో రెండు సంవత్సరాలలో మాత్రమే యున్నాయి.(1)మూడున్నర అణాల స్టాంపు 1947 లో ఇండిపెండెన్స్ కమెమొరేషన్ విడుదల. (2) 3 N. P. 'సర్వీస్' (Lion capital water ma rk) 1958 విడుదల.

## (5) పెర్ఫొరేషన్ తప్పులు

పెర్ఫొరేషన్ స్టేజిలో కూడ పొరపాట్లు కావచ్చు. ఉదాహరణకు మెషీను ఆపరేటరు సరిగా చూడక పోయినప్పుడు ఒక తాకిడి తప్పితే ఒక షీటు అంతా పెర్ఫొరేషన్ లేకుండా పోతుంది. అనాటి తప్పు 1959 'బాలల దినం' (Children's Day) స్టాంపు విడుదలలో జరిగింది. ఇంకా 1 N.P. (Lion capita wvtermərk) 5 N.P· 'సర్వీస్' (Lion capital water mark) దీనికి ఉదాహరణ. ఒక్కొక్కప్పుడు షీటుని సరిగా జరపనప్పుడు, ఆపరేటరు ఒకేచోట రెండు తాకిడిలు చేయటం వలన 'డబుల్ పెర్ఫొరేషన్' (Double perbovration) అవుతుంది. కొన్ని సమయాలలో షీటు తాలూకు ఒక అంచు మడతపడినా, షీటులో ప్రింటు అయిన స్టాంపులపై అడ్డుగా పెర్ఫొరేషన్లు పడుతాయి.

# 13. సమస్యలు సృష్టించిన స్టాంపు విడుదలలు

స్టాంపుల ముద్రణ పోస్టలు డిపార్టుమెంటువారికి వారి సేవలకు ప్రతిఫలం లభింపచేయడమేగాక, వివిధ దేశాల స్టాంపు కలెక్టర్లకు ఆ స్టాంపుల సేకరణ ఆనందాన్ని అర్థాన్ని కూడ చేకూరుస్తుంది. కొన్ని సమయాలలో కొన్ని స్టాంపుల ముద్రణ తంటాలు తెచ్చిన సంఘటన లున్నాయి. వాటిలో కొన్నింటిని పరిశీలిద్దాం.

## (1) డొమినికన్ రిపబ్లిక్ స్టాంపు

**1990** సంవత్సరంలో 'డొమినికన్ రిపబ్లిక్' ప్రభుత్వం తమ రాజ్యవిస్తీర్ణతను తెలియచేసే ఒక స్టాంపు విడుదల ఆ దేశానికి హైతీ (Haiti) కి వైరం సృష్టించింది. ఆ స్టాంపులో హైతి వారికి చెందిన కొన్ని భూభాగాలు వున్నాయి. దానితో ఆ రెండు దేశాల మధ్య అనధికార యుద్ధం ఆరంభం అయింది. **1938** లో ఆ రెండు దేశాల మధ్య సంధికుదిరే పర్యంతం ఆ పరిస్థితి కొనసాగింది.

## (2) నికరాగువన్ స్టాంపు

**1902** సంవత్సరంలో మొమొటాంబొ (Momotombo) అను పొగలు కక్కే వాల్కానో ఫొటోగల 'నికరాగువన్' (Nicaarguvan) స్టాంపు విడుదల పనామా కాలువ ఉనికి విషయమైన తగవుని ఉధృతం చేసింది. వాషింగ్టన్‌లోయున్న నికరాగువన్ మద్దతుదార్లు పెనామా కాలువ వారి భూభాగంలో యుండాలని వారి దేశానికి వాల్కనోల బెడదలేదని వాదించేరు. కాని ఆ సమయంలో ఒక పెనామా మద్దతు దారు ఆ నికరాగువన్ స్టాంపు కాపీలను సెనేటర్ల కు పంచిపెడుతూ, నికరాగువన్ పోష్టాఫీసు వారికి నికరాగువాలోని వాల్కనోల సంగతి బాగా తెలుసునని నిరూపించేడు. ఈ సంచలనంతో సెనేటు ఓటు పెనామాకు వచ్చింది.

## (3) సిసిలీదేశ ప్రధమ స్టాంపు

సిసిలీదేశ ప్రథమ స్టాంపు విడుదల విషయంలో ఫెర్నాండెజ్ రాజు తన ఫొటో పోష్టుమార్కు వలన వికృతమిపుతుందని అభ్యంతరం చేయటంతో చాలాకాలం స్టాంపు విడుదల నిలుపు చేయబడింది. చివరకు 1859 సంవత్సరంలో ఆ స్టాంపులోని ఫ్రేముని మాత్రము కేన్సిల్ చేస్తూ అతని ఫొటోని పాడుచెయ్యని ఒక స్పెషల్ పోష్టు మార్కుని తయారు చేసేక ఆ స్టాంపు విడుదల అయింది.

## (4) డచ్చస్ ఆఫ్ ఆల్బా స్టాంపు

1930 సంవత్సరంలో ప్రఖ్యాత స్పానిష్ చిత్రకారుడు 'గోయా' జ్ఞాపకార్థం అతను చిత్రించిన 'డచ్చస్ ఆఫ్ ఆల్బా' నగ్న చిత్రాన్ని స్టాంపుపై ముద్రించి విడుదల చేయటంతో తుఫాను చెల రేగింది. ప్రపంచంలోని అన్ని దేశాలు ఆల్బా నగ్న చిత్ర స్టాంపు ముద్రణను ఆక్షేపణ తెలియచేసేయి. కాని స్పెయిన్ దేశం ఆ స్టాంపుని సర్క్యులేషన్ నుంచి ఉపసంహరించక పోవటం సరికదా పైపెచ్చు మరికొన్ని మిలియన్ల స్టాంపుల్ని ముద్రించి విడుదల చేసింది!

## (5) మింటో స్టాంపు

ఒక ఫిలటలిస్టు సాహస కృత్యం బ్రిటిషు సామ్రాజ్యం అంతటా సంచలనాన్ని రేకెత్తించటమేగాక అప్పటి వైస్రాయి లార్డుమింటోను ఇరకాటంలో పెట్టి ఆందోళనతో నిద్రలేని రాత్రులకు గురిచేసింది. 1906 సంవత్సరం డిసెంబరునెల క్రిస్టమస్ పండగ దినాలవి. నాటికి ఇండియా రాజధాని కలకత్తా, వైస్రాయి లార్డుమింటో. కలకత్తా ఫిలటలిస్టు "విల్ యట్ కార్ఫీల్డ్" ధర్మచింత గలవాడు, సాహస మైనవాడుకూడ. ఆ నెలలో "లేడీ మింటో సెటీ" అనే ఉత్సవం రెడ్ క్రాస్ సహాయార్థం ఏర్పాటు చేయబడింది. లార్డ్ మింటో లేడీమింటోల

ఫొటోలుగల స్టాంపుల్ని ఆ సంపర్భంలో విడుదలచేస్తే నిధులు బాగా వస్తాయని కార్‌ఫీల్డుకి ఆలోచన తట్టింది. తన అదుద్దాతో ముందు వెనుకలు ఆలోచించకుండ కలకత్తా 'సర్వే ఆఫ్ ఇండియా' ఆఫీసులో మింటో దంపతులుగల ఒక స్టాంపుల సెట్టును ముద్రింపచేసేడు. దానితో బ్రహ్మాండమైన అలజడి బ్రిటిషు సామ్రాజ్యంలో చెల రేగింది. వైస్రాయి బ్రిటిషు చక్రవర్తికి ఇండియా ప్రతినిధి మాత్రమేగదా? వైస్రాయి ఫొటోలతో స్టాంపుల ముద్రణ గుండెలు తీసిన పనికాదా! అంతవరకు చక్రవర్తుల ఫొటోలతోనే స్టాంపులు విడుదల అయేవి. అందుచేత కల్లోల్లు, పెద్ద పెద్ద ఆఫీసర్లు తారెత్తి పోయేరు. కాని ఆ స్టాంపులు ధర్మకార్యం నిమిత్తం విడుదల అవటంతో సర్దుమణిగిందనవచ్చు. స్పెషల్ "మింటో ఫెటీ రెడ్‌క్రాస్" పోష్టుమార్కుతో కవర్లపై నతికించబడిన ఆ స్టాంపులు కాన్సిల్ చేయబడ్డాయి. లార్డుమింటో అనుమతి ఈ స్టాంపులకు యున్నట్లు చాలామంది అభిప్రాయపడ్డారు. లేడీమింటో ముఖం గలవి, లార్డ్ మింటో ముఖంగలవి 4 అణాల స్టాంపుల షీటుకి 24 చొప్పున ముద్రించేరు. 1 రూపాయి స్టాంపులు 25 గలవి ఒక్కొక్క షీటులో ముద్రించేరు. ఈ స్టాంపులేవి నేడు లభ్యమగుటలేదు.

## 14. స్టాంపులతో విరాళాల సేకరణ తమాషా!

1974 సంవత్సరంలో పశ్చిమ జర్మనీలోని లాన్ నగరంలో విద్యార్థులు కొందరు విరాళాల సేకరణకు బయలుదేరేరు. వారి ఆరాటానికి, విరాళాల సేకరణ పవిత్ర ఆశయానికి మనసు కరిగి హెల్గా రిట్టర్ అనే పదహారు ఏళ్ళ యువతి తన నగ్న ప్రదర్శన చేసి వారికి విరాళాలు చేకూర్చటానికి అంగీకరించింది. ఆ నగరంలో ఆమె ఒక స్టేజీపై నగ్నంగా నిలబడేసరికి జనాలు బాగా కూడేరు. అప్పుడు ఆమె తన నగ్న శరీరంపై తమకు ఇష్టమైన చోట తపాలా బిళ్ళను అతి

కించి దాని విలువను ఆమె చేతుకో యుంచాలని కోరింది. తండోప తండాలుగా ప్రేక్షకులు వారి కిష్టమైనచోట తపాకా బిళ్ళల నతికించి ఆమె చేతికో వాటి విలువైన పైకాన్ని ఉంచి తృప్తిపొంది క్షేటి వెళ్ళేరు. ఆ ప్రదర్శనానంతరం ఆమె శరీరం అంతా స్టాంపులతో కప్పబడింది. విద్యార్థులు ఆ దబ్బుతో తబ్బిబ్బయి పోయేరు !

## 15. స్టాంపు విడుదలలో ఆక్షేపణాలు

### (1) రామకృష్ణ పరమహంస స్టాంపు

భారత దేశంలో రామకృష్ణ పరమహంస కమెమొరేటివ్ స్టాంపు విడుదల విమర్శలకు గురి అయింది. ఆ స్టాంపుని అతికించేప్పుడు నోటి ఉమ్మిని కొందరు ఉపయోగించటం, ఆ స్టాంపుగల కవర్లు రోడ్లపై పారవేసిన వాటిని జనాలు తొక్కుతారన్న విషయం ఆయన పవిత్రతను అగౌరపరస్తుందన్న విమర్శకు గురి అయింది.

### (2) తమిళ మహాసభ స్టాంపు

తమిళ మహాసభ స్టాంపులపై హిందీ అక్షరాల ముద్రణకు వ్యతిరేకంగా తమిళ హిందీ వ్యతిరేకులు ఆందోళన చేసేరు. పైగా ఈ ఈ స్టాంపులో తమిళ అక్షరాలు లేవని తమిళులు అభ్యంతరం తెలిపేరు.

## 16. స్టాంపులపై జిగురు బదులు అల్కహాలు

స్టాంపులకు వాడే జిగురు బదులు బ్రిటిషు తపాలా శాఖ వారు 1868 జనవరిలో విడుదల అయిన స్టాంపులకు ఆల్కహాలు పూయుటచే మద్యపాన ప్రియులు ఆకర్షితులయేరు. స్టాంపు నోటికి తగల

గానే అల్పాహారాలు కమ్మదనానికి ఆనంద పరవశులై స్టాంపులను వారు విపరీతంగా కొనసాగేరు. తపాలా బిళ్ళల అమ్మకంలో ఒక రికార్డు అలా సృష్టించబడింది !

## 17. స్టాంపులపై హెచ్చరికలు

పోస్టేజి స్టాంపులు ప్రపంచంలో ఎక్కడికైనా లేఖల్నిగాని వస్తువుల్నిగాని సరఫరా చేయటానికి సాధనంగా ఉపయోగపడుతున్నాయి. దీనిని అదను చేసుకుని చాలా దేశాలు ప్రజల ఆరోగ్యాలకు, దేశ సౌభాగ్య ప్రచారాలకు తోడ్పడే హెచ్చరికలను స్టాంపులపై ముద్రించనారంభించేయి. ఉదాహరణకు ఇటువంటి హెచ్చరికలుగల కొన్ని స్టాంపుల్ని పరిశీలిద్దాం.

'రక్తపుపోటు' విషయంలో హెచ్చరికచేస్తు: దక్షిణ ఆఫ్రికాలోని బోట్స్వానాదేశం కొన్ని చిత్రాలతో స్టాంపుల్ని విడుదల చేసింది.'రక్తపు పోటు నశించాలి' అనే నినాదంతో ఒక స్టాంపుని విడుదల చేసింది. మరొక స్టాంపుపై కత్తులు, ఫోర్కులు, స్పూనులతో ఒక ఫలహార పళ్ళెం, దాని ప్రక్కనే "అతిగా తినటం ఆరోగ్యానికి హానికరం"అనే నినాదంతో మరొక పళ్ళెం చిత్రించ బడ్డాయి.

యునైటెడ్ స్టేట్సు 25 సెంట్ల స్టాంపులో అబ్రహాం లింకన్, అతని ప్రజారాజ్యనిర్వచన- Of the people, by the people, for the people- ముద్రించటం ముదావహం.

భారతదేశంలో కూడ స్టాంపులపై హెచ్చరికలు, నినాదాలు ముద్రించిన సందర్భాలు అనేకాలున్నాయి. 1966 డిసెంబరు 12న Familyplanning week సందర్భంగా విడుదల అయిన స్టాంపులో 'Plan your Family' అనే నినాదం ప్రజలకు ఫామిలీ ప్లానింగు అవసరాన్ని గుర్తు చేస్తుంది. 60 పైసల స్టాంపులో ఒక పరిమిత కుటుంబం ఎర్రత్రికోణంతోపాటు 'A small family is ahappy family' అనే

నినాదం యుంది. 1975 సంవత్సరంలో ప్రపంచ తెలుగు మహాసభ సందర్భంగా విడుదల అయిన 25 పైసల స్టాంపుపై 'దేశభాషలందు తెలుగు లెస్స...' అనే పద్యం తెలుగు వారికి గర్వకారణం కాదా? 1976 లో విడుదల అయిన 25 పైసల స్టాంపులో 'కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన' అనే శ్లోకం భగవద్గీత యొక్క ముఖ్య సందేశాన్ని ప్రజల ముందు యుంచుతోంది. 1980 మార్చి 5 న బొఫుథత్స్వన (Bophuthatswana) దేశం కాలుతున్న రెండు సిగ రెట్లను ఒక సమాధిపై క్రాసుగుర్తుగా ముద్రించి 5C స్టాంపుని విడు దల చేసింది. ఇది పొగ త్రాగేవారికి తగిన హెచ్చరిక కాదా! చైనా రిపబ్లిక్ ఊపిరి తిత్తులను చిత్రించి 300 స్టాంపుని విడుదలచేసి పొగత్రాగుట వలన ఊపిరి తిత్తులకు ఎంత హానికరమో తెలియ పరిచింది.

1987 జపాను దేశం ఆరవ ప్రపంచ పొగత్రాగుడు మరియు ఆరోగ్య మహాసభని (6th world Smoking and Health Conference) జరిపించింది. ఈ సందర్భంగా జపాను ఒక స్పెషల్ స్టాంపుని విడుదల చేసింది. సాధారణంగా అందరకు పరిచయంగల తురుపుకార్డు. అదృష్టం తెలిపే కార్డులుగల ఆ స్టాంపు పొగత్రాగుటవలన కలిగే అనారోగ్యాన్ని గుర్తు చేస్తుంది.

"Smoking or Health-the Choice is yours"అనే సందేశాన్ని అనేక దేశాలు స్టాంపులపై ముద్రించేయి. 1989 లో తైనాన్ చైనా ఒక స్పెషలు స్టాంపుని విడుదలచేసింది. ఈ స్టాంపు డిజైను ముఖ్యంగా పొగత్రాగటం, పొగత్రాగనివారికి ఆ పొగ ఎంత హానికరమో తెలియ చేస్తుంది,

ఆస్ట్రేలియా నాలుగు 41 C స్టాంపుల మూలంగా మార్చి 14, 1990 ని ఒక స్పెషలు స్టాంపులో ఈ విషయాన్ని సమాజానికి తెలిసే టట్టుగా ముద్రించింది, సిగరెట్లు కాల్చడం, ఆల్కహాలు సేవించటం,

పౌష్టిక ఆహార కొరత- ఇవి అన్నీ సమాజంలో ప్రధాన ఆరోగ్య సమస్యలని ప్రజల దృష్టికి ఆ స్టాంపులు తీసుకవస్తాయి.

భారత ప్రభుత్వం కూడ "పొగత్రాగుడు హానికరం', 'పాన్ మసాలా హానికరం', 'ఆల్కహాలు హానికరం'- ఇటువంటి నినాదాలతో కొన్ని స్టాంపుల్ని విడుదల చేస్తుందని ఆశిద్దాం. పెళ్ళి వయస్సులు, దేశరక్షణ, స్త్రీలపట్ల గౌరవం మున్నగు నినాదాలు స్టాంపులపై యుంటే ప్రజానీకంపై వాటి ప్రభావం ఎంతైనా యుంటుంది.

# 18. స్టాంపుల వేలాలు

## (1) స్టాంపు వేలాల కంపెనీలు

స్టాంపు మార్కెట్టుకి లండన్ నగరం హృదయం వంటిది. లండన్‌లోని "స్టాన్లే గిబ్బన్స్ లిమిటెడ్" వారు స్టాంపుల వేలాలకి ప్రసిద్ధి చెందిన సంస్థ.1967 డిసెంబరులో లార్స్ అముండెన్స్ అను ప్రఖ్యాత స్టాంపు కలెక్టరు బ్రిటిషు ఎంపైరు క్లాసిక్ స్టాంపుల కలెక్షనును మూడు రోజులు వేలంజరిపి రు. 34,20,000/- రూపాయిలు రాబట్టింది. ఆ వేలంలో అనేక దేశాలవారు పాల్గొన్నారు. సుమారు 90% స్టాంపులను విదేశాలనుండి వచ్చినవారే కొన్నారు. ఆ కలెక్షన్ లోని "కాస్పారి న్యూ ఫౌండ్ లాండు కవరు" (Caspary New Found land cover) తల మాణిక్యం. £ 6,500 పౌండ్లకన్న హెచ్చువిలువ చేయదనుకున్నది ఆ వేలంలో £ 15,500 పౌండ్లకు అమ్ముడయింది! 1859లో విడుదల అయిన ఈ కవరు న్యూ ఫౌండులాండు అయిటములలో అరుదైనదిన్ని, ప్రపంచంలో మిక్కిలి అరుదైన కవర్లలో మూడవదీని. అదే వేలంలో హెచ్చువిలువలు తెచ్చిన ఇతర స్టాంపులలో బర్మ్మడా 1848 '5C రోజ్' £ 3,000; కేప్ ఆఫ్ గుడ్ హోప్ 1861 నాటి 4d త్రికోణపు "ఉడ్‌లాక్" (Triangular

Wood lock) కలరు తప్పుగా కలది £ 2,600; సిలన్ 1857-59 నాటి 4d డల్ రోజ్ £ 6000; నోవాస్కోషియా 1851-57 కవరు £ 2,200; ట్రినిడాడ్ 1847 కవరుపై లేడీమెలియడ్ (Lady Meleod) £ 1,600; మార్షియస్ 1848 నాటి 2d పినో (Peno) తప్పుగలది £ 6,500; సిలన్ లాటులో 4d, 6d అసంపూర్ణమైన రంగు వాటినవి సేలు కేటలాగులో £ 2,750 పౌండ్ల విలువయుండగా అది £ 4000 పౌండ్లకు అమ్ముడయింది.

జ్యూరిచ్‌లోని రావిన్స్ సంస్థ పాత తపాలాబిళ్ళల ఒకరోజు వేలంలో £ 1,06,820 పౌండ్లను గడించి కొత్త రికార్డు సృష్టించింది.

గ్రీస్ దేశంలోని అథెన్స్ నగరంలోని వ్లాస్టాస్ ఫిలాటలిక్ ఆక్షన్స్ సంస్థ (Vlastos Philatelic Auctions Inc. of Athens) ఎడ్వర్టైజుమెంటు తతంగంవంటిఅట్టహాసంఏమీలేకుండ అకస్మాత్తుగా "కేప్ ఆఫ్ గుడ్ హోఫ్" స్టాంపుల సెట్టుగల కవరును వేలంలోకి తీసుకవచ్చింది. అసలు ఆ కవరుయుందన్న విషయం ఎవరికీతెలియదు. 1899లో ఆంగ్లోబోయరు యుద్ధకాలంలో బోయరు సాయుధసైన్యం తాత్కాలికంగా బ్రిటిషు రాజ్యభాగాన్ని ఆక్రమించిన సమయంలో "Z.A.R." అని ఓవరు ప్రింటుచేసి కేప్ ఆఫ్ గుడ్‌హోప్ స్టాంపుల్ని వాడేరు. ఈ కవరు ఉనికి ఫిలటలిస్టుల కెవరికి తెలియదు. గనుక ఇటువంటి వాటిని "అన్ నోన్ ఐటెమ్స్" (Unknown items) అంటారు. దానిని గ్రీకు స్టాంపు ఆక్షనరులు వేలంవేసి 15000 డ్రెక్మాస్ అనగా రూ 3,750/- సంపాదించి పెట్టేరు.

స్టాంపు వ్యాపారంలో కొంచెమైనా పరిచయం వుంటే ఒక చిన్న కాగితంముక్క అంటే ఒక స్టాంపు విలువ ఊహించనంత విలువ చేరుతుందనడంలో సందేహం లేదు. 1982లో లండన్‌లోని "హార్మర్స్" కంపెనీవారు మిస్టర్ పియర్‌సన్ FRPSL కి చెందిన ఒక సిలను కవరు £ 10,000 వేలంలో విలువ చేస్తుందనుకున్నది

£ 22,000 (రు. 3,50,000/-) సంపాదించిపెట్టేరు. ఈ కవరు 30 సంవత్సరాలలో మూడు చేతులు మారింది. ఇది సింసుఅయిటము లలో అతి ముఖ్యమైనదిన్ని కోరుకో తగినదీని.

1982లో Ms. జార్జి ఎలిఐ జోన్స్, శాంతామోనికా. U.S.A. వారు ఒక చైనా స్టాంపుని వేలంవేసేరు.దాని అసలు విలువ ఒక డాలరు. అది వేలంలో U.S$ 44,000 (రు. 4,40,000/-) డాలర్లు సంపాదించి పెట్టింది!

(2) భారతదేశంలో స్టాంపు ఆక్షన్లు

భారతదేశంలో కూడ స్టాంపు ఆక్షన్లు అప్పుడప్పుడు నిర్వహించబడుతూ యుంటాయి. స్టాంపుల సేకరణకు ఆక్షన్లు ఎంతైనా తోడ్పడుతాయి. బ్రోకర్లను నియమించకుండ ఆక్షనర్లు నిజాయితీ పరులైతే పర్వాలేదు. ఈ ఆక్షనర్లు ప్రపంచంలో అనేక ప్రాంతాల స్టాంపుల్ని సేకరించి, వాటిని ఒక తీరులో అమర్చి వాటి వివరాలు తగు రీతిలో వర్ణిస్తూ కేటలాగులను ముద్రిస్తారు. ఈ కేటలాగులను చందా దారులకు అందజేస్తారు. వారి కృషికి కొంత శాతం స్టాంపుల నమ్మే వారినుంచిగాని, కొనేవారినుంచిగాని రాబట్టుకుంటారు. ఒక్కొక్క లాటులోని స్టాంపుల వర్ణన కొన్ని సందర్భాలలో సరిగాయుండక పోవచ్చు. అటువంటి లాట్లలో మిక్కిలి విలువైనవి అరుదైనవి అయిన స్టాంపులు ఒక్కొక్కప్పుడు చోటుచేసుకోవచ్చు. ఈ ఆక్షన్లలో పాల్గొని అనేకమంది భాగ్యవంతులయ్యేరు. భారతదేశంలో "స్టాంపు ఎంటర్ ప్రయిజర్స్ ఆఫ్ కలకత్తా" (Stamp Enterprisers of Calcutta), జైపూరులోని B.C. లుహాడియా (B.C. Luhadia of Jaipur) మాత్రమే చెప్పుకోదగిన ఆక్షనర్లు. 1983 జూలై 2వ తేదీన ఈ సంస్థలవారు తమ కేటలాగులలో భారతదేశానికి, స్వదేశీ సంస్థానాలకీ, బ్రిటిషు కోలనీలకు సంబంధించిన స్టాంపుల లాట్లను చక్కగా ముద్రించేరు. కాని ఇండియన్ ఆక్షనర్లు విదేశాలవారి స్థాయికి ఇంకా

చేరలేకపోతున్నారు. ఈ దుస్థితికి కారణాలు కొన్ని ప్రభుత్వ సమస్యలు, ఇతర అంతరంగిక నిర్బంధాలున్నా. అంతేగాక వీరికి ప్రభుత్వ ప్రోత్సాహం బహుస్వల్పం. విదేశాలలో వందలాది ఆక్షనర్లు యుండగా, ఇండియాలో వారిని వ్రేళ్ళపై లెక్కపెట్టవచ్చు. విదేశాలలో సరాసరి ఒక్కొక్క ఆక్షనరు ఒక్కొక్క వేలంలో సుమారు పది లక్షల రూపాయిలు విలువచేసే స్టాంపుల్ని అమ్మగలుగుతూ యుంటే, ఇండియాలో ఆక్షనర్లు కొద్దిపాటి సొమ్ము మాత్రమే రాబట్ట గలుగుతున్నారంటే ఈ విషయంలో భారతదేశ స్థాయిని ఊహించ వచ్చు.

ప్రపంచంలో చెప్పుకోతగ్గ ప్రఖ్యాత ఆక్షనర్లుగా ఇంగ్లాండులో 'స్టాన్లే గిబ్బన్స్', 'రాబ్సన్‌లోవీ', 'హార్మర్స్ ఆఫ్ లండన్ లిమిటెడ్'; అమెరికాలో 'జార్జి అలాజిరాస్ ఆఫ్ శాంతామోమికా'; గ్రీస్‌లో 'వ్లాస్టాస్ ఫిలటిక్ ఆక్షన్స్, ఎథెన్స్' వారిని పేర్కొనవచ్చు.

## 19. భారతదేశ స్టాంపులపై విదేశీయుల మోజు

లండన్‌లోని గిబ్బన్స్ లిమిటెడ్ వారి కేటలాగుని పరిశీలిస్తే భారతదేశ స్టాంపులపై విదేశీయుల మోజు ఎంతయుందో తెలుస్తుంది. ఆ కేటలాగులో "స్వదేశీ సంస్థానాల" (Indian States) స్టాంపుల ధరల పెరుగుదలను గమనించవచ్చు. దీనిని బట్టి విదేశీ స్టాంపుకలెక్టర్ల మోజు విదితమవుతుంది. 'సింధిడాక్స్' స్టాంపులు వాడనివి తెలుపు, నీలం, ఎరుపు స్టాంపుల విలువలు బాగా హెచ్చాయి. ఏడవ ఎడ్వర్డు **25** రూపాయిల మింటు స్టాంపు, వాడిన స్టాంపుల వెల కూడ పై-స్థాయిలో యున్నాయి. 'గాంధీ సర్వీస్' **12** అణాల స్టాంపు, **10** రూపాయిల మింటు స్టాంపులు మంచి విలువ గలిగియున్నాయి.

# 20. స్వదేశీ సంస్థానాల స్టాంపులు

బ్రిటీషువారి హయాంలో భారదేశంలో 700 పైగా స్వదేశీ సంస్థానాలు యుండేవి. వాటిలో కొన్నిమాత్రమే తమ స్వంత స్టాంపుల్ని ముద్రించి విడుదల చేసేయి. రమారమి 33 సంస్థానాలు తమ స్టాంపుల్ని విడుదల చేసినట్లు అంచనా. వాటిని ఆయా సంస్థానాలలో మాత్రమే ఉపయోగించవలసి యుండేది. అందుచేత ఆ స్టాంపులు చాలా స్వల్ప సంఖ్యలో ముద్రించ బడ్డాయి. కొన్ని సంస్థానాలు భారతదేశంలో విలీనం అయే పర్యంతం తమ స్టాంపుల్ని విడుదలచేసేయి. ఈ స్టాంపులపై విదేశీ స్టాంపు కలెక్టర్ల కన్ను పడటంతో వాటి గిరాకీ బాగా పెరిగింది. అవి స్వల్ప సంఖ్యలో యుండటం వలన వాటిని సేకరించటం సామాన్యమైన పనికాదు. అందుచేత వాటి సేకరణ విలువ చాలా హెచ్చుగా యుంటుంది.

ఏ ఒక్క స్టాంపు కలెక్టరు ఆ సంస్థానాల స్టాంపుల సేకరణ పూర్తిచేసినట్లు గర్వంగా చెప్పలేడు. స్టాంపుకలెక్షన్‌లో నెంబరు1గా వాసికెక్కిన 'ఫెర్రారి' కూడ అన్ని స్వదేశీ సంస్థానాల స్టాంపుల్ని సేకరించలేక పోయేనని వాపోయేడు. అతడు మిక్కిలి విలువైన, అపూర్వమైనవని పేర్గాంచిన 'పోష్టాఫీస్ 2d' స్టాంపునిచ్చి "పూరిచి" సంస్థాన అర్థణా స్టాంపులు రెండింటిని తీసుకున్నాడు. అంటే స్వదేశీ సంస్థానాల స్టాంపుల్ని ఎంత శ్రద్ధతో సేకరించేడో ఊహించవచ్చు. తనవద్దనున్న కోట్ల ధనాన్ని ధారపోసినా ఆ స్టాపుల నన్నింటిని సేకరించటం అసాధ్యమన్న నిర్ణయానికి వచ్చాడు. ఆ స్టాంపులు అందంగా లేవన్నవి నగ్నసత్యం. ఐతే, సెంటు బ్రిటిష గయానా స్టాంపు మాత్రం అంత అందమైనదా ఏమిటి? విపరీత ప్రచారం అరుదైన స్టాంపుల్కిలేని విలువ నిస్తాయన్నది రుజువు అవుతోంది. నేటి స్టాంపులు అనేక రంగులలో మెరిసిపోవటం లేదా? వాటి విలువని బ్రిటిష గయానా స్టాంపుతో పోలిస్తే సముద్రంలో కాకిరెట్ట చందమేకదా !

చంబల్ సంస్థానం ప్రభుత్వ అవసరాలకోసం విడుదల చేసిన బ్రిటీషురాజు 6వ జార్జి ఒక రూపాయి స్టాంపు, గ్వాలియరు సంస్థానం 1949లో స్థానికంగా ముద్రించిన 12 అణాల స్టాంపు మంచి విలువ గలిగియున్నాయి. పాటియాలా సంస్థానం 1940లో విడుదల చేసిన 6వ జార్జి తొమ్మిదిపైసల స్టాంపుల జతలో ఒకదానిపై ఓవరు ప్రింటింగు లేదు. రెండవది మామూలుగానే వుంది. దీని విలువ నేడు మరీ విపరీత స్థాయి చేరుకుంది. 1949లో కొచ్చిన్ సంస్థానంవిడుదలచేసిన2అణాల స్టాంపులో చాలా తప్పులున్నాయి. స్టాంపుకీ స్టాంపుకి మధ్య నిలుపుగా పెర్ఫొరేషన్ లేదు. ఏటి విలువకూడ చాలా హెచ్చు. కాశ్మీరు సంస్థానం విడుదల చేసిన స్టాంపులుకూడ మంచి విలువ గలిగి యున్నాయి. 1866కి 1877కి మధ్యలో విడుదల అయిన స్టాంపులు మరీ విలువ గలిగియున్నాయి. వీటిలో "ఫోర్జరీలు" సర్వసాధారణం. గనుక స్టాంపుకలెక్టర్లు వీటిని కొనడానికి సరదా పడ్తారు. స్వదేశీ సంస్థానాలు విడుదలచేసిన స్టాంపులుగల కవర్లు చాలా అరుదు. "ఫార్" సంస్థానం గాని "ఘాతియా" సంస్థానంగాని విడుదల చేసిన అర్ధణా, అణా స్టాంపులుగల కవర్లు లభించటం చాలా కష్టం. దున్గార్‌పూర్, షహపుర సంస్థానాల స్టాంపులు యున్నట్లు ఆ మధ్య వెలుగులోకి వచ్చేయి. వాడిన స్టాంపులుగల కవర్లు దొరకటం దుర్లభం. దొరుకుతే ఈ కవర్లకు 'జోషాఫిన్ మార్షియస్' కవర్ల వలె మంచి భవిష్యత్తు వుంది.

బ్రిటిషు వైస్రాయికి జవాబుదారి అయిన "ఈస్టరన్ స్టేట్స్ ఏజన్సీ" (Eastern States Agency) అజమాయిషీకి లోబడియున్న "కొరియా" సంస్థానం ఒకటియున్నట్లు, తన స్టాంపుల్ని ముద్రించు కున్నట్లు చాలాకాలం వరకు స్టాంపు కలెక్టర్లకు తెలియదు. వారణాసి లోని "వాహి" స్టాంపుల కలెక్షన్ ద్వారా ఈ రాజ్యం తన స్టాంపుల్ని వాడినట్లు తెలిసింది. ఒక అమెరికన్ స్టాంపు కలెక్టరు ఈ స్టాంపుల సేకరణకొరకు ప్రఖ్యాత ఇండియన్ స్టాంపు కలెక్టర్ 'జాల్ కూపర్'ను అర్థించటంతో ఈ విషయం వెలుగులోకి వచ్చింది.

## నైజాం స్టాంపులు

నైజాం స్టాంపులు సుమారు 100 సంవత్సరాల చరిత్ర గలిగి ప్రత్యేకత నొందింది. 1810 నుంచి 1857 వరకు లైసెన్సు పొందిన ప్రయివేటు వ్యాపారస్థులు దూరప్రదేశాలకు లేఖలను చేర్చే పద్ధతి అమలులో యుండేది. ప్రభుత్వ లేఖలకు ప్రత్యేకంగా ఒక పక్షి ఈకను అతికించి పంపించే సాంప్రదాయం వుండేది. ఈ రకంగా వార్తలు పంపటం 1857లో అంతమయింది. 1862లో రాయచూర్, లింగసాగర్, నల్‌ద్రగ్ ప్రాంతాలు నైజాం రాజ్యంలో చేర్చడం జరిగింది. ఆ ప్రాంతాలవారు ఈస్టుఇండియా పోష్టల్ పద్ధతికి అలవాటు బడినవారగుటచే నైజాం ప్రభుత్వానికి తమ స్టాంపుల్ని విడుదల చేయవలసిన అవసరం కలిగింది. అందుచేత 1869లో నైజాం మొదటి పోష్టేజి స్టాంపు ఒక అణా డినామినేషన్‌లో వాడుకలోకి వచ్చింది. తరువాత ఇతర 'డినామినేషన్ల'లో స్టాంపులు వెలువడ్డాయి. 1871లో 'Post Stamp' అనియున్న స్టాంపులు విడుదలఅయేయి. తపాలు అందించటంలో ప్రభుత్వం ఎంత కృషి చేస్తోందో, వార్తావహులు ఎలాటి ప్రమాదాలకు గురవుతున్నారో అన్న విషయాలు గుర్తుచేసే దృశ్యాలను స్టాంపులపై ముద్రించి ప్రజల దృష్టికి తీసుక వచ్చేరు. గుర్రాలు, ఒంటెలు, ఎద్దుల బండీలను తపాలాలను తీసుక వెళ్ళుటకు ఉపయోగించేవారు. తపాలా రన్నర్లు మార్గమధ్యంలో అనేక ప్రమాదాలకు గురి అయేవారు. వారు రోడ్లులేని ప్రదేశాలను, కీకారణ్యాల్ని దాటి తపాలాలను అందచేసేవారు. వారు మార్గ మధ్యంలో పులులు, ఎలుగుబంట్లు, తోడేళ్ళు వంటి క్రూరమృగాల బారినుండి తప్పించుకోవలసియుంది. ఆ రన్నర్లు 'రిలే' పద్ధతిపై తపాలాలను తీసుకెళ్ళాలి. చిన్నగంటలుగల కర్రను చప్పుడు చేసుకుంటూ ఆ రన్నరు ధైర్యంగా ముందుకు సాగిపోయేవాడు. రాత్రిళ్ళు వారు విశ్రమించటానికి అచ్చటచ్చట చెట్లే దిక్కు. పులులు, ఎలుగుబంట్లు వంటి

క్వారమ్మగాలు చెట్టుక్రింద వారికోసం కాచుకొని యుండటంతో వారికి రాత్రిగడవటం ఒక పెద్ద గండంగా వుండేది. అందుచేత వారు ఎలాటి ప్రమాదాల్ని ఎదుర్కొని తపాలా సరఫరా సేవచేస్తున్నారో ప్రజలకు తెలియచేస్తూ అడవులు, పులులు, సర్పాలు మొదలగు బొమ్మలతో తపాలా రన్నరుని కూడ స్టాంపుపై ప్రభుత్వం ముద్రించింది. 1900 సంవత్సరం వరకు నైజాములో తక్కువ విలువగల స్టాంపు అర్థణా మాత్రమే! దానిపైనే 1/4 అణా ఓవరు ప్రింటు ఆ సంవత్సరంలోనే చేసేరు. 1905 నుంచి 'పోస్టేజి' అన్నచోట "పోస్టు స్టాంపు" అని ముద్రించిన స్టాంపులు విడుదల అయేయి. 1927లో నైజాం ప్రభుత్వం 1 రూపాయి స్టాంపుని విడుదల చేసింది. అంతకుపూర్వం చిన్న 'డినోమినేషన్స' లోనే స్టాంపుల ముద్రణ జరిగింది. నైజాం విడుదలచేసిన స్టాంపులపై ఇంగ్లీషు, ఉర్దూ, తెలుగు, మరాటీ భాష లున్నాయి. 'ఇంగ్లీషు' బ్రిటిషు సార్వభౌమత్వాన్ని, 'ఉర్దూ' హిందూ మహమ్మదీయ సంస్కృతుల కలియకను, 'పెర్షియన్' లిపిలో వ్రాయటం నైజాం కోర్టుభాష అని తెలియచేయగా, తెలుగు, మరాటీ నైజాంలోని ప్రాంతాలని సూచిస్తాయి. నైజాము 1950 వరకు విడుదల చేసిన స్టాంపులలో చార్మినార్, 1919లో కట్టిన హైకోర్టు, ఉస్మాన్‌సాగర్ రిజర్వాయరు, అజంతా శిల్పం, బహమని సుల్తానులు కట్టించిన బీదరులోని పాఠశాల, దౌల్తాబాద్‌లో విజయసూచకంగా కట్టించిన చాంద్ మీనార్, యునాని జనరల్ హాస్పిటలు, ఉస్మానియా హాస్పిటలు, ఉస్మానియా యూనివర్శిటీ, ఉస్మానియా జూబిలీ దర్బారు హాలు, హైదరాబాదు టౌను హాలు, వరంగల్‌లోని కాకతీయ ఆర్చి, గోల్కొండ దుర్గం యున్నాయి. ఈ స్టాంపుల్ని సంపాదించగలిగిన వారికోసం అదృష్టదేవత ఎదురుచూస్తోంది.

భారతదేశంలో 1852లో 'సిండిడాక్స్' స్టాంపుల విడుదల అనంతరం అనేక స్వదేశీ సంస్థానాలు తమ తమ స్వంత స్టాంపుల్ని విడుదల చేసేయి. వాటిని తెలుసుకోవటం స్టాంపు కలెక్టర్లకి ఎంతైనా

ఉపయుక్తంగా యుంటా యనటంలో సందేహం లేదు. వాటిని ఈ దిగువ నుదహరించడమయింది.

1864-సొరత్
1866-జమ్మూ-కాశ్మీర్
1869-హైదరాబాద్ (నైజాం)
1874-జింద్
1876-భోపాల్, పూంచి
1877-అల్వార్, నవనాగోర్
1879-భోర్, ఫారిద్ కోట,
సిర్మూర్
1880-రాజ్‌పిప్ల
1884-పాటియాల, కొరియ
1885-గ్వాలియర్, నాభ
1886-చంబ, కొచ్చిన్, ఇండోర్
1887-ఝలవార్
1888-ట్రావన్కోర్, వధ్వాన్,
బమ్రా
1892-కొచ్చిన్, రాజ్‌నంద్‌గాన్
1893-దత్తియ
1894-బున్ది, చార్ఖారి
1895-బుస్సాహిర్ (బషాహర్)
1897-ధార్
1899-కిషన్‌గర్
1904-జైపూర్
1921-బర్వాని
1931-మోర్వి
1935-బిజవర్
1939-ఐదార్
1942-జస్దన్
1948-సోరత్ (జునాగడ్).
మోర్వి, జస్దన్, నవనగర్,
వాధ్వాన్ (సౌరాష్ట్ర
యూనియన్)
1949-రాజస్థాన్
1975-ఫ్యురోసి దీవులు

## 21. స్టాంపుల ప్రింటింగు

స్టాంపుల ముద్రణ సామాన్యమైన పని కాదు. వానికి ప్రత్యేక నైపుణ్యం ఎంతైనా అవసరం. స్టాంపుల ముద్రణకు ఉపయోగించ వలసిన పేపరు, ఇంకు, డిజైను వగైరాలను అతి జాగ్రతతో ఎంపిక చెయ్యాలి. అన్ని దేశాలు స్టాంపుల్ని స్వంతంగా ముద్రించుకోలేవు. ఆ దేశాలకు కొద్దిపాటి స్టాంపులు మాత్రమే అవసరం వుంటాయి. వాటికోసం ముద్రణ తతంగం పెట్టుకుంటే పెద్ద మొత్తాలు వెచ్చిం

చాయి. అందుచేత కొన్ని దేశాలు స్టాంపుల ముద్రణను పెద్ద పెద్ద స్టాంపు ముద్రణ కంపెనీలకు వప్పగిస్తాయి. **1856** నుంచి **1926** వరకు ఇండియన్ స్టాంపుల్ని లండన్‌లోని 'థామస్ డిలారూ' కంపెనీ వారు ముద్రించేరు. స్టాంపులను తయారుచేసే కంపెనీలు ప్రపంచంలో చాలా యున్నాయి. ప్రపంచంలోకెల్లా స్టాంపులు తయారుచేయు పెద్ద కంపెనీ యునైటెడ్ స్టేట్సులోని "H.E. హారిస్ అండ్ కో" (H.E. Harris & Co.). **1917** సంవత్సరంలో H.E. హారిస్ అను వ్యాపారి సౌత్ బోస్టన్ నగరంలో 'సమ్మర్ స్ట్రీట్'లో స్టాంపుల ముద్రణ కంపెనీని స్థాపించేరు. ఫలితంగా ప్రపంచంలో ఆ కంపెనీయే పెద్ద స్టాంపుల సంస్థగా పరిగణింపబడుతోంది. అనేక దేశాల స్టాంపుల ముద్రణ చేపట్టడంతో **1950** సంవత్సరం ప్రాంతంలో ఆ సంస్థ సుమారు **400** మందికి ఉపాధి కల్పించింది. అప్పట్లో వారి జీతాలు కొన్ని లక్షల రూపాయలు మాత్రమే. రాను రాను ఈ వ్యాపారం కంప్యూటర్ల సాయంతో కోట్లమీద జరుగుతోంది. సౌత్ బోస్టన్ నగరంలో ఒక అంతస్తు ఈ కంపెనీవారి ఆఫీసులతో నిండియుంది. ఈ కంపెనీ హోల్‌సేల్ కొనుగోలు అమ్మకం సాగిస్తోంది.

## 22. స్టాంపుల సేకరణ - భద్రత - ఎలా?

స్టాంపుల్ని ఎలా సేకరించాలి ?

ప్రపంచంలో అన్ని దేశాలలో విడుదల అయిన స్టాంపులు లభిస్తాయి. పాత స్టాంపులు, కొత్త స్టాంపులలో మింటు స్టాంపులు, ఉపయోగించబడిన స్టాంపులు వుంటాయి. పాత స్టాంపులలో మింటు స్టాంపుల సేకరణ చాలా వ్యయ ప్రయాసలతో కూడి యుంటుంది. అవి అసలు అరుదుగా తటస్థమవుతాయి. పైగా అవి సాధారణ స్టాంపు కలెక్టరు అందుబాటులో యుండవు. వాటి విలువలు వేలు,

లక్షల రూపాయల స్థాయిలో వుంటాయి. పాత స్టాంపులలో 'వాడిన స్టాంపుల' సేకరణ కూడా ఇలాంటిదే. ఒక్కొక్కప్పుడు అరుదైన వాడిన స్టాంపు విలువ పైస్థాయిలోనే వుంటుంది. అరుదైన స్టాంపుల్ని స్టాంపు డీలర్లు తమ కేటలాగులలో ముద్రించి వేలంలో అమ్మ జూపుతారు.

మరి పాత స్టాంపుల సేకరణ అతి కష్టంతో కూడినది గనుక భారతదేశంలో స్టాంపు కలెక్టర్లకు పూర్వకాలపు మింటు స్టాంపుల సేకరణ మృగ్యంగా కనిపిస్తుంది. అందుచేత వాడిన స్టాంపుల ఖరీదు అంతగా వుండదు గనుక వాటిని స్టాంపుల సప్లై సంస్థల ద్వారా కొనటం మేలు. లేదా, పాత ఫామిలీ లెటర్లగల కవర్లపై అంటించిన స్టాంపుల్ని జాగ్రత్తగా తీసి శుభ్రపరచిన తరువాత ఆల్బములో చేర్చుట ఉత్తమమైన పని. కొన్ని స్టాంపుల్ని ఇతర స్టాంపు కలెక్టర్ల నుంచి మార్పిడి (exchange) పద్ధతిలో సేకరించవచ్చు.

1947లో భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన దేశ ప్రాచీన తపాలా చరిత్రకు, నేటి పోస్టల్ చరిత్రకు కొట్ట వచ్చినట్లు తేడా కనపడుతుంది. స్టాంపు డీలర్ల వద్ద నేడు మన దేశ మింటు స్టాంపులు లభ్యమవుతాయి. కొత్త స్టాంపుల విడుదల సమయాలలో పోస్టల్ డిపార్టుమెంటు వారి వద్ద నుంచి మింటు స్టాంపులు కొనుక్కోవచ్చు. స్టాంపు కలెక్టర్లకు సహాయం కలిగిస్తూ ఈ మధ్య పెద్ద పెద్ద పోస్టాఫీసులలో 'కలెక్టర్స్ ప్యాక్' (Collector's Pack)తో ఆ సంవత్సరంలో విడుదల అయిన స్టాంపుల నన్నింటిని అందిస్తున్నాయి.

కొత్తగా స్టాంపు కలెక్షన్ మొదలు పెట్టినవారు ఆదిలోనే తమ కిష్టమైన 'సబ్జెక్టు'గాని, 'థీము'గాని ఎంపిక చేసుకోవాలి. ఆ సబ్జెక్టు పరిపూర్ణత కలిగినదై వుండాలి. లక్ష్యంలేని కలెక్షన్ వ్యర్థ ప్రయాసం. అంతేగాక స్టాంపు కలెక్టర్ని నిరుత్సాహ పరుస్తుంది. మన స్టాంపు కలెక్టర్లకు అందుబాటులో వుంటాయి గనుక 'ఇండియా' దేశ కొత్త

స్టాంపుల సేకరణ ప్రోత్సాహం కలిగించి ఉత్సాహం రేకెత్తిస్తుంది. మింటు స్టాంపులు కూడా సేకరించవచ్చు. నిజమైన స్టాంపు కలెక్టరు స్టాంపు యొక్క విషయ జ్ఞానం తెలుసుకోవాలి. విషయం తెలియకుండ కొంతమంది గుడ్డిగా స్టాంపుల్ని సేకరిస్తారు. వారు అనవసరంగా పెట్టుబడి పెడుతున్నారన్నమాట. ఈ మధ్య భారతదేశంలో పెద్ద స్టాంపు కలెక్టరుగా పేర్గాంచిన 'గారీ రాజ్ గార్డియ' (మైకా గనుల ప్రొప్రయిటరు) స్టాంపు కలెక్షన్ వృద్ధాప్యంతోపాటు హెచ్చయింది. ఒక స్థానిక స్టాంపు డీలరు ఆయన స్టాంపు కలెక్షన్ని చూడానికని తీసుకుని దాన్ని మంచి మొత్తానికి అమ్మివేశానని అతనికి చెప్పేసరికి గుండె పగిలినంత పని అయింది. తన స్టాంపు కలెక్షను విడిచిపెట్టి వుండటాన్ని అతను భరించలేక పోయేడు. అలాటి వాడే నిజమైన స్టాంపు కలెక్టరని ప్రఖ్యాత ఫిలటలిస్టు శ్రీ యం. సి. సుభానీ తెలియ చేస్తున్నారు.

పెట్టుబడి పెట్టగల శక్తి వుంటే డీలర్ల వద్ద నుంచి అన్నిరకాల స్టాంపులున్న ప్యాకెట్లు కొనుక్కోవడం ఉత్తమం. వారివద్ద రకరకాల ప్యాక్ లుంటాయి. 50, 100, 200 స్టాంపులుగల ప్యాకులలో వివిధ స్టాంపులుంటాయి. పెద్ద పేకెట్లలో చిన్న పేకెట్లలో వున్నవన్నీ వుంటాయి. ఒక చిన్న ప్యాకెట్టు ఒక పెద్ద ప్యాకెట్టు కొంటే ఒకే రకం స్టాంపులుంటాయి గనుక తన 'థీము'కి ఉపయోగించగా కొన్ని మిగిలిపోతాయి. అలా ఎక్కువైన వాటిని 'మార్పిడి' (exchange) ద్వారా మార్చి తనకు కావలసిన వాటిని సేకరించాలి. అప్పుడు స్టాంపుల 'డూప్లికేషన్' వుండదు. ఇలా బాగా స్టాంపుల్ని సేకరించే సరికి ఆల్బంలో సంగ్రహించవలసిన స్టాంపుల ఖాళీలు కొన్ని వుంటాయి. అప్పుడు తనవద్ద లేని స్టాంపుల్ని విడిగా కొనుక్కోవటం సులభం. ఇలా కావాలనుకున్నప్పుడు ఒకరిద్దరు డీలర్లను తనకు కావలసిన స్టాంపులను ఏ రేటుకి సరఫరా చేయగలరో అడగాలి. లేదా,

ప్రతి సంవత్సరం ఏదో ఒక రాష్ట్రంలో పోస్టల్ డిపార్టుమెంటువారు స్టాంపుల ఎగ్జిబిషనులను నిర్వహిస్తూ వుంటారు. అచ్చట డీలర్ల స్టాల్సులో వాటిని కొనవచ్చు.

కలం స్నేహం వలన స్టాంపుల్ని మార్పిడి చేసుకుని తమకు కావలసిన వాటిని సంపాదించుకోవచ్చు. న్యూస్ పేపర్లలోను, కొన్ని మ్యాగజీనులలోను స్టాంపుల ఎక్స్ఛేంజికి కలం స్నేహితులు కావాలని ఎడ్వర్టయిజ్ చేయవచ్చు. ఒక్కొక్క నగరంలోని స్టాంపు కలెక్టర్లు అంతా కలిసి ఒక 'స్టాంప్ క్లబ్' స్థాపించుకుని స్టాంపుల్ని మార్పిడి చేసుకోవచ్చు.

స్టాంపుల్ని ఎలా భద్రపరచాలి?

స్టాంపులుంటే సరికాదు. కొన్ని పరికరాలు కూడా సేకరించాలి. ఆయిల్ పేపరు కవర్లలో వాటిని భద్రపరచాలి. రెండు ప్లాస్టిక్ ట్రేలు వుండాలి. బ్లాటింగు పేపరు షీట్లు వుండాలి. దళసరి కాగితాలుగల స్టాకు బుక్కులలో అడ్డుగా కాగితం ముక్కలున్న షీట్లు ఆల్బంలో చేర్చని స్టాంపులను భద్రపరచవచ్చు. ఇంకా గ్రాఫ్ షీట్లు, పి.వి.సి. కవర్లు, పెర్ఫొరేషన్ గాజ్, వాటరుమార్కు డిటెక్టరు, ట్వీజరు, భూత అద్దం, కలరుగైడు, ప్రాముఖ్యం తెలిపేటందుకు 'ఏరోలు' మొదలైన వన్నీ సేకరించాలి. స్టాంపు కేటలాగు తప్పనిసరిగా దగ్గర వుంచుకోవాలి.

సాధారణంగా చాలా మంది ఇళ్ళల్లో ఫామిలీ లెటరు కట్టలుంటాయి. వాటిపై స్టాంపులు అతికించబడి వుంటాయి. ఇంకా ప్రతి దినం వచ్చే టపాలు, స్నేహితుల టపాలు, ఆఫీసు టపాలు- వీటిని జాగ్రత్తగా ఒక కంట కనిపెట్టాలి ఆ కవర్లపై స్టాంపుల్ని బలవంతంగా ఊడదియ్యకూడదు. స్టాంపు చుట్టూ కొంత జాగా వుంచుతూ కత్తిరించి జాగ్రత్త చెయ్యాలి. ఒక ట్రేలో కొంచెం మంచి నీరు పోసి

అందులో కొంచెం ఉప్పు వేసి కరిగించాలి. దానిలో కత్తిరించిన స్టాంపుల్ని 2 లేదా 3 నిమిషాల సేపు నాననివ్వాలి. తరువాత స్టాంపు అనుకున్న కాగితాన్ని జాగ్రత్తగా తొలగించాలి. అలా తీసిన స్టాంపు వెనుక భాగంలో ఇంకా జిగురు వుంటుంది. ఆ స్టాంపుని మంచినీరు పోసిన మరొక ట్రేలో 2 లేక 3 నిమిషాలు ఉంచితే ఆ జిగురు కరిగి పోతుంది. తరువాత ఆ స్టాంపుని బ్లాటింగు పేపరుపై వుంచి దానిపైన మరో బ్లాటింగు పేపరు వుంచితే తడి కొద్ది నిమిషాలలో ఆరిపోతుంది. అలా తడి ఆరిన స్టాంపుల్ని ఒక బైండు పుస్తకంలో మడత పడకుండ ఒక్కొక్కటి వుంచి జాగ్రత్తగా ఆ పుస్తకాన్ని మూసి దానిపై బరువు వుంచాలి. ఒకటి రెండు రోజులలో ఆ స్టాంపులు సాపుగా, నీటుగా తయారవుతాయి. వాటిని పైకి తీసి ఆల్బములో తగిన స్థానంలో అమర్చాలి. మింటు స్టాంపులైతే వాటిని నేరుగా ఆల్బములో చేర్చ వచ్చును. కొన్ని దేశాల పోష్టు మార్కులకు సిరా ఉపయోగిస్తారు. అలాటి స్టాంపుల్ని నీటిలో వేస్తే ఆ సిరా కరిగి స్టాంపులు పాడవు తాయి. అంతేగాక ఆ ట్రేలో వున్న ఇతర స్టాంపులు కూడా పాడవు తాయి. అలాటి వాటికి 'రిమూవర్' (Rapid hinge remover)ని ఉపయోగించాలి.

## 23. తీములవారి స్టాంపు సేకరణ

### (Thematic Collection)

స్టాంపు కలెక్టరు స్టాంపుల సేకరణలో కర్తవ్యం అయిందను కోవటం పొరపాటు. తాను ప్రోగు చేసిన స్టాంపుల్కి తగిన న్యాయం చేకూర్చాలి. వాటిని ఒక తీరులో వుంచాలి. దీనికి కారణాలు చాలా వున్నాయి. ఒకటి- అలా వుంచితే అవి పాడవవు. రెండు- బాగా అమర్చిన కలెక్షను స్టాంపు కలెక్టరికి ఆత్మాభిమానం, సంతృప్తి, ఆనందం కలుగజేస్తుంది. తన కలెక్షను ఇతరులకు చూపించి తాను

ఆనందభరితుడై ఎదుటి వారికి ఆనందం కలుగచేస్తాడు. ఇలా తన ఆనందాన్ని పెట్టించుకోవటమే గాక ఇతరులకు కూడా ఈ హాబీయందు అభిరుచి కలుగచేస్తాడు.

స్టాంపు కలెక్షను ప్రాముఖ్యంలోకి వచ్చినది లగాయతు ప్రపంచంలో చాలా దేశాలు వాటి నాగరికత, పరిశ్రమలు, ప్రకృతి దృశ్యాలు, చరిత్ర, జాగ్రఫీ తదితర విషయాలలో ప్రగతిని చాటించే స్టాంపుల ముద్రణ చేపట్టేయి. దీనితో స్టాంపుల పరిధిలోకి రాని అంశమే లేదని చెప్పవచ్చు. కొన్ని ప్రఖ్యాత 'సబ్జెక్టు' సర్వసాధారణం అయిపోయేయి. ఉదాహరణకు ప్రఖ్యాత స్త్రీ పురుషులు, పుష్పాలు, రైల్వేలు, పక్షులు, జంతువులు, రవాణా సౌకర్యాలు, లలిత కళలు, పెయింటింగులు, పోస్టల్ చరిత్రలు, మతాలు, స్కౌటు రెడ్‌క్రాస్ ఉద్యమాలు, ఆటలు, అంతరిక్ష పరిశోధనలు మొదలైన స్టాంపుల్ని అనేక దేశాలు విడుదల చేస్తున్నాయి. ఇన్ని థీములు (themes)గల స్టాంపుల్ని దేశాలవారీగా సేకరించటం, వాటిని ఆల్బములలో చేర్చటం స్టాంపు కలెక్టరు ఓర్పు, నేర్పు, సామర్థ్యం తెలియచేస్తాయి. అందుచేత స్టాంపు కలెక్టర్లు ఒక దేశానికి సంబంధించిన కొన్ని 'థీములను' మాత్రమే 'స్పెషలైజు' చేస్తారు. ఒక్కొక్క స్టాంపు కలెక్టరుకు ఒక్కొక్క 'సబ్జెక్టు'గాని, 'థీము'గాని నచ్చుతుంది. అతడు దానినే 'స్పెషలైజు' చేస్తాడు. ఉదాహరణకు పక్షుల స్టాంపుల్ని పరిశీలిద్దాం. వాటిని కొన్ని గ్రూపులుగా విభజించవచ్చు. నేలపై తిరిగే పక్షులు, సముద్రంపై ఎగిరే పక్షులు, వేట పక్షులు. ఇలాగే జంతువుల్ని కూడా విభజించవచ్చు. వాటిని తిరిగి దేశాలవారీగా విభజించవచ్చు. పాలిచ్చే జంతువుల స్టాంపుల్ని అనేక దేశాలు విడుదల చేసేయి.

1887లో న్యూఫౌండ్‌లాండ్ కుక్క తలగల 1/2 సెంటు స్టాంపుని గులాబి రంగులో ముద్రించి పాలిచ్చే జంతువుల స్టాంపులు విడుదల చేయటంలో అగ్రస్థానం అలంకరించింది. 1894లో తిరిగి

1/2 సెంటు స్టాంపుని నలుపు రంగులో విడుదల చేసింది. 1919లో 'కారిబన్' (caribon) తలగల 1 సెంటు స్టాంపు కూడా విడుదల అయింది. స్ట్రెయిట్ సెంటిలెన్ (మలయ) 1891లో 2 సెంట్ల పులి స్టాంపుని, 50 సెంట్ల పులి తల స్టాంపుని విడుదల చేసింది.

1892లో లైబీరియా 4 సెంట్ల ఏనుగు స్టాంపుని, 1 సెంటు 'హిప్పోపొటమస్' స్టాంపుని విడుదల చేసింది.

1913లో ఆస్ట్రేలియా 'కంగారు' బొమ్మగల స్టాంపుల పరం పరని విడుదల చేసింది.

1922లో టాంగనైకా జిరాఫీ తలగల స్టాంపుల పరంపరని విడుదల చేసింది.

1962లో భారతదేశం ఒక కొమ్ముగల 'రైనోసిరాస్' బొమ్మ గల 15 పైసల స్టాంపుని 'వైల్డ్‌లైఫ్ సెలబ్రేషన్' సందర్భంగా ముద్రించింది. 7-10-1963న గౌర్, పండా, ఏనుగు, పులి, సింహం బొమ్మలుగల స్టాంపుల్ని కూడ విడుదల చేసింది. ఇలా జంతువుల్ని ఒక 'తీము'గా తీసుకోవచ్చు. ప్రపంచంలో క్రూరమృగాల్ని మరో 'తీముగా' తీసుకోవచ్చు. తిరిగి దేశాలవారీగా తీముల్ని ఎంపిక చేయ వచ్చు.

ఇలాగే పండ్లను, పుష్పాలను "తీములుగా" తీసుకోవచ్చు. 15-8-1933న అంగోలా 'అంగోలియన్ ఫౌనా'ను పరిసరాలను తెలియచేసే ఇరవై స్టాంపుల సెట్టును విడుదల చేసింది. నేడు చాలా దేశాలు సహజ రంగులలో ఆ దేశ పూలు, మొక్కలు (Fauna) గల స్టాంపుల్ని విడుదల చేస్తున్నాయి. భారతదేశం కూడ కాశ్మీరు సౌందర్యాన్ని, సుందర దృశ్యాల్ని తెలియచేసే స్టాంపుల్ని విడుదల చేసింది. మామిడి పళ్ళగుత్తి, జీడిపండు మొదలైన పళ్ళజాతుల్ని చూపిస్తూ భారతదేశం అనేక స్టాంపుల్ని విడుదల చేసింది. ఇలాటి 'తీములు' అనేకాలున్నాయి.

## 24. స్టాంపు ఆల్బములు-స్టాంపుల అమరిక

స్టాంపు కలెక్టరు సాధారణంగా ఆల్బంలో స్టాంపుల్ని అమర్చడంలో 'అజాగ్రత్తకి' గురి అవుతాడు. ఆల్బంలో వాటిని తెలివిగా అమర్చటం స్టాంపు కలెక్టరు యొక్క సమర్థతని తెలియచేస్తుంది. కావలసిన స్టాంపుల్ని సేకరించేక మంచి ఆల్బములను సంపాదించాలి. వాటిలో ఆ స్టాంపుల్ని అమర్చటానికి ఓర్పు నేర్పు కావాలి.

### స్టాంపు ఆల్బములు :

మార్కెట్లో అనేక రకాల స్టాంపు ఆల్బములు లభిస్తాయి. కాని పేజీకి ఇరువైపుల స్టాంపుల్ని అతికించే ఆల్బములు కొత్త స్టాంపు కలెక్టర్లకు మంచిదికాదు. పేజీలు త్రిప్పేటప్పుడు స్టాంపులు చినిగి పోవటం, ఊడిపోవటం, నలిగిపోవటం మున్నగు ప్రమాదాలకు గురి అవవచ్చు. లూజు షీట్లుగల ఆల్బములు చాలా మంచివి. స్టాంపుల కేటలాగులు కొనడం ఎంతైనా ప్రయోజనకరం. ఏ స్టాంపుని ఏ స్థానంలో అమర్చాలో సరైన చోటు వాటిద్వారా తెలుస్తుంది. అంతే గాక ఆ స్టాంపు వివరాలు కూడ తెలుస్తాయి.

చౌకబారు ఆల్బముల నెప్పుడూ కొనకూడదు. రానురాను స్టాంపులపై మోజు పెరిగిన కొలది ఆ ఆల్బం తృప్తి నివ్వదు. తిరిగి ఆల్బం మార్చాలనిపిస్తుంది. స్టాంపులను ఒక ఆల్బంలో నుంచి మరొక దానికి బదలాయించేటప్పుడు కొన్ని పాడవటానికి అవకాశం యుంటుంది. ఇలా ఆల్బంలు మారుస్తున్న కొద్దీ స్టాంపు పాడవుతూనే వుంటాయి. అందుచేత ప్రారంభంలోనే మంచి ఆల్బం కొనుక్కోవాలి.

### ఆల్బములలో రకాలు :

1) స్టాంపునమర్చుటకు జాగాయుంచుతూ దానిక్రింద దాని వర్ణన (Write-up) కొరకు ఖాళీలుండేవి.

2) 'బ్లాంక్' (Blank) ఆల్బములలో స్టాండర్డు నమూనాలో పేజీలుండేవి.

3) చదరపు గళ్ళ పేజీలుగల ఆల్బములలో స్టాంపుల నమర్చు టకు కాళీలుండేవి.

బ్లాంకు ఆల్బములే సదుపాయం. అవి లూజు షీట్లలో సాధా రణంగా లభ్యమవుతాయి గనుక ఆ పేజీలను అనుగుణంగా పైకితీసి మార్చుకోవచ్చు. అవసరం లేనివాటిని తీసేయవచ్చు. స్టాంపు కేట లాగులు, గ్లైడు సాయంతో స్టాంపుల్ని ఆల్బములలో అమర్చటం శ్రేయస్కరం, సులభం. ప్రింటెడు ఆల్బములు తీరిక తక్కువగా యున్నవారికి సహాయకారిగా వుంటాయి.

స్టాంపుల అమరిక :

స్టాంపుల్ని ఆల్బములలో చేర్చేటప్పుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. 'స్టాంపు హింజస్' (Stamp hunges) చాలా ముఖ్యం. ఇవి 'జిగురు' అంటించిన చిన్న కాగితం ముక్కలు. స్టాంపుహింజి చివరను స్టాంపు వెనుకభాగానికి అంటించాలి. రెండోచివర ఆల్బం పేజీకి అంటించాలి. దీనివలన స్టాంపు వెనుకభాగాన్ని వాటరు మార్కుని సులభంగా పరిశీలించవచ్చు. హింజి పైకి కనపడదు. ఈ హింజిలు మార్కెట్లో లభిస్తాయి. ఇవైతే స్టాంపుల్ని అతికించిన. వెనకభాగాన్ని అతి సులువుగా తీసివేయవచ్చు. స్టాంపు దెబ్బతినదు. వీటిని వాడేటప్పుడు కొన్ని జాగ్రత్తలు పాటించాలి. 'గమ్' పూర్తిగా ఆరిన తర్వాతనే స్టాంపు చోటు మార్చాలనుకుంటే ఒక గంటసేపు ఆగి అది ఆరిన తరువాత దాన్ని తీసి తను అనుకున్న మరోజాగాలో అంటించవచ్చు.తడి ఆరని హింజీలలో స్టాంపుల్ని పైకితీస్తే ఆ స్టాంపు దాని స్థానంలో సరిగ్గా అతికించాలంటే జిగురువున్నవైపు, క్రింద వైపు యుండేటట్లు పట్టుకొని 1/4 భాగం తడిచెయ్యాలి. స్టాంపుని

షేవిలుపై బోర్లయుంచాలి. అప్పుడు హింజి తిరగవేసిన చిన్న భాగాన్ని కొంచెం తడిచేసి స్టాంపు వెనుకభాగంలో గల మధ్య పైభాగంలో అతకాలి. ఆ హింజి పెర్ఫొరేషన్ని కప్పివేయకుండ చూడాలి. ఇప్పుడు హింజి యొక్క మూడవ భాగం మాత్రమే స్టాంపుకి అతకబడుతుంది. 2/3 వంతు తడిచేయకుండానే వుంటుంది. తడిలేని భాగాన్ని చివర ఇప్పుడు తడిచేసి అల్బంలో దాన్ని ఎక్కడ అతకాలో అక్కడ వేలుతో ఆ పేజీపై నొక్కాలి.

అల్బంలో స్టాంపుల నెలా అమర్చాలి?

ఒక సబ్జెక్టుపై విడుదల అయిన స్టాంపుల సన్నిటిని అల్బంలో చేర్చాలి. దీనికి స్టాంపుల సేటలాగు సాయం వుండాలి. దీనిని బట్టి స్టాంపు కలెక్టరు తనవద్దలేని స్టాంపులకు కొంత జాగా అల్బంలో వుంచాలి. స్టాంపులను ఒక పద్ధతిలో అమర్చాలి. స్టాంపుకి, స్టాంపుకి మధ్య ఖాళీ సమానంగా వుండేటట్లు చూడాలి. ఒక సెట్టుగాని, ఒక విడుదలకుగాని సంబంధించినవి అన్నీ ఒక యూనిట్‌గా వుండాలి. ఆ సెట్టు చిన్నదైనా అవవచ్చు లేదా పెద్దదైనా అవవచ్చు. కొన్ని రెండు లేక మూడు పేజీలు పట్టవచ్చు. ఏ పేజీకూడ స్టాంపులతో ఉక్కిరిబిక్కిరి అవకూడదు.

## 25. స్టాంపు గురించిన వ్రాతలు
### (Write-ups)

ప్రతీ స్టాంపుకి చిన్న 'రైటప్' (Write–up) అవసరం. ఈ రైటప్‌ల వలన ఈ హాబీ మరింత ఆనందాన్ని చేకూరుస్తుంది. స్టాంపుపై లేని విషయాలు 'రైటప్'లో యుండాలి. 'రైటప్' ముఖ్యంగా విడుదల తేదీ, ఎందుకు విడుదల చేసింది, వాటరు మార్కు, పెర్ఫొరేషను, ఆర్టిస్టు, డిజైనరు, ప్రింటరు, ఉపయోగించిన పేపరు, ఎన్ని

స్టాంపులు విడుదల అయేయి మున్నగు విశేషాలు తెలియచెయ్యాలి. ఆ విషయాలు క్లుప్తంగా వుండకపోతే స్టాంపు యొక్క ప్రాముఖ్యతే పోతుంది. 'రైటప్'లు ఆకర్షణీయంగాను, విషయాన్ని తెలియచేసేవిగాను, తూకవుగాను (Balanced), వుండాలి. 'రైటప్'ను ముందుగా వ్రాసేక స్టాంపుని అతికించాలి. స్టాంపుని అతికించే స్థానం, రైటప్లను మొదట పెన్సిల్‌తో మార్కు చేసుకోవాలి. తరువాత వాటిని రబ్బరుతో చెరిపి వేయవచ్చు.

## 26. ప్రఖ్యాత అంతర్జాతీయ ఫిలటలిస్టులు

ప్రఖ్యాత అంతర్జాతీయ ఫిలటలిస్టులు కొందరు అంతర్జాతీయ ఎగ్జిబిషనులలో తమ తమ స్టాంపు సంపదలను ప్రదర్శిస్తూ వుంటారు. వారిలో ముఖ్యమైనవారు ఇటలీ దేశానికి చెందిన 'మిసెస్ సమూద్ ఖోర్షీ', బ్రిటను దేశానికి చెందిన 'డాక్టర్ అండ్ మిసెస్ రిడ్డెల్', 'Mr. జిర్యాన్'లు, స్పెయిన్ దేశానికి చెందిన 'Mr. లూయిూ సెర్బేరా'. వీరుగాక బ్రిటిషు రాజ దంపతుల స్టాంపు కలెక్షను, లండన్‌లోని 'ది రాయల్ ఫిలటిక్ సొసైటీ', న్యూయార్కులోని 'కలెక్టర్స్ క్లబ్' మున్నగు సంస్థలు కూడా ఎగ్జిబిషనులలో పాల్గొంటాయి.

ప్రపంచంలో ప్రఖ్యాత స్టాంపు కలెక్టర్లుగల పది దేశాలలో భారత దేశం ఒకటి. ప్రపంచ అంతర్జాతీయ ఎగ్జిబిషనులలో మన దేశం పాల్గొని అనేక ప్రత్యేక గౌరవ అవార్డులు, చెప్పుకోతగ్గ బంగారు పతకాలు సంపాదించుకున్నందుకు మనం గర్వించదగిన విషయం. భారతదేశంలో ప్రముఖ స్టాంపు కలెక్టర్లుగా పేర్గాంచినవారు 1) Mr. డి. ఎన్. జాటియా (డైరెక్టర్, జాటియా గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్) 'Roll of Distinguished Philatalist'గా గౌరవించబడ్డారు. 2) Mr. పి. గుప్త (ప్రెసిడెంట్ ఆఫ్ ఓర్గనన్ ఇండియా లిమిటెడ్) ఎక్కువ

సంఖ్యలో మన దేశానికి అవార్డులను సంపాదించేరు. 3) Mr. ఎస్. బి. కొఠారి (M.D. జనరల్ ఇండస్ట్రియల్ సొసైటీ లిమిటెడ్) జాతీయ ఎగ్జిబిషనులో Grand Prix అవార్డు పొందుటయేగాక, విదేశాల ఎగ్జిబిషనులలో పాల్గొని అనేక బంగారు పతకాలు పొందేరు. 4) Mr. ఎస్. ఎన్. పొద్దార్ grand prix గ్రహీత. 5) Dr. (Mrs) సీతా ధతేజా (గైనకోలజిస్టు, బెంగుళూరు). 6) Mr. ఎమ్. సి. శుఖాని (ప్రెసిడెంటు, ఇండియన్ స్టాంపు డీలర్స్ అసోసియేషన్, కలకత్తా): భోపాల్ కలెక్షన్‌లో బంగారు పతక గ్రహీత.

వీరుగాక ఇంకా స్టాంపు కలెక్టర్లుగా ప్రసిద్ధి కెక్కిన వారిలో శ్రీ ఎఫ్. డి. పిస్తోన్జీ, శ్రీ లక్ష్మీచంద్ కినియా, శ్రీ ఎం. జీ పిట్టీ, శ్రీ రియాజాట్ హుస్సేన్, శ్రీ టి. ఎస్. మూర్తి, శ్రీ పి. ఎం. మేద్ హోరా, శ్రీ రుస్తుంజీ F ష్రాఫ్, శ్రీ వి.ఎస్.ఎన్. రావ్, డా॥ కె.ఎస్. రావ్, డి. ఆర్. మిస్త్రీ ముఖ్యమైనవారు. వీరిలో ఎక్కువమంది హైదరాబాదుకు చెందినవారు. ఆంధ్రప్రదేశ్‌లో స్టాంపు కలెక్టర్లు ఎక్కువ సంఖ్యలో ఒక్క హైదరాబాదులోనే వున్నారు. ఇతర పట్టణాలలో తక్కువ సంఖ్యలో వున్నారు. ఇటీవల పోస్టల్ డిపార్టు మెంటువారు ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ముఖ్య నగరాలలో స్టాంపు ఎగ్జిబిషన్లు నిర్వహించటం మొదలుపెట్టిన నుంచి స్టాంపు కలెక్షను ప్రచారం ప్రభావంవల్ల చాలా పట్టణాలలో బాల బాలికలు ప్రయోజనం పొందుతున్నారు. ఇన్నాళ్ళు ఆంధ్రప్రదేశ్ స్టాంపు కలెక్షన్లలో వెనక బడుటకు కారణం ప్రచార లోపమే.

## 27. ప్రఖ్యాత స్టాంపు మ్యూజియములు

### కార్డినల్ స్పెల్‌మన్ ఫిలటిక్ మ్యూజియం

ప్రపంచ పోస్టలు చరిత్రలో కార్డినల్ స్పెల్‌మన్ (cardinal spellman) యొక్క స్టాంపు కలెక్షను ప్రఖ్యాతమైనది. ఇది అమెరికా

లోని బోస్టన్ నగరానికి అంటిపున్న వెస్టన్‌మాస్‌లో కార్డినల్ స్పెల్‌మన్ ఫిలటిక్ మ్యూజియంలో వుంది. స్పెల్‌మన్ తన ప్రపంచ యాత్రలో తన జీవితాంతం సేకరించిన అనేక దేశాల నుండి తనకు కానుకలుగా లభించిన మింటు స్టాంపులు, వెటికన్ సిటీ స్టాంపులు ఈ మ్యూజియంలో వున్నాయి. తన తరువాతివారు వాటిని వ్యయ పరచకుండా అతడు 'రెజిస్ కాలేజీ'కి శాస్వతంగా దత్తం చేసేడు. అతని స్నేహితుడు ఒకరు ఆ కాలేజీలో స్పెషల్ మ్యూజియంను నిర్మించేడు. అది **1964**లో **500** ప్రఖ్యాత అంతర్జాతీయ ఫిలటిస్టుల సమక్షంలో కాలేజీకి అంకితం చేయబడింది. ఈ మ్యూజియంలో అనేక స్టాంపుల ప్రదర్శన ఫ్రేములు, ఫిలటిక్ లైబ్రరీ,ఒకఫోటో స్టూడియో, ఆఫీసు గది, మరియు స్టాంపు కలెక్టర్లు తమ ఆల్బముల ప్రదర్శనకు ఏర్పాట్లు, మ్యూజియం కృషి తెలియచేయు పత్రికల ప్రచురణ ఏర్పాట్లు, ఫిలటిక్ రీసెర్చికి తగిన సదుపాయాలు వున్నాయి. ప్రెసిడెంటు ఈసన్ హోవర్ అధ్యక్ష పదవిలో వున్న కాలంలో తనకు కానుకలుగా లభించిన ప్రఖ్యాత స్టాంపులు, అరుదైన స్టాంపులను స్పెల్‌మన్‌కి బహూకరించేడు. అంతరిక్షంలోకి మొదటి మిస్సైలులో పంపించిన లేఖ వాటిలో అతి అరుదైనది.

ఇతర మ్యూజియములు

న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరీలో బెంజిమన్ కె. మిల్లర్ (Bengman K. Miller) యొక్క U.S. స్టాంపుల కలెక్షను **(1847-1920)** స్పెల్‌మన్ కలెక్షనుకన్నా చిన్నదైనా చెప్పుకోతగ్గది.

లండన్, హేగ్, స్టాక్‌హోం, బెర్న్, పారిస్, కైరో, బ్రుసెల్స్ నగరాల్లోని మ్యూజియాలలోని కలెక్షన్లు చూడదగినవే.

భారత ప్రభుత్వం న్యూఢిల్లీలో **6** జూలై **1968**లో జాతీయ ఫిలటిక్ మ్యూజియంను ఆవిష్కరించి అనేక అపూర్వ స్టాంపుల్ని భద్రపరిచింది.

# స్టాంపుల కలెక్షన్

# ద్వితీయ భాగము

## విషయములు

స్వాతంత్ర్యా నంతరం భారత ప్రభుత్వం వివిధ రంగాలలో విడుదల చేసిన స్టాంపులలో ఇమిడియున్న కథలు, గాథలు మనకి విస్మయం, భ్రాంతి కలుగజేస్తాయి. ఆ స్టాంపులు ప్రఖ్యాత ప్రాచీన దేవాలయాలు, మసీదులు, నిర్మాణాలు, ప్రముఖ తపోధనులు, కవులు, స్వాతంత్ర్య పోరాటయోధులు, సంఘ సంస్కర్తలు, అనేక శతాబ్దాలు స్వర్ణ, రజిత, సంవత్సరిక ఉత్సవాలు జరుపుకున్న సంస్థలు, స్వర్ణ దేవాలయ నిర్మాణం, సోమనాథ దేవాలయ నిర్మాణం, గౌహతీ రీఫైనరీ, ఎర్రకోట, గోల్‌గుంబాద్, త్రిమూర్తి, నటరాజ, బోధిసత్వ, అశోక స్తంభం, బుద్ధ జయంతి, గాంధీజీకి "మహాత్మ" బిరుదిచ్చిన నరసింహ మెహత, "కాక్స్టన్ ఆఫ్ ఇండియా"గా పేర్గాంచిన మున్షి నెవాల్ కిషోర్ మున్నగు వాటికి సంబంధించినవి. ఇంకా ఇతర విషయాలెన్నో వున్నాయి.

(భారత దేశానికి 15 ఆగస్టు 1947న స్వాతంత్ర్యం లభించి నది లగాయతు అన్ని రంగాలలోను స్టాంపుల్ని ప్రభుత్వం విడుదల చేసింది. వాటి సమీక్ష మిక్కిలి ఆసక్తికరంగా వుంటుంది. స్టాంపుల విడుదల తేది, స్టాంపుపై పేరు, దాని విలువ, ఆ స్టాంపు పూర్వాపరాలు, విశేషాలు వరుసగా తెలియచేయడమైనది.)

## 1. భారత దేశం స్వాతంత్ర్యం పొందింది.

**(India attains Independence)**

ఈ శుభదిన జ్ఞాపకార్థం 3 స్టాంపులు విడుదల అయేయి. వీటి తయారీ ఆలస్యం అవటంవలన అవి వివిధ తేదీలలో విడుదల అయేయి.

**1) 21-11-1947 – 15 ఆగస్టు 1947 – 3 1/2 A. S.**

భారత దేశ జాతీయ పతాకం. ఇది త్రివర్ణ పతాకం, ఆకుపచ్చ సశ్యశ్యామలాన్ని, తెలుపు కాంతిని, కాషాయం త్యాగాన్ని సూచిస్తాయి. మధ్యలో అశోక చక్రం విశ్వన్యాయాన్ని తెలియచేస్తుంది. దీన్ని సూచించిన ఘనత ఆంధ్రుడు, బందరు నివాసి అయిన శ్రీ పింగళి వెంకయ్యగారికి చెందింది.

**2) 15-12-1947 – 15 ఆగస్టు 1947 — 1 1/2 As:-**

సారనాథ్ అశోకస్థంభం. దీన్ని భారతదేశ రాజ్య చిహ్నం(State emblem)గా ప్రభుత్వం పాటించింది. ఈ చిహ్నం యొక్క భావం తెలుసుకోవాలి. క్రీ. పూ. 500 ప్రాంతంలో గౌతమబుద్ధుడు తాను కనుగొన్న సత్యాన్ని సారనాథ్‌లో ప్రథమంగా బోధించేడు. అశోకుడు (క్రీ. పూ. 273-232) అచట క్రీ.పూ. 242లో నాలుగు సింహాల స్తంభాన్ని (Lion Capital of Emperor కట్టించేడు. భారత దేశానికి స్వాతంత్ర్యం లభించేక ఆ స్తంభాన్ని ప్రభుత్వ చిహ్నంగా భారత ప్రభుత్వం ఎంపిక చేసింది. ఆ స్తంభంలో చెక్కబడిన నాలుగు సింహాలు ఒక్కొక్కటి ఒక్కొక్క దిక్కువైపు తిరిగియున్నాయి. అవి నాలుగు దిశల్ని సూచించటం వలన 'ధర్మం'ను ప్రపంచం అంతటా చాటిస్తున్నాయని గ్రహించనగును. అంతేకాదు. అసలు అవి ఒక పలకంపైయున్న ఒక ఏనుగు, ఒక అశ్వం, ఒక వృషభం, ఒక సింహంయున్న శిల్పాన్ని మోస్తున్నాయి. అవి "విశ్వన్యాయ చక్రం" (Universal wheel of Law) ప్రకారం ఒక్కొక్కటి వేరుచేయ

బడ్డాయి. తిరగవేసిన కమలంపై వజ్రాలతో పొదిగిన ఆసనం గౌతమ బుద్ధుని దయాపూరిత హృదయాన్ని తెలియచేస్తుంది. ఏనుగు గౌతముని తల్లి యొక్క స్వప్నానికి, జన్మకి చిహ్నం. అశ్వం(కంటక) గౌతముడు రాజసౌకర్యాలు వదలుకుని రాజభవనం నుంచి బయటకు తీసుకువచ్చిన దానికి గుర్తు. వృషభం గౌతముడు వృషభరాశిలో జన్మించినట్లు, సింహం విశ్వాధి పత్యాన్ని తెలియచేస్తాయి. ఋగ్వేదం కూడ తూర్పు దిక్కుని ఏనుగు, దక్షిణ దిక్కుని అశ్వం, పశ్చిమ దిక్కుని వృషభం, ఉత్తర దిక్కుని సింహం రక్షిస్తాయని చెప్తోంది. పరుగెత్తే అశ్వం సూర్యుడికి, వృషభం ఆకాశానికి చిహ్నాలు కమలం ప్రపంచంలో నిత్యం సంభవించే జనన మరణాలకు చిహ్నం.

**3) 15-12-1947 + 15 ఆగష్టు 1947** As. విమానం.

ఆకాశంలో స్వేచ్ఛగా ఎగిరే విమానం స్వాతంత్ర్య చిహ్నంగా భావించబడుతోంది.

## 2. ఎయిర్ ఇండియా అంతర్జాతీయ ప్రథమ యానం.

### (Air India Inter national First Flight)

8-6-1948 + Air India International First Flight + 1 2 As.

ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్ పూర్తిగా భారతీయ ఎయిర్ లైను. ఇది **8-6-1948**న ప్రథమంగా బొంబాయి నుండి లండన్‌కు బయలుదేరింది. ఈ స్టాంపు ఆ తొలియాత్రలో తీసుకువెళ్ళబడిన లేఖలకు మాత్రమే పోష్టేజిగా పరిమితం అవటం విశేషం.

## 3. మహాత్మాగాంధి.

### (Mahatma Gandhi)

15-8-1948 + Mahatma Gandhi + 1 1/2 A, 3 1/2 A, 12A, 10Rs

**1948** జనవరి **30**వ తేదీన దేశపిత మహాత్మాగాంధి హత్య గావించబడ్డాడు. గాంధీజీకినివాళులుసర్పించుటకు పైనాలుగు స్టాంపుల

విడుదలఅయేయి. ప్రథమ స్వాతంత్ర్య వార్షికోత్సవదినం నాడు వీటి విడుదలజరిగింది. జననం: 2-10-1869, మరణం: 30-1-1948.

### 4. ఆర్కియో లాజికల్ సిరీస్
### (Archaeological Series)

15-8-1949 భారతదేశ ద్వితీయ స్వాతంత్ర్య వార్షికోత్సవ సంవర్భంగా ఆర్కియో లాజికల్ సిరీస్‌లో భారతీయ కళా నైపుణ్యా నికి తార్కాణాలైన చిత్రాలు 16 స్టాంపుల సెట్టులో ముద్రించ బడ్డాయి.

1) Ajanta Panel + ఏనుగు + 3పై.

ఈ స్టాంపులోని చిత్రం మహారాష్ట్రలోని ఔరంగాబాద్ సమీ పంలోగల అజంతా గుహలలోని ఏనుగు. ఈ గుహలు క్రీ. పూ. 1వ శతాబ్దానికి క్రీ. శ. 600 కి మధ్యకాలము నాటివి. ఏనుగు రాజ భక్తికి, నిశ్చలతకి, బలానికి చిహ్నం. వేదాలలో ఏనుగు లక్ష్మీదేవికి వాహనంగా పేర్కొనబడింది. యుద్ధాలలో, దేవాలయాలలో, రాజ భవనాలలో పెంపుడు జంతువుగా ఏనుగు ప్రఖ్యాతమయింది. క్రీ.పూ. 500 ప్రాంతంలో మగధరాజగు బింబిసారునకు అనేక ఏనుగులు గుర్రాలు, రథాలతోపాటు యుండేవని బౌద్ధవాఙ్మయం తెలియచేస్తోంది. గౌతమబుద్ధుని అద్భుత కృత్యాలలో "నలగిరి" అనే వెర్రి ఏనుగని లొంగతీయగా అది గౌతముని పాదాక్రాంతం అవటం ఒకటి.

2) Konark Horse + 6పై.

ఒరిస్సా రాష్ట్రంలో కోనార్క్‌వద్ద 'సూర్యదేవాలయం' నరసింహదేవుని కాలంలో (1238—1264) నిర్మించబడింది. దేవాలయం అంతా ఒక రథాకారంలో రాతిచే చెక్కబడింది. ఒక్కొక్క చక్రం 10 అడుగుల వ్యాసం కలిగి అంతులేని జీవిత చక్రాన్ని సూచిస్తుంది. రాతితో చెక్కబడిన 12 చక్రాలతో ఆ రథం అమర్చ

బడింది. ఈ రథం ఎత్తు 75 మీటర్లు. ప్రతిదినం సూర్యభగవానుడు ఆకాశంలో ప్రయాణించేసే సిలెస్టియల్ రథానికి ఇది ప్రతీక.

3) Trimurty + 9 Ps. (Three-in-one Trimurty).

ఈ స్టాంపులో మూడు ముఖాలున్నాయి. 'త్రిమూర్తి' అనగానే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనుకుంటాము. కాని ఈ ముఖాలు వేరు. అవి వేరే విషయాన్ని తెలియ చేస్తాయి. కుడివైపు ముఖం 'అఘోర భైరవు'నిది—భీకరమైనది. తామ-సగుణంనుంచి విముక్తి నొసగేది, తామ-సగుణ నాశని. మధ్య ముఖం 'తత్పురుష సదాశివు' నిది— 'విమోచనమైనది, ఉత్కృష్టమైనది, మధ్యస్థమైనదిన్నీ' Absolute, Transcendent and Neutral). ఎడమ ముఖం ప్రేమ, దయ, జాలిని ప్రసాదించే శివుని భార్య 'ఉమ'ది. ఉమ మహాశక్తి స్వరూపం. ఆమె చేతిలో కమలం న్యాయ ధర్మాల ఆంతర్యాన్ని, 'ముక్తి' లేక ఇహ లోక బంధాల నుండి విముక్తి నిచ్చేదని సూచిస్తుంది. నిత్యం మారే టువంటిది. నిమిత్త మాత్రమైనట్టిది. అంతులేనిది అయిన సృష్టి, నిశ్శబ్దం, చురుకుతనం, ప్రశాంతతలని సూచించటం తత్పురుష లక్షణం. అవిపుట్టి అనేక శాఖలై చివరకు సదాశివునిలో లీనమౌ తాయి. ఈ శివత్రయం (Trinity) యొక్క సందేశం గాంధార, తర్కీస్తాన్, కాంబోడియా, చైనా, జపాన్ దేశాలల్లోకూడ చోటు చేసుకుంది. ఈ చిన్న స్టాంపు ఎంత తత్త్వజ్ఞానాన్ని మన ముందుం చిందో చూసేరా! ఇది బొంబాయి దగ్గరలోయున్న 'ఎలిఫెంటా' గుహాంలోని శిల్పసంపదలోని చిత్రం.

4) Bodhisatva + 1 A.

హిందూమత సాంప్రదాయంలో కర్మకాండ, నాట్యం, శిల్ప నైపుణ్యం, చిత్రలేఖన— ముఖ్యమైన కళా సూత్రాలు. చెయ్యి చాచ టంలో తీరుల్ని 'ముద్రలు' అంటారు. వాటికి ఒక్కొక్క స్థితికి ప్రత్యేక ప్రాముఖ్యం యుంది. చెప్పాలంటే అదోభాష, అదోశాస్త్రం. ఆ

ముద్రల' ద్వారా అందులో పాండిత్యం కలవారు పరస్పరం మాట్లాడు కోవచ్చు. ఇది హిందూ యోగశాస్త్రం.. బౌద్ధులుకూడ ఈ సూత్రాల ననుసరించే ధ్యానం చేసేవారు.

దయాపూరితుడై సింహాసనాన్ని అధిష్ఠించియున్న గౌతమ బుద్ధుని శిల్ప చిత్రాన్ని స్టాంపులో చూడవచ్చు. ఈ శిల్పం 12వ శతాబ్దంలో ఉత్తరప్రదేశ్‌లోని 'మహోబా' లోనిది. ఇది నేడు లక్నో మ్యూజియంలో వుంది. **15-8-1947**న ఈ స్టాంపు ముద్రించినప్పుడు ఎడమ చెయ్యి కుడివైపున ఆనుకొన్నట్లున్నది. ఈ తప్పుని తెలుసు కున్నాక ప్రభుత్వం **15-7-1950**లో తిరిగి సరిగా ముద్రించింది.

5) Nataraja + 2 A.

ఈ స్టాంపులోని చిత్రం తమిళనాడులోని తిరువేలంగాడు దేవాలయంలోని కంచు విగ్రహం. తమిళనాడులో చిదంబరంలోని నటరాజ విగ్రహం కూడ ఇదే మాదిరిగా యుంది. ఈ కంచు విగ్రహం ప్రాచీన చోళరాజుల కాలమునాటిది (**1000 A.D.**). దీనిని నేడు మద్రాస్ మ్యూజియంలో చూడవచ్చు. ఇది అంతులేని విశ్వనాట్యంలో నాట్యశివుని భంగిమ. 'నటరాజ అనగా నాట్యానికి రాజు. శివతాండ వంలో విశ్వం అంతా ప్రకంపిస్తుంది. విశ్వం యొక్క ముఖ్య విధులు ఐదు. అవి **1)** సృష్టి (Creation) **2)** స్థితిలేక రక్షణ (Conservation) **3)** సంహారం లేక నాశనం. పునర్జన్మ (Destruction and rebirth) **4)** తిరోభవం లేదా ఆత్మల రూపాలు (Incarnation of souls) **5)** అనుగ్రహం లేదా చావు బ్రతుకుల కాలచక్రం నుంచి విముక్తి (Liberation from the cycle of births and deaths) శివతాండవం ఈ ఐదింటికి అనుగుణంగా యుంటుంది. నటరాజ స్టాంపులో పైకుడి చేతిలోయున్న చిన్న డమ్ము డోలక్ సృష్టియొక్క ప్రథమ ధ్వనిని సూచిస్తుంది. క్రింది కుడిచేయి బాధలకు గురిఅయిన ఆత్మలకు ముక్తి గలదన్న ఆశాభావాన్ని తెలియ చేస్తుంది. పై ఎడమ చేతిలో 'నిప్పు'

ఖంతి యుంది. అది దైవాన్ని తెలుసుకోవటానికి ఆటంకాలు కలుగ చేసే చెడుగు, అంధకారం, అజ్ఞానాలను దహించి వేయటాన్ని సూచిస్తుంది. క్రింది ఎడమచేయి ఆత్మ విమోచనాన్ని తెలియచేస్తుంది. ఎత్తియున్న 'ఎడమ పాదం' ఆత్మకి ఆశ్రయం ఇస్తుందని భావం. 'కుడి పాదం' "ములాలక" అనే రాక్షసుణ్ని అణగద్రొక్కటాన్ని సూచిస్తుంది. ఇది అజ్ఞానాన్ని, చెడుగుని అణగద్రొక్కటాన్ని తెలియచేస్తుంది.

6) Sanchi Stupa+3 A.

క్రీ పూ. 3వ శతాబ్దంలో మధ్యప్రదేశ్‌లోని 'సాంచి' వద్ద అశోక చక్రవర్తి ఒక బౌద్ధ ఆశ్రమాన్ని నిర్మించేడు. దాన్ని శృంగ వంశానికి చెందిన రాజులు క్రీ.పూ. 150 ప్రాంతంలో పాడైన అసలు ఇటిక స్థూపాన్ని రెట్టింపు సైజులో పునరుద్ధరించేరు. తరువాత ఆంధ్ర వంశ రాజులు కూడా బౌద్ధ మతాన్ని పోషించేరు. 13వ శతాబ్దంలో అచటి బౌద్ధ సన్యాసులు మహమ్మదీయ దాడులను తట్టుకోలేక సాంచిని విడిచిపెట్టిపోయేరు. సాంచి "ఉత్తర ద్వారం" బుద్ధుని పూర్వజన్మలో విశాంతరాజు విశేషాలు తెలియచేస్తుంది. విశాన్తర జాతక కథలో రాజు తన రాజ్యాన్నంతని బీదలకు దానం చేసి ఇహలోక సౌఖ్యాలకు వీడ్కోలు చెప్పి దైవత్వాన్ని పొందేడు.

7) Bodh Jaya Temple+2 1/2 As.

క్రీ.పూ. 3వ శతాబ్దంలో అశోక చక్రవర్తి నేటి బీహారులోని బోధ్‌గయవద్ద ఒక దేవాలయం కట్టించేడు. ఇది గౌతమ బుద్ధుడు జ్ఞానం సంపాదించిన బోధి వృక్షం వద్ద బుద్ధుని జ్ఞానోదయ జ్ఞాపకార్థం నిర్మించబడింది. ఉత్తర హిందూస్థానం సుమారు 1100 సంవత్సరాల మహమ్మదీయ దాడులకు గురిఅయి పురాతన శిల్పకళ నాశనమైనా బోధ్‌గయ దేవాలయం చెక్కు చెదరలేదు. ఈ దేవాలయంలో ద్వారాలపై వున్న గ్రాదులపై చెక్కడాలు చెక్కు చెదరకుండా మౌర్య

శిల్పకళా నైపుణ్యానికి తార్కాణాలుగా నిలిచేయి. ఇవి క్రీ.పూ. 150 నుంచి క్రీ.పూ. 100వని శాస్త్రజ్ఞుల అంచనా. గౌతమునికి జ్ఞానోదయం అయేక అతడు నడచిన త్రోవ బోధ్‌గయ ద్వారాలకు మధ్య వున్నది. బోధ్‌గయ హిందువులకు బౌద్ధులకు కూడా ముఖ్యమైన పుణ్యస్థలం. బుద్ధుని హిందువులు 10వ అవతారంగా పరిగణిస్తారు. ఈ మధ్య వరకు ఈ దేవాలయం హిందువుల చేతిలోనే వుండేది.

8) Bhuvaneswara Lingaraj Temple+4 As.

ఒరిస్సా రాష్ట్రంలో భువనేశ్వర్‌లో లింగరాజ్ దేవాలయం ప్రసిద్ధమైనది. ఇది శివునికి అంకితం అయింది. 900-1000 A.D. మధ్యకాలంలో ఈ దేవాలయ నిర్మాణం జరిగింది. ఇచ్చటనే రాజ్ రాణి దేవాలయం కూడా అప్పట్లోనే నిర్మించబడింది. ఇచ్చటి మత పూరితమైన శిల్ప సంపద యాత్రికులను ఆనంద పరవశం చేస్తుంది. కాని యాత్రికులు దేవాలయంలోని తటాకంలో స్నానమాచరించి దైవ దర్శనానికి నేరుగా లోనికి వెళ్తారు. వారికి శిల్ప సంపదతో ప్రమేయం లేదు. దేవాలయం విశ్వాసానికి ప్రతీక అని వారికి తెలుసు. వారు ఇతర ఆకర్షణలకు లోనుగాక దైవాన్ని దర్శించి ప్రార్థనలు సలుపుటయే వారి ధ్యేయం.

9) Gol Gumbad+Bijapur+6 As.

1636లో మొగల్ చక్రవర్తికి బిజాపూరు సుల్తాను అయిన సుల్తాన్ మహమద్ ఆదిల్‌ఖా (1626-1656) సామంతుడగుటచే అంగీకరించక తప్పలేదు. అయినా 1686లో ఔరంగజేబు చక్రవర్తి బీజాపూరును పూర్తిగా జయించేడు. బీజాపూర్ ఆదిల్‌షా వంశీయులకు రాజధాని 1565లో అహమద్‌నగరు, గోల్కొండ, బీహారు రాజ్యాలు కలసి విజయనగరం (హంపి) రాజుని ఓడించేరు. మహమద్ ఆదిల్‌షా యొక్క సమాధి పేరు 'గోల్ గుంబాద్'. ఇది బీజాపూర్‌లో

వుంది. దీని కలశం (dome) ప్రపంచంలోకెల్ల రెండవదిన్ని, లండన్ లోని సెంట్ పాల్స్ కన్న పెద్దదీని. దీని లోపలి ఎత్తు 178 అడుగులు.

10) Kandarya Temple+8 As.

ఈ స్టాంపు ముద్రణ ఒక్క చరిత్రతో ముడిపడటమేగాక హిందూ తత్త్వ జ్ఞానాన్ని బోధిస్తుంది. మధ్యప్రదేశ్ లోని ఛత్రపూర్ జిల్లాలోని 'ఖజూరాహో' ఒక చిన్న గ్రామం. ఒకానొకప్పుడు ఆ గ్రామం నూరు దేవాలయాలతో మహా వైభవంగా తులతూగిన మహానగరం. రాజపుత్ర వంశీయులగు ఛాండేల్ లు ఈ దేవాలయాల నిర్మాతలు. వారిలో యశోవర్మరాజు కుమారుడైన 'ధంగ' రాజు (950-999 A.D.) ఖజూరాహో దేవాలయాల నిర్మాణంలో చేసిన కృషి గణనీయమైనది. కండార్య మహాదేవుని దేవాలయం ప్రస్తుతం మిగిలియున్న ఇరవై దేవాలయాలలో పెద్దది. ఇది శివునికి అంకితం కాగా, మిగిలిన దేవాలయాలు విష్ణువుకి, దేవికి, జైన తీర్థంకరులకు అంకితమయేయి. 'కాండర్య' అంటే గుహ. హిమాలయాలలో శివుని నివాసమైన కైలాస పర్వతం మాదిరిగానే ఈ దేవాలయ శిల్పకళా నైపుణ్యం తీర్చిదిద్దబడింది.

11) Satrunjaya Temple+Palitana+15 Rs.

గుజరాత్ లోని శత్రుంజయ కొండలలో పలితాన (Palitana) నగర ప్రాంతంలోగల శత్రుంజయ జైన దేవాలయం చాలా అందమైనది. ఇచ్చట సుమారు 500లకు పైగా దేవాలయాలున్నాయి. అసలు ఈ 'దేవాలయ నగరాలు' మానవ నివాసం కోసం నిర్మించబడలేదు. అవి అతి సూక్ష్మమైన చిత్త వృత్తినిచ్చి, నిత్యం వుండే ఆత్మ సంబంధమైన విలువలని యాత్రికులకు గుర్తు చేస్తాయి.

12) Golden Temple+Amritsar+12 As.

ఈ స్టాంపులోని స్వర్ణ దేవాలయానికి చిన్న చరిత్ర గాథ వుంది. 1577లో అక్బరు చక్రవర్తి 4వ సిక్కు గురువైన రామదాస్‌కు లాహోరు సమీపంలో ఒక సరోవరం గట్టుపై కొంత స్థలాన్ని దేవాలయ నిర్మాణానికి ఇచ్చేడు. ఆ సరస్సులోని నీటికి రోగాల్ని నయం చేసే గుణాలున్నాయి. గనుక దానికి 'అమృత్‌సర్' (Pool of Immortality) అన్న పేరు వచ్చింది. ఇక్కడ గురు రామదాస్ స్వర్ణ దేవాలయాన్ని (Golden Temple) నిర్మించేడు. కాని అది ఆఫ్ఘన్ దాడులకు గురి అయింది. అహమ్మద్‌షా దుర్రేన్ ఈ దేవాలయాన్ని ముందుగా గో రక్తంతో మలినంచేసి నాశనం చేసాడు. రంజిత్‌సింగ్ మహారాజు లాహోరుని, అమృత్‌సర్‌ని వశపరచుకొని నేడు మనం చూసే స్వర్ణ దేవాలయాన్ని పునర్నిర్మాణం గావించాడు.

13) Victory Tower+Chittorgarh+1r.

రాజస్థాన్‌లో మేవార్ రాజ్యానికి చిత్తూరు రాజధానిగా వుండే రోజుల్లో, విజయ సూచకంగా నాటి రాజులు 'కీర్తి' స్తంభాలు లేక 'విజయ' స్తంభాలు నిర్మించేవారు. వాటిలో మిగిలినది చిత్తూరులోని విజయ స్తంభం. ఇది 1440లో కట్టబడింది. ఇది నిలువునా మనుష్యుల బొమ్మలు, చక్రాలు, పూలు, ఆకులతో అలంకరించబడింది. దీన్ని పూర్తి చేయడానికి ఎనిమిది సంవత్సరాలు పట్టింది. దీని ఐదవ అంతస్థులో శిల్పి అయిన "జైత", అతని ఇరువురు కుమారుల ప్రతిమలున్నాయి.

14) Red Fort+Delhi+2r.

షాజహాన్ చక్రవర్తి ఆగ్రా నుండి పదకొండు సంవత్సరాల పరిపాలనానంతరం తన రాజధానిని ఢిల్లీకి మార్చాడు. తన రాజభవనంతోపాటు ఒక కోట నిర్మాణం జరగాలనుకున్నాడు. ఆ విధంగా

ఢిల్లీలో ఎర్రకోట నిర్మాణం చేపట్టడమయింది. కోట గోడలు ఎర్ర ఇసుకరాయితో కట్టబడ్డాయి. 1647లో రాజభవన నిర్మాణం పూర్తి అయింది. 17వ శతాబ్దంలో మనదేశయాటనకు వచ్చిన ఫ్రెంచి యాత్రికుడు యఫ్. బెర్నియర్ (F. Bernier) దీనిని వర్ణించేడు. కోటచుట్టూయున్న కందకం నీటితోయుండి మత్స్య సంపద గలిగి వుంది. కోట పొడవు 3,100 అడుగులు. వెడల్పు 1,650 అడుగులు. చక్రవర్తిగారి "దివాని ఇ ఆమ్" లేదా Hall of Public Audience శిల్ప సౌందర్యంతో అలరారుతోంది. ప్రయివేటు ఆడి యన్సుహాలు లేదా "దివాని ఇ ఖాస్" తెల్ల చలువరాయితో మలచ బడిన హాలులో చలువరాతి స్తంభాలపై అమర్చబడిన వేదిక కలిగి యుంది. కోటలో ఇదే అత్యంత సౌందర్యమైన భాగం. చలువరాతి వేదిక ఒకప్పుడు నెమలి సింహాసనాన్ని తనపై వుంచుకుంది. 1739లో నాదర్‌షా ఢిల్లీని నాశనంచేసి ఈ నెమలి సింహాసనాన్ని పర్షియాకు తరలించుకు పోయేడు.

15) Tajmahal + Agra + 5r.

తాజ్‌మహల్ చరిత్ర నెరుగనివారుండరు. ఆగ్రాలో యమునా నదీ తీరాన షాజహాను భార్య ముంతాజ్‌మహల్ జ్ఞాపకార్థం షాజహాను దీనిని నిర్మింపచేసేడు. 14 బిడ్డల్కి తల్లి అయేక చివరి కాన్పులో 1631లో ఆమె మరణించింది. చక్రవర్తి ఆమె భౌతికకాయాన్ని ఆగ్రాకు తీసుకెళ్ళి ఆమె జ్ఞాపకార్థం అచట తాజ్‌మహల్ నిర్మించేడు. ప్రపంచంలోని ఏడు అద్భుతాలలో తాజ్‌మహల్ ఒకటి. ఇది అతి సౌందర్యమైన కట్టడం. ఆగ్రా కోటలో కొడుకు ఔరంగజేబ్ తన తండ్రిని ఖైదీగా యుంచి, చివరకు అతని కోరికపై తన భార్య ముంతాజ్ సమాధి ప్రక్కనే సమాధి చేసేడు.

16) Qutb Minar, Delhi + 10 Rs.

తన విజయాన్ని చాటించటానికి "కుతుబుద్దీన్ ఐబక్" 1200 ఎ. డి. లో ఈ మినార్ నిర్మాణానికి పూనుకున్నాడు. బహుశః అతని జీవిత కాలంలో దాని పునాది మాత్రమే పూర్తి అయింది. అతని తరువాత ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించిన 'ఇల్‌టుట్మిష్' దాని నిర్మాణాన్ని పూర్తిచేసేడు. దాని 2, 3, 4 అంతస్థులలో అతని పేరు చెక్కబడింది. 5వఅంతస్థులో సుల్తాన్ ఫిరోజ్‌షాతుగ్లక్ ఈ స్తంభాన్ని పునర్నిర్మాణం గావించినట్లు వ్రాయబడింది. ఆ స్తంభం యొక్క ప్రవేశభాగాన్ని సుల్తాన్ సికందర్‌లోడీ బాగుచేయించేడు. మసీదుకు ప్రక్కనే యుండుటవలన ఈ మీనారు సంరక్షణకు ఉపయోగించింది. కుతుబ్‌మినార్ చరిత్ర దానిపై వ్రాయబడింది. దేనుమెంటుపై వ్రాయబడిన దానినిబట్టి కుతుబుద్దీన్ ఐబాక్ మరో ఇద్దరుతో కలసియుండుట వలన వారి యజమాని ఘర్‌కు చెందిన మహమ్మద్ బిన్‌శామ్ అని తెలియచేస్తుంది. 1638లో ఈ మినారెట్ మెరుపువల్ల దెబ్బతినింది. కాని సుల్తాన్ ఫిరోజషా తుగ్లక్ దానిని 4వ అంతస్థు వరకు బాగు చేయుంచి, 5వ అంతస్థు చేర్చి దానిపై ఒక 'కుపోలా' ఎక్కించేడు. 1803లో ఒక భూకంపం ఈ కుపోలా (గోపురం)ని క్రిందికి త్రోసి వేసింది. కాని పై అంతస్థులు దాని ధాటికి తట్టుకున్నాయి.

## 5. భారతదేశ రిపబ్లిక్ ప్రకటన.

**(India declares Republic)**

**26-1-1950**

భారతదేశం రాజ్యాంగాన్ని తయారుచేసుకుని 26-1-1950ని రిపబ్లిక్‌గా ప్రకటించుకుంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని 4 స్టాంపుల సెట్టు విడుదల అయింది. 2a, 3 1/2a, 4a, 12a

స్టాంపులు. ఈ స్టాంపులు ప్రజల ఉత్సాహాన్ని, విద్య, ఆహార, వస్త్రాల రంగాలలో ప్రభుత్వ దీక్షను తెలియచేస్తాయి.

a) 2a స్టాంపు ప్రజల ఉత్సాహాన్ని తెలియచేస్తుంది.

b) 3 1/2a స్టాంపులో ఒక సిరాబుడ్డి, కలం, గాంధీజీకి ప్రియమైన "రఘుపతి రాఘవ రాజారాం..." హిందీ గీతం వున్నాయి. ఇవి విద్యని సూచిస్తాయి.

c) 4a జొన్నకంకి, నాగలి- ఆహారాన్ని సూచిస్తాయి.

d) 12a స్టాంపులో చరకాయున్ను, నూలు వస్త్రం వున్నాయి. ఇవి వస్త్రాల్ని సూచిస్తాయి.

## 6. బోధిసత్వ
## (Bodhisatva)

15-7-1950 + Bodhisatva + 1a.

ఈ స్టాంపులో బోధిసత్వుని చిత్రం సరిచేసి ప్రింటుచేయబడింది.
**(15-8-1949లోని ప్రింటు తప్పు సరిచేయబడింది)**

## 7. ప్రథమ ఏసియన్ గేమ్స్
## (First Asian games)

4-3-1951 + First Asian games స్టాంపులు + 2a. 12a.

ఢిల్లీలో మార్చి 1951లో జరిగిన మొదటి ఏసియన్ గేమ్స్ జ్ఞాపకార్థం ఈ స్టాంపులు విడుదల అయేయి. అప్పట్నుంచి ప్రతి 4 సంవత్సరాల కొకసారి ఏదో ఒక ఏసియన్ దేశ రాజధానిలో ఈ ఆటలు నిర్వహించ బడుతున్నాయి.

## 8. పుణ్య పురుషులు-కవులు
## (Saints and Poets)

1-10-1952 + Saints and Poets.

భారతదేశ పుణ్యస్త్రీ పురుషులు ప్రఖ్యాత కవుల గౌరవార్థం ఆ స్టాంపులు విడుదల అయేయి.

a) Kabir + 9 Ps. కబీరు కాశీలో 1440లో ఒక బీద చేనేత కుటుంబంలో జన్మించేడు. జన్మరీత్యా హిందూ అయినా ముస్లిం అయినా అది పెద్ద విషయంకాదు. అతని గురువు ఒక బ్రాహ్మణుడు. హిందువులు, మహమ్మదీయులు కూడ కబీరుకి శిష్యులయేరు. ఆ రెండు మతాలవారు అతనిని ప్రేమాభిమానాలతో చూసేవారు. దక్షిణాది నుంచి కాశీ వచ్చిన రామానంద్ యొక్క బోధనలు కబీరుని ఆకర్షించేయి. కబీరుయొక్క ముఖ్య సందేశం 'దైవప్రేమ'. దైవాన్ని త్రికరణ శుద్ధిగా నమ్మేడు. భగవంతుడు మసీదులలోను దేవాలయాల్లోను కూడ యున్నాడని బోధించేడు. సోదరభావం మానవుల్లోను, పితృభావం భగవంతునిలోను యుందని నమ్మేడు. తాను నమ్మిన దానిని తన శిష్యులకు బోధించేడు. అలా హిందూ ముస్లిం ఐక్యతకు దారి చూపించేడు.

కబీరు చనిపోయేక అతని భౌతిక కాయానికి ఏ సాంప్రదాయం ప్రకారం అంత్యక్రియలు చెయ్యాలా అన్నది సమస్య అయి హిందూ ముస్లిం శిష్యుల మధ్య దుమారం ఏర్పడింది. అప్పుడు కొంతసేపు అయేక అకాశవాణి కబీరు శరీరంపై కప్పిన గుడ్డను పైకి తీయమని కోరింది. ఆ గుడ్డని ఎత్తగానే ఆశ్చర్యం! మృతదేహానికి బదులు అచట గులాబి పుష్పాల ప్రోగువుంది! ఆ పుష్పాలలో సగం ముస్లిం సోదరులు తీసుకొని అతడు చనిపోయిన స్థలమైన 'మాఘర్' (Magher)లో సమాధి చేయుగా, హిందూ సోదరులు రెండవ సగ

భాగాన్ని కాశీ తీసుకవెళ్ళి అచట చితి ఏర్పరచి ఆ భస్మాన్ని పవిత్ర గంగానదిలో కలిపేరు!

b) Tulasidas + 1 a. తులసీదాస్ 16-17 శతాబ్దపు కవి. తపస్వి. హిందీలో "రామచరిత మానస్" అను రామాయణాన్ని వ్రాసేడు.

c) Mira Bai + 2a. మీరాభాంయ్ రాజస్థాన్‌లోని మేర్వారు రాజగు "కుంభ"ని వివాహం చేసుకుంది. ఆమె 1498 జన్మించింది. చిన్నతనం నుంచి కూడ ఆమె దైవచింతనలో లీనమయేది. రాజభవన కట్టుబాట్లను సాంప్రదాయాలను పెడనపెట్టి జ్ఞానోపాసన బాటలోకి ఆత్మప్రభోధం వలన ఉరికింది. మేర్వారు విడచిపెట్టి సన్యాసిని అయి, యాత్రలు సేవించుకుంటూ, చివరికి మథుర చేరుకుంది. అక్కడ ఆమె పొందిన పరవశానికి పరిధిలేదు. గంటలు, రోజులు తరబడి ఆమె పరవశంలో యుండిపోయేది. ఆఖర్కి రాణిగా జన్మించి ఒక సన్యాసిని అయి అనేక కష్టాల ననుభవించి 1546లో ఆమె మోక్షం పొందింది.

d) Surdar + 4a. 15-16 శతాబ్దానికి చెందిన సూర్‌దాస్ గొప్ప గాయకుడు. కాని అంధుడు అంతేకాదు, మానవాతీత రహస్యాలు తెలుసుకున్న మహాజ్ఞాని. భక్తిని రగల్చగల గొప్పకవి. మహాపవిత్రుడు. శ్రీరామ దైవానికి అంకితమయేడు. "సూర్సాగర్" (The Sea of Melody) గ్రంథంలో అతని మానవాతీత రహశ్యాలని చూడవచ్చు. అనేక ప్రజలు అతని ప్రభావానికి దాసులయేరు. తన లోపంవల్ల భగవంతునిపై భక్తి, ప్రేమ అతనికి అధికమయేయి. పరిపూర్ణత అయిన భక్తికి అతను ఉదాహరణ. తాను అంధుడైనా చాలా మందిలో ఆత్మజ్ఞాన జ్వాలల్ని రగిలించటంలో కృతార్థుడయేడు.

e) Mirza Ghalib + 41/2a. మీర్జాగాలిబ్ 19 వ శతాబ్దపు ప్రఖ్యాత ఉర్దూకవి. ఉర్దూ వాఙ్మయంలో అతని రచనలు వజ్రతునకలు.

f) Rabindranath Tagore + 12 as. రావీంద్రనాథ్ ఠాగోరు ప్రఖ్యాత కవి. అతడు వ్రాసిన "గీతాంజలి"కి 1913లో 'నోబెల్' బహుమతి లభించింది.

## 9. రై ల్వే శ తా బ్ది
## (Railway Centenary)

16-4-1953 + 2 as. భారతదేశంలో మొదటి ప్యాసింజరు ట్రయిను బోరిబందర్ (బొంబాయి) నుంచి మహారాష్ట్రలోని థానాకు 16 ఏప్రిల్ 1853న 32 కిలోమీటర్లు నడిపించిన విషయాన్ని గుర్తు చేస్తూ రైల్వే శతాబ్ది చేసుకున్న సందర్భంలో ఈ స్టాంపు విడుదల అయింది. స్టాంపులో 1853లో నడిపించిన స్టీము ఇంజను, నేటి లోకోమోటివ్ ఇంజను చిత్రించబడ్డాయి.

## 10. ఎవరెస్టు విజయం
## (Conqest of Everest)

2-10-1953 + Conquest of Everest + 2a, 14a.

1841 సంవత్సరంలో సర్ జార్జి ఏవరెస్టు హిమాలయాల 'ట్రిగ్నామెట్రికల్ సర్వే'ని సాధించటంతో ఆ శిఖరానికి 'మౌంటు ఏవరెస్టు' అని పేరు వచ్చింది. దీని ఎత్తు 8,882 మీటర్లు (29,028 అడుగులు). ఇది ప్రపంచంలోకెల్లా ఎత్తైన పర్వత శిఖరం. మానవుడు దీనిపై కాలిడటానికి చేసిన ప్రయత్నాలు విఫలంకాగా, 1953 మే నెల 29వ తేదీన ఉదయం 11-30కి హిల్లారి, టెన్సింగ్‌లు దీని నధిరోహించి విజయాన్ని సాధించేరు. ఈ విజయ సూచకంగా పై స్టాంపులు విడుదల అయేయి.

## 11. టెలిగ్రాఫ్ శతాబ్ది
## (Telegraph Centenary)

1-11-1953 + Telegraph Centenary + 2a, 12 as.

ఇండియన్ టెలిగ్రాఫ్స్ సెంటినరి సందర్భంగా పైరెండు

స్టాంప్లు విడుదల అయేయి. స్టాంప్లలో 1851 లో ఉపయోగించిన పోలుయున్న, నేడు ఉపయోగంలోయున్న పోలుని చూడవచ్చును.

## 12. స్టాంపు శతాబ్ది

## (Stamp Centenary)

1-10-1954 + Stamp Centenary + 1a, 4a, 2a, 14a.

a) 1a స్టాంప్లలో ప్రాచీన పోస్టలు ట్రాన్సుపోర్టు రకాలు, తపాలా రన్నర్లు, ఒంటె, ఎడ్లబండి ముద్రించ బడ్డాయి.

b) 4a స్టాంప్లలో నేడు పోస్టల్ టాన్సుపోర్టుకి ఉపయోగపడే సైకిలు, ట్రయిను, స్టీమరు ఏరోప్లేను వున్నాయి.

c,d) 2a, 14a స్టాంపులలో ప్రాచీనకాలంలో ఉత్తరాలు పంప్పే సాధనాలైన పావురం, నేటి ఆధునిక సాధనమైన విమానం ముద్రించబడ్డాయి.

## 13. ఐక్యరాజ్య సమితిదినం

## (United Nations Day)

24–10- 195! + United Nations Day + 2a.

రెండు ప్రపంచ యుద్ధాల మారణహోమాల అనంతరం 50 దేశాల ప్రతినిధులు, అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో శాన్ ఫ్రాన్సిస్కో వద్ద 25-5-1945న సమావేశమై మానవజాతిని యుద్ధాల బారినుంచి రక్షించడానికి, మానవాభివృద్ధికి, సమాజ శ్రేయస్సుకు ఒక అంతర్జాతీయ సంఘం ఏర్పాటు చేయటానికి తీర్మానించేరు. దాని ఫలితంగా 24 అక్టోబరు 1945ని 'యునైటెడ్ నేషన్స్" సంస్థ న్యూయార్క్ దగ్గరలో లేక్ సక్సెస్‌వద్ద ఏర్పడింది. అప్పట్నుంచి ప్రతి సంవత్సరం అక్టోబరు 24వ తేదీని 'యునైటెడ్ నేషన్స డే' క్రింద పరిగణింపబడింది.

## 14. రెండవ డిఫినిటివ్ సిరీసు

## (Second Definitive Series)

26-1-1955 + Second Definitive Series.

రిపబ్లిక్‌డే (1955) సందర్భంగా విడుదల అయిన 18

స్టాంపులు పంచవర్ష ప్రణాళిక క్రింద అనేక రంగాలలో ముందంజను చూపిస్తాయి.

a. Tractor + 3p + ట్రాక్టర్ల సాయంతో వ్యవసాయం.

b. Power-loom + 6p + పవరు లూముల సాయంతో బట్టలు నేయుట.

c. Persian-wheel +9p + పశువుల సాయంతో పర్షియన్ వీలు నుపయోగించి నీరు తోడుట.

d. Tilaiya Dam + 1A + బీహారులో హజారిబాగ్ దగ్గరులో దామోదరు నదిపై డాం.

e. Charkha + 2 As + చరఖాతో స్త్రీ నూలు వడకుట.

f. Hand loom + 3As + నాగాలాండు స్త్రీ చేనేత మగ్గం.

g. Bullocks + 4As + వ్యవసాయానికి ఎద్దుల జత.

h. Malario Control + 6As + మలేరియా నిరోధక చర్యలు.

i. Locomotive works chittaranjan + 8As + పశ్చిమ బెంగాలులో చిత్తరంజన్ వద్ద లోకోమోటివ్ వర్కుషాపు.

j. Marine Drive, Bombay + 10As + బొంబాయిలో మెరైన్ డ్రైవ్.

k. Aircraft Factory, Bangalore + 12 As బెంగుళూరులో ఎయిర్‌క్రాఫ్ట్ ఫ్యాక్టరీ.

l. Kashmir landscape + 14As కాశ్మీరు ఏరోప్లేను దృశ్యం.

m. Telephone Factory, Bangalore + 1r. బెంగుళూరులో టెలిఫోన్ ఫ్యాక్టరి.

n. Kanyakumari + 1Re 2As కన్యాకుమారి ఏరోప్లేను దృశ్యం.

o. Kanchenjunga + 1Re 8As. హిమాలయాల్లో ఎత్తైన రెండవ శిఖరం కాంచన్‌జుంగ.

p. Rare Earths Factory + 2r. కేరళలో ఆల్వాయ్ వద్ద రేర్ ఎర్త్సు ఫ్యాక్టరీ.

q. Sindhri Fertiliser Factory + 5r. బీహారులో సింద్రీ వద్ద ఎరువుల ఫ్యాక్టరీ.

r. Steel plant, Rourkela + 10r ఒరిస్సాలో రూర్కెలా వద్ద స్టీలు ప్లాంటు.

## 15. బుద్ధ జయంతి

### (Buddha Jayanti)

24-5-1956 + Buddha Jayanti + 2a, 14a.

గౌతమ బుద్ధుని **2,500**వ జన్మదినోత్సవ సందర్భంలో **24-5-1956**న ఈ రెండు స్టాంపులు విడుదల అయేయి. బుద్ధుడు మహారాజ భోగాలనన్నింటిని వదలిపెట్టి సన్యాసి అయి రాజభవనాన్ని వదలి బీహారులోని గయ సమీపంలో బోధివృక్షం క్రింద **49** దినాలు తపోధ్యానంలో మునిగి ప్రపంచంలో దుఃఖాలన్నిటికి కారణాలు, వాటి బంధం నుంచి విముక్తి మార్గం **49**వ నాటి ఉదయం కనుక్కొన్నాడు. తరువాత మరో ఏడు వారాలు ఆచెట్టు క్రిందే యుండి తాను కనుగొన్న నిజాన్ని గురించి ఆలోచించేడు.

రెండు అణాలస్టాంపులో గయవద్ద గౌతమబుద్ధుడు బోధివృక్షం క్రింద జ్ఞానం సంపాదించిన దానిని సూచిస్తుంది. ఈ వృక్షమే "జ్ఞాన వృక్షం". స్టాంపులో ఎడమవైపున యున్న గుండ్రని చిత్రం సారనాథ్‌లో క్రీస్తు తరువాత **1**వ శతాబ్దంలో కుషాన్ రాజగు కనిష్కుని కాలంలో బోధిసత్వుని పెద్ద విగ్రహంపై "ఛత్రం". ఆ ఛత్రం **10** అడుగుల వ్యాసం కలిగి అందంగా అమర్చిన కట్టులు అనేకాలు కలిగి యుంది. దాని కేంద్రం ఒక కమలం ఆకారంలో యుంది దానిరేకుల తరువాత వరుసలో పురాణాల్లో పేర్కొనబడిన పన్నెండు రాసులలోని

ఉంటుపులు వున్నాయి. తరువాత కట్టు పగిలినది. ఒకటి గాక పద కొండు సౌంజ్ఞలు వెలిగియుంది. మూడు ఆభరణాలు, ఒక జతచేపలు, ఒకమూల, ఆకులతో ఒక గిన్నె, ఒక శంఖం, ఒక స్వస్తిక, పళ్ళుగాని లేపి వస్తువులు గల ఒక పళ్ళెం, ఒక కప్పు ఆకులు, మరియు మూడు తేన పీల్చుగొట్టాలు, పైటయున్న చివరివరుస కలువరేకుల్ని సూచి స్తుంది. కుడిపైపు జ్ఞాన వృక్షమైన బోధివృక్షం చెక్కబడింది.

14 అణాల స్టాంపులో సిద్ధాంత చక్రం (The wheel of Doctrine) వుంది. ఈ వలయం పుట్టుకల్ని, ఇహంలో బాధల్ని సూచిస్తుంది. జీవితం యొక్క ప్రధానలక్ష్యం జ్ఞానోపార్జనం ఈ జీవిత వలయం (చక్రం) నుండి తప్పించుకోవాలన్న ధ్యాన, వలయా కారంలో జన్మలు, జీవితంలో ఎగుడు దిగుళ్ళు అద్దంలో వలె కనపడు తాయి. బుద్ధుడు ఏనాడూ తాను దైవాన్ని ప్రకటించ లేదు. నిజానికి ఈ జన్మలు, బాధల వలయం నుంచి బైటపడేమార్గాన్ని తాను కనుగొన్నానని బోధించేడు. చివరకి "మహా పరినిర్వాణ"ను పొందేడు.

## 16 లోకమాన్య బాలగంగాధరతిలక్

## (Lokmanya Balagangadhar Tilak)

23-7-1956 + Lokmanya Balagangadhar Tilak + 2As.

లోకమాన్య బాలగంగాధర తిలక్ మహారాష్ట్ర స్వాతంత్ర్య పోరాటనాయకుడు, సంఘసేవా తత్పరుడు, విద్వాంసుడు. "స్వరాజ్యం నా జన్మహక్కు" అని వక్కాణించిన నాయకుడు. స్టాంపు తిలక్ యొక్క 100వ జన్మదినోత్సవ సందర్భంగా విడుదల అయింది.

జననం : 23-7-1856, మరణం : 31-7-1920.

## 17. ఇండియా మ్యాపు సీరీసు
## (Map of India Series)

1-4–1957 + Map of India Series + lnp to 90 np.

ఇది 3వ డి ఫినిటివే సీరీస్ విడుదల. ఈ స్టాంపులలో అంత మాన్ నికోబరు దీవులు ముద్రించబడలేదు.

## 18. సిపాయి తిరుగుబాటు శతాబ్ది
## (Centenary of the Mutiny)

15-8-1957 + Centenary of the Mutiny + 15np, 90nP.

ఝాన్సీరాణి 18-11-1835లో బెనారస్‌లోని మహారాష్ట్రి 'కర్హాడ' బ్రాహ్మణ కుటుంబంలో జన్మించింది. అదే కుటుంబంలోని ఒక రాజాతో ఆమె వివాహం జరిగింది. కాని ఆమెకు సంతతిలేదు. ఆమె దత్తత చేసుకోవటాన్ని బ్రిటిషు ప్రభుత్వం తిరస్కరించింది. 1857 మే నెల 10వ తేదీని సిపాయిల తిరుగుబాటు సమయంలో ఆమె తాంతియా తోపి సాయంతో తిరుగుబాటుకు ఉపక్రమించింది. అదే సంవత్సరం జూన్ నెల 5వ తేదీన ఝాన్సీ రాజ్యంలో తిరుగుబాటు లేవనెత్తింది. ఆమె గ్వాలియర్ మహారాజు నోడించి తన సైనికులతో ఆనందంగా షర్బత్ త్రాగుతూ యుండగా బ్రిటిషు సైన్యాలు ఆమెపై ఉరికి పడ్డాయి. రాణిగారి గుర్రం కాల్వ దాటడానికి తిరస్కరించింది. అప్పుడు బ్రిటీషుతూటా ఒకటి ఆమె ప్రక్కలో దూసుకుంది ఆ వెంటనే ఆమె తలపై బలమైన కత్తిపోటు తగిలింది. ఆమె స్వారీ చేస్తూనేయుంది. కాని చివరకు ఆమె గుర్రంపై నుంచి క్రిందిపడింది. తీవ్రంగా గాయపడి చనిపోయే పరిస్థితివచ్చింది. ఆ సమయంలో ఆమె గుడారంలో తన విలువైన నగలన్నింటిని తన సైనికులకు పంచిపెట్టవలసినదిగా కోరింది. ఆమె నమ్మినబంటు ఒకరు ఆమె శరీరాన్ని దగ్గరలోయున్న ఒకతోటలో కాష్టం ఏర్పరచి అంత్యక్రియలు చేసేరు. ఆమె మృతికి పరితపించనివారు లేరు. ఈమె ఎర్రజాకెట్టు, ఫ్యాంటు,

తలపాగా ధరించి తిరుగుబాటు నడిపించటంలో ఈమెను "ఇండియన్ జోన్ ఆఫ్ ఆర్క్"గా సర్ ఒ. టి. బర్నా వర్ణించేడు.

15 పై స్టాంపు రాణీఝాన్సీ గుర్రంపై స్వారీచేస్తూ సిపాయిల తిరుగుబాటుకు నాయకత్వం వహించిన దానిని గుర్తుచేస్తుంది.

90పై స్టాంపు 100 సంవత్సరాల క్రితం (1857) దేశభక్తి జ్వాలలతో ఒక చిన్న మొక్కను నాటి పెంచడాన్ని తెలియచేస్తుంది.

## 10. హెన్రీ డ్యూనాంట్

## (Henry Deuant)

28-10-1957 + Henry Deuant + XIXth. International Red cross conference + 15np.

హెన్రీ డ్యూనాన్ట్ స్విస్ దేశీయుడు. మానవుల్ని బాధల్నించి రక్షించాలన్న ఆలోచన అతనికి కలిగింది. 1859లో ఇటలీలోని 'సోల్ఫెర్నియో'యుద్ధంలో సుమారు నలభై వేల సైనికులురక్తంకారుతూ చావడానికి సిద్ధంగా యున్నవారి మూలుగులు, ఏడ్పులు చూడ్డంతో డ్యూనాన్ట్‌కి 'రెడ్‌క్రాస్' ఆలోచన తట్టింది. అతని కృషి ఫలితంగా అంతర్జాతీయ స్థాయిలో రోగులకు, గాయపడినవారికి సేవచేయుటకు 1863లో "రెడ్‌క్రాస్" సంస్థ సృష్టించబడింది. యుద్ధాలలో గాయపడినవారికి సేవచేయుటేగాక శాంతి సమయాల్లోకూడ జాడ్యాల నివారణ, ఆరోగ్యాభివృద్ధి, మానవబాధల విముక్తి మున్నగువానిని ఆదుకోవటానికి ఈ సంస్థ పూనుకుంది. "రెడ్‌క్రాస్" దినంగా హెన్రీ డ్యూనాన్ట్ జన్మదినమైన మే 8 ప్రతి సంవత్సరం పరిగణింపబడుతోంది. న్యూఢిల్లీలో 19వ అంతర్జాతీయ రెడ్‌క్రాస్ కాన్ఫరెన్సు జరిపించిన సందర్భంగా పైస్టాంపు విడుదల అయింది. స్టాంపులో హెన్రీడ్యూనాన్ట్ చిత్రం, కాన్ఫరెన్సు చిహ్నం వున్నాయి.

## 20. బాల్ దిన్

## (Children's Day)

14-11-1957 + Baldin. (chidren's Day) + 8np, 15np, 90np.

దేశానికి భావిపౌరులు చిన్నారులు. వారి ఆరోగ్యం, విద్య బాగుంటేనే మనదేశానికి బలం. నెహ్రూజీకి చిన్నారులంటే మహా ఇష్టం. కనుక ఆయన జన్మదినమైన 14 నవంబరున ప్రతిసంవత్సరం 'బాలల దినం'గా పరిగణించాలని ప్రభుత్వం నిశ్చయించింది. ప్రథమ బాలలదిన సందర్భంగా పై మూడు స్టాంపులు విడుదల అయేయి.

8 న. పై. స్టాంపు అరటిపండు తింటున్న బాలుని, చిత్రం.

15 న. పై. స్టాంపు పలకపై వ్రాయుచున్న బాలిక చిత్రం.

90 న. పై. స్టాంపులో ఒక ఆటగుర్రం చిత్రం.

## 21. భారత ఉక్కుపరిశ్రమ

## (Indian Steel Industry)

1-3-1958 + Indian Steel Industry (1908-1958) స్వర్ణోత్సవం.

జెమ్షెడ్ జీ టాటాకి భారతదేశంలో ఉక్కు కర్మాగారాన్ని నెల కొల్పాలన్న సంకల్పం కలిగింది. అతని కుమారుడు సర్ దోరాబ్జీటాటా ప్రఖ్యాత అమెరికన్ జియోలజిస్టుల సహకారంతో బీహారు-ఒరిస్సా సరిహద్దులలో ముడిఇనుము లభించే గురుమహిషాని ప్రాంతంలోని సాక్షిగ్రామంలో 1907 సం॥లో ఇనుప కార్మాగారం నెలగొలపడానికి ఎంపిక చేసేడు. ఆ గ్రామమే జెమ్షెడ్ జీ జ్ఞాపకార్థంగా జెమ్షెడ్‌పూర్ నగరంగా రూపొందింది. పరిశ్రమ స్థాపనకు మూడు వారాల వ్యవధిలో బొంబాయి ప్రజలు 25 మిలియనుల రూపాయిల నిధులతో ముందుకువచ్చేరు. గ్వాలియూర్ మహారాజు ఆరుమిలియన్ల రూపాయిాలు పరిశ్రమ నడుపుటకు నిధిని సమకూర్చేడు. ఈ సాహసోపేతమైన కార్యం ఆనాడు భారతదేశ స్వాతంత్ర్య పోరాట ఉద్యమంలో ఒక

ముఖ్యమైన ఘట్టంగా చెప్పుకోవాలి. ఆనాటి నుండి భారతదేశానికి స్వంత పరిశ్రమలుండాలన్న ఆకాంక్ష ప్రజలలో కలిగింది. ఈ సంస్థ స్వర్ణోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. ఇందులో జెమ్షెడ్‌జీని, ఇనుప కర్మాగారాన్ని చూడవచ్చు. భారతదేశంలో పురపాలక సంస్థలేని నగరం. టాటా కంపెనీవారే స్థానిక పాలనను జరిపిస్తున్నారు.

## 22. ప్రథమ ప్రపంచ వ్యవసాయిక ప్రదర్శన

### (First World Agrl. Fair

30-12-1959×First world Agrl. Fair+15 np

ప్రథమ ప్రపంచ వ్యవసాయిక ప్రదర్శన న్యూఢిల్లీలో నిర్వహించబడిన సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 23. యునిసెఫ్

### UNICEF

11-12-1960+UNICEF-1960+15 np.

"యూనైటెడ్ నేషన్స్ ఇంటర్నేషనల్ చిల్డ్రన్స్ ఫండ్" సంస్థ 1946 లో స్థాపించబడింది. దీనికి ప్రభుత్వాలు, ప్రజలు కూడ నిధుల నిస్తారు. భావి పౌరులైన బాలబాలికల ఆరోగ్యం, పుష్టికర ఆహారం, సంక్షేమ కార్యాలకు తోడ్పడటం దీని ముఖ్యాశయం తల్లిపిల్లల సంక్షేమంకూడ ఇది తలపెట్టింది. ఈ సంఘసేవ గుర్తింపుగా ప్రపంచంలో అన్ని దేశాలు ప్రతి సంవత్సరం డిశంబరు 11న UNICEF DAY ని జరిపిస్తాయి. 1960 లో ఈ తేదీ గుర్తింపుగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 24. ప్రథమ వాయు తపాల

### (First Aerial Post)

11-2-1961+First Aerial post 1911-1961+స్వర్ణోత్సవం.

భారతదేశంలో ప్రథమ వాయు తపాలా 1911 సంవత్సరం ఫిబ్రవరి 18 వ తేదీన అలహాబాదు నుంచి జమునా నది ఆవల వద్దున

యున్న నైనికి 6,500 లేఖల్ని, పోస్టుకార్డుల్ని నైనీ పోష్టాఫీసుకు తీసుకవెళ్ళబడ్డాయి, ఈ విమానాన్ని (ఫెంచి వైమానికుడు హెన్రీ పిక్వెట్ యు. పి. లోని అలహాబాదులో నిర్వహించిన పారిశ్రామిక మరియు వ్యవసాయిక ఎగ్జిబిషన్ గ్రౌండు నుంచి తీసుక వెళ్ళేడు. ఈ సంఘటన చరిత్రాత్మకమైనది. దీని జ్ఞాపకార్థం అలా తీసుకెళ్ళ బడిన కవర్లపైగల స్టాంపుల్ని స్పెషల్ పోస్టుమార్కుతో కాన్సిల్ చేసేరు. ఈ ప్రథమ వాయు తపాలా స్వర్ణోత్సవ సందర్భంగా మూడు స్టాంపులు 11 ఫిబ్రవరి 1961 న విడుదల అయేయి.

5. np. స్టాంపు 1911 లో ఏరోప్లేనులో తీసుకెళ్ళిన తపాలాలపై అతికించిన స్టాంపుల కాన్సిలేషన్ డిజైన్‌ను తెలియ చేస్తుంది.

15 np. స్టాంపు 1r. స్టాంపు. ఆనాడు ఉపయోగించిన హంబర్ సోమ్మర్ విమానం నేడు తపాలాలకుపయోగించే ఎయిర్ ఇండియా బోయింగ్ 707 ని ఈ స్టాంపులలోయున్నాయి.

## 25. ఆలిండియా రేడియో రజతోత్సవం-
## (All India Radio Silver Jubilee)

8-6-1961+All India Radio Silver Jubilee+15 np.

అఖిలభారత స్థాయిలో 'ఆల్ ఇండియా రేడియో' 8 జూన్ 1936 న ఏర్పడింది. ఇంతకు పూర్వం దానిని 'ఇండియన్ స్టేటు బ్రాడ్ కాస్టింగ్ సర్వీస్' అనేవారు. దీని రతతోత్సవం 8-6-1961న జరిగినప్పుడు ఈ స్టాంపు విడుదల అయింది.

## 26. ఆర్కిలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా-శతాబ్ది-
## (Archaeological Surveyof India)

14-12-1961 Archaeological Survey of India Centenary
15 np, 90 np.

రాజస్థాన్‌లోని కాళిబన్గన్ త్రవ్వకాలు 500 సంవత్సరాల క్రిందటి నాగరికతను తెలియచేస్తాయి. 1951 లో 'ఆర్కిలాజికల్

సర్వే ఆఫ్ ఇండియా'వారి త్రవ్వకాలలో కాలిబన్గన్ నాగరికత వెలువడింది. మహెంజదారొ, హరప్ప, కాలిబన్గన్—ఇవి 3 రాష్ట్రాల రాజధానులని భావించబడింది. గుజరాత్ సముద్రతీరాన్ని ఆనుకొనియున్న 'లోథల్' రేవు 500 సంవత్సరాల నాటిదని అంచనా. దానిద్వారా భారతదేశం విదేశ వ్యాపారాలు సాగించేది. హరప్పన్ లిపిగల సీళ్ళు కాలిబన్గన్లో కానవచ్చేయి. వాటిని వ్యాపారవస్తువుల ప్యాకెట్లపై సీలు లేక స్టాంపు వేయుటకు ఉపయోగించేవారు.

మహారాష్ట్రలోని ఔరంగాబాదు జిల్లాలోని 'పితల్ ఖోరా' గుహలలో బౌద్ధులు ఉపయోగించిన వస్తువులు కానవచ్చేయి. ఆ గుహలు క్రీ. పూ. 2వ శతాబ్దంనాటివి. వాటిని చక్కగా సున్నితంగా అలంకరించేరు. "చైత్య" (చావడి) ఏడు స్టేజిలు కలిగి క్రింది అడుగుమట్టం రెండు గుండ్రని పల్లాలు (బహుశ: అవి ప్రతిబింబాల కొరకు అయియుండవచ్చు) యున్నాయి—పై స్టేజిపై రెండు యక్షుల చిత్రాలు, రెక్కని గుర్రం చెక్కబడ్డాయి. 15 పైసల స్టాంపు ఈ గుహలలోని యక్షరి చూపిస్తుంది. క్రీ. పూ. రెండవ శతాబ్దంనాటి బ్రహ్మి లిపిలో అతని కుడిచేతిపై 'కన్దదాసేన హిమకరేన కత' అంటె 'కన్హదాస' అనే కంసాలి చేసినపని వ్రాయబడింది.

ఆర్కిలాజికల్ సర్వే వారి సెంటినరీ ఉత్సవ సందర్భం జ్ఞాపకార్థం ఈ రెండు స్టాంపుల్ని 14-12-1961 న ప్రభుత్వం విడుదల చేసింది.

## 27. మదన్మోహన్ మాలవ్యా
## (Madan Mohan Malaviya)

25-12-1962+Madan Mohan Malavya+15np

పండిట్ మదన్మోహన్ మాలవియా 100 వ జన్మదినోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. మాలవ్యా దేశభక్తుడు, విద్యావేత్త. బెనారస్ హిందూ యూనివర్సిటీ స్థాపకుడు.

## 28. గౌహతి రిఫైనరీ

**(Gauhati Refinery)**

1-4-1962+Ganhati Refinery+15 np.

భారతదేశంలో మొదటిసారిగా పబ్లిక్ సెక్టారులో నిర్మింపబడిన ఆయిల్ రిఫైనరీ కథ చిత్రంగా యుంటుంది. 1828 లో అస్సాంలో ఆర్మీ ఆఫీసరొకడు బొగ్గుకోసం అన్వేషించబోగా ఆయిల్ తటస్థించింది. కాని ఆ విషయం పైకిరాలేదు. కొన్ని సంవత్సరాల తరువాత లంబరు మోస్తున్న ఏనుగు ఒకటి తిరిగి ఇంటికిరాగానే దాని కాళ్ళకి చమురు అంటియుండడం చూడటం జరిగింది. దానిని గమనించిన అతడు దాని జాడని మెల్లగా తెలుసుకున్నాడు. దాని ఫలితంగా 1867 లో మొదటి ఆయిల్ నుయ్యి త్రవ్వబడింది. 1889 లో డిగ్బాయ్ వద్ద పెద్ద స్థాయిలో మొదటి ఆయిలు మిల్లు నిర్మించడం జరిగింది. 1962 జూలైలో అస్సాంలోని గౌహతికి దగ్గర్లో 'నునావతి' వద్ద ఆయిల్ రిఫైనరి నిర్మించబడింది. ఈ సందర్భంగా పై స్టాంపు విడుదల అయింది.

## 29. పంచాయతిరాజ్

**(Panchayati Raj)**

26-1-1962 + Panchayati Raj + 15 np.

స్థానిక ప్రజాప్రభుత్వాలు భారతదేశానికి కొత్తవికావు. పల్లెల్లో 2000 సంవత్సరాల క్రితం గ్రామ పంచాయతీ లుండేవి. ప్రభుత్వ న్యాయస్థానాలకు పని తగ్గించే నిమిత్తం వీటిని ఏర్పరచటం జరిగింది. పంచాయతీలలో సమస్యలు పరిష్కారం కానివి చక్రవర్తిగారి కోర్టుకి వెళ్ళేవి. 'పంచ' అనగా ఐదు. ఐదుగురు పెద్దలతో కూడినదే 'పంచాయతీ'. అందులో అన్ని వర్గాలవారికి స్థానం యుండేది. పంచాయతీలు స్థానిక సమస్యలను తీర్చుటేగాక, గ్రామాభివృద్ధి పథకాలు కూడ చేపట్టేవి. 'జిల్లా పరిషత్'లు జిల్లా స్థాయిలోను, 'పంచాయతీ

సమితులు' బ్లాక్ లేక సమితి స్థాయిలోను, 'గ్రామపంచాయతీలు' గ్రామస్థాయిలోను దేశంలో ఎన్నికైన సభ్యులతో స్థానిక స్వపరిపాలనకు సహాయ పడుతున్నాయి. స్టాంపు పంచాయతీ పరిపాలనా సూత్రాలని తెలియ చేస్తోంది. ఒక మర్రి చెట్టుక్రింద పంచాయతి సభని తెలియచేస్తుంది. ఆ చెట్టు పల్లె జీవితానికి ప్రతీక. ఆ చెట్టు కొమ్మలపై నేటి పార్లమెంటు భవనం జాతీయ పతాకంతోను భారత దేశ పటంతోను యుంది. అక్టోబరు 1952లో 'కమ్యూనిటీ డెవలప్‌మెంటు' ప్రోగ్రాం ప్రారంభించబడింది. అది 'పంచాయతీరాజ్'లో ఒక భాగమే. అక్టోబరు 2వ తేదీ 1959 సంవత్సరంలో రాజస్థాన్ ఈ పరిపాలనా విధానాన్ని ప్రవేశపెట్టడంలో ప్రథమస్థానం అలంకరించింది. పంచాయతీరాజ్ ప్రారంభోత్సవ జ్ఞాపకార్థం ఈ స్టాంపు విడుదల అయింది.

## 30. దయానంద సరస్వతి
## (Dayananda Saraswati)

4-3-1962 + Dayananda Saraswathi + 15 np.

ప్రఖ్యాత మత బోధకుడు. రాజస్థాన్‌లో అజ్మీర్‌వద్ద 'దయానంద ఆశ్రమం' స్థాపకుడు. జననం: 1827. మరణం: 30–10–1883. ఆయనకు నివాళులర్పించుటకు పైస్టాంపు విడుదల అయింది.

## 31. డాక్టర్ రాజేంద్రప్రసాద్
## (Dr. Rajendra Prasad)

13-5-1962 + Dr. Rajendra Prasad + 15 np.

డాక్టర్ రాజేంద్రప్రసాద్ ప్రథమ అధ్యక్షుడు. (1950-1962). గొప్ప దేశభక్తుడు, సంఘసేవా తత్పరుడు. ఆయన పదవీ విరమణ సందర్భాన్ని గుర్తుచేయటానికి పైస్టాంపు విడుదల అయింది. జననం : 3-12-1884. మరణం 1963.

## 32. కలకత్తా హైకోర్టు శతాబ్ది
**(Caclutta High Court Centenary)**

1-7-1962+Culcutta High Court Centenary+15 np.

**1-7-1862లో** కలకత్తా హైకోర్టు స్థాపించబడింది. మే **1872లో** హైకోర్టు బిల్డింగు పూర్తి అయింది. ప్రస్తుతం యున్న హైకోర్టు **14** మే **1862లో** విడుదల అయిన 'Letters Patent' వలన నిర్మాణం జరిగింది. ఇది భారతదేశ హైకోర్టులలోకెల్లా పురాతన మైనది. ఈ హైకోర్టు సెంటినరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 33. మద్రాసు హైకోర్టు శతాబ్ది
**(Madras High Court Centenary)**

6-8-1962+Madras High Court Centenary+5 np.

**6-8-1862లో** మద్రాసు హైకోర్టు స్థాపిత మయింది. శత వార్షికోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 34. బొంబాయి హైకోర్టు శతాబ్ది
**(Bombay High Court Centenary)**

14-8-1962+Bombay High Court Centenary+15 np.

బొంబాయి హైకోర్టు **14-8-1862న** స్థాపించబడింది. దీని శత వార్షికోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 35. స్వామి వివేకానంద
**(Swami Vivekananda)**

17-1-1963+Swami Vivekananda+15 np.

స్వామి వివేకానంద గొప్ప తత్త్వవేత్త, మత ప్రచారకుడు. చికాగోలో పార్లమెంటు ఆఫ్ రెలిజియన్స్‌లో పాల్గొని హిందూ మత

విశిష్ఠతను విదేశీయులకు తెలియచేసిన మహావక్త. సంఘ సేవా తత్పరుడు. "రామకృష్ణ మిషన్" స్థాపకుడు. జననం: 12-1-1863, మరణం 4-7-1902. వివేకానందుని 100వ జన్మ దినోత్సవం సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 36. రెడ్ క్రాస్ శతాబ్ది

## (Red Cross Centenary)

8-5-1963+Red Cross Centenary+15 np.

యుద్ధాలలో గాయపడిన వారికి, అస్వస్థులకు సేవ చేయుటకు హెన్రీడ్యూనాట్ అను స్విస్ దేశీయుడు "రెడ్‌క్రాస్" సంస్థను 1863లో స్థాపించిన దానిని గుర్తు చేస్తూ శత సంవత్సర ఉత్సవం సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. నేడు ఈ సంస్థ మానవ సేవకు అంకితమయింది. ఈ స్టాంపు విడుదల హెన్రీడ్యూనాట్ జన్మ దినాన విడుదల అయింది. జననం: 8 మే 1828, మరణం: 1963

## 37. చైనా దురాక్రమణ

## (Chinese Aggression)

15-8-1963+"The Defend"+15 np, 1 Rs.

1962 సంవత్సరంలో చైనీయుల దురాక్రమణను ఎదుర్కొన్న టంలో భారతదేశ సైనికుల ధైర్య సాహసాలు గణనీయమైనవి. వారి త్యాగానికి గుర్తుగా పై రెండు స్టాంపులు విడుదల అయేయి. 15 పై. స్టాంపులో మర ఫిరంగులు, హెలికాప్టర్ని, రు. 1 స్టాంపులో కాపలా వానిని, పెరాచ్యూటులను ముద్రించేరు.

## 38. అనీ బీసెంటు

## (Annie Besant)

1-10-1963+Annie Besant+15 np.

అనీబీసెంటు బ్రిటీషు స్త్రీ అయినా ఆమెకు భారతదేశంపై అపార ప్రేమ. అందుకే ఆమె భారతదేశంలో 1893న కాలిడినది మొదలు ఆమె 1933లో మరణానంతరం భారతదేశ దాస్య విముక్తికి, విద్య, సాంఘిక, మత, రాజకీయ విషయాల్లో చేసిన కృషి అపూర్వమైనది. ఈమె మద్రాసులో 'థియొసాఫికల్ సొసైటీ'ని స్థాపించింది. ఆమె 30వ వర్థంతి సందర్భంగా పై స్టాంపు విడుదల చేసి భారత ప్రభుత్వం ఆమె కృషికి నివాళు లర్పించింది.

## 39. ఓరియంటలిస్టుల సమావేశం

## (Congress of Orientalists)

4-1-1964+Congress of Orientalists+15 np.

ఈ స్టాంపులోని చిత్రం మథుర దేవాలయంలోని ఒక కంచు విగ్రహం. క్రీ.శ. 17వ శతాబ్దం నాటిది. దేవాలయాల్లోను, సాధారణ గృహాల్లోను కుందిలో నూనె పోసి ప్రత్తి వత్తితో దీపం వెలిగించటం ఆచారం. 'దీప' అనగా దీపం. కాంతినిచ్చేది, చీకటిని (అజ్ఞానాన్ని) పోగొట్టేదిన్నీ. 'లక్ష్మి' సంపదలకి, ధర్మానికి, జ్ఞానానికి చిహ్నం. కాంతి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సూచిస్తుంది. దేవాలయాల్లో దేవునికి, ఇళ్ళవద్ద గొప్పవారు వచ్చినప్పుడు ఆహ్వానించటానికి హారతి నిస్తారు. 'ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ ఓరియంటలిస్టు'ల ప్రథమ సమావేశం పారిస్‌లో 1873లో జరిగింది. 26వ కాంగ్రెస్ ఢిల్లీలో 4 జనవరి 1964న జరిగిన సందర్భ జ్ఞాపకార్థం ఈ స్టాంపు విడుదల అయింది.

## 40. పురందర దాసు

**(Purandara Das)**

14-1-1964+Purandara Das+15 np.

పురందర దాసు కన్నడ కవి, గాయకుడు, కర్నాటక సంగీత స్థాపకులలో ఒకడు. అతను చనిపోయిన 400వ ఆనివర్సరీ సందర్భముగా ఈ స్టాంపు విడుదల అయింది. జననం: 1484. మరణం: 1564.

## 41. నేతాజీ సుభాస్ చంద్రబోస్

**(Netaji Subhas Chandra Bose)**

23-1-1964+Netaji Subhas Chandra Bose+15 np, 55 np.

నేతాజీ సుభాస్ చంద్రబోస్ 67వ జన్మదినోత్సవ సందర్భంగా ఈ రెండు స్టాంపులు విడుదల అయేయి. సుభాస్ భారతదేశ స్వాతంత్ర్య పోరాట యోధులలో ముఖ్యపాత్ర వహించేడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో భారతదేశం నుంచి మారు వేషంలో జపాన్ దేశం చేరి, అచట రాస్ బిహారిబోస్ స్థాపించిన 'ఇండియన్ నేషనల్ ఆర్మీ' (INA)ని పునర్నిర్మాణం గావించి, తరువాత సింగపూర్ చేరి, 21-10-1943న 'అజాద్ హింద్ గవర్నమెంటు' (Free India Govt.) స్థాపించి, ఆంగ్లో-అమెరికన్ సైన్యాల్కి 1944-45లో తూర్పు సరిహద్దులో పని కల్పించేడు. నేతాజీ 23 జనవరి 1897న జన్మించేడు.

15 పైసల స్టాంపులో నేతాజీని, INA insigniaని, 55 పైసల స్టాంపులో నేతాజీ INAకి నాయకత్వం వహించి సైన్యాన్ని నడిపిస్తున్నది చూడవచ్చును.

## 40. పురందర దాసు

**(Purandara Das)**

14-1-1964+Purandara Das+15 np.

పురందర దాసు కన్నడ కవి, గాయకుడు, కర్నాటక సంగీత స్థాపకులలో ఒకడు. అతను చనిపోయిన **400**వ ఆనివర్సరీ సందర్భముగా ఈ స్టాంపు విడుదల అయింది. జననం: **1484**. మరణం: **1564**.

## 41. నేతాజీ సుభాస్ చంద్రబోస్

**(Netaji Subhas Chandra Bose)**

23-1-1964+Netaji Subhas Chandra Bose+15 np, 55 np.

నేతాజీ సుభాస్ చంద్రబోస్ **67**వ జన్మదినోత్సవ సందర్భంగా ఈ రెండు స్టాంపులు విడుదల అయేయి. సుభాస్ భారతదేశ స్వాతంత్ర్య పోరాట యోధులలో ముఖ్యపాత్ర వహించేడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో భారతదేశం నుంచి మారు వేషంలో జపాన్ దేశం చేరి, అచట రాస్ బిహారిబోస్ స్థాపించిన 'ఇండియన్ నేషనల్ ఆర్మీ' (INA)ని పునర్నిర్మాణం గావించి, తరువాత సింగపూర్ చేరి, **21-10-1943**న 'అజాద్ హింద్ గవర్నమెంటు' (Free India Govt.) స్థాపించి, ఆంగ్లో-అమెరికన్ సైన్యాల్ని **1944-45**లో తూర్పు సరిహద్దులో పని కల్పించేడు. నేతాజీ **23** జనవరి **1897**న జన్మించేడు.

**15** పైసల స్టాంపులో నేతాజీని, INA insigniaని, **55** పైసల స్టాంపులో నేతాజీ INAకి నాయకత్వం వహించి సైన్యాన్ని నడిపిస్తున్నది చూడవచ్చును.

మద్రాసు దగ్గరలోయున్నాయి. ఇటలీలో ఆర్టోనా కేథెడ్రాల్‌లో భద్రపరచిన అతని 'సిల్వరుబస్టు'ని స్టాంపులో చూడవచ్చు.

## 45. జెంసెట్జీ తాతా
## (Jamsetji Tata)

7-1-1965 + Jamsetji Tata + 15 p.

జేమ్సెట్జీ నుస్సెర్వాన్జీ టాటా జెమ్షెడ్‌పూర్‌లో "టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీని" బెంగుళూరులో "ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్" స్థాపించటమేగాక, ప్రథమంగా హైడ్రో ఎలెక్ట్రిక్ పవరుతో బొంబాయికి, దాని పరిసర ప్రాంతాలకి విద్యుత్ సప్లై చేయటానికి పథకం తయారుచేసి కృత కృత్యుడయ్యేడు. ఈ విధంగా భారతదేశ పారిశ్రామికాభివృద్ధికి మహత్కృషి చేసేడు. ఇతని కృషికి నివాళులర్పిస్తూ ఈ స్టాంపు విడుదల అయింది. ఇందులో అతని చిత్రానికి ఎడమవైపు కరగించిన స్టీలుపోయుటను, కుడివైపు ఎలక్ట్రికల్ ట్రాన్సుమిషన్ లైనులుగల స్థంభాల్ని చూడవచ్చు.

## 46. అబ్రహాం లింకన్
## (Abraham Lincoln)

15–4–1965 + Abraham Lincoln + 15 p.

అబ్రహాంలింకన్ 1809 సంవత్సరం ఫిబ్రవరి 12వ తేదీన అమెరికాలోని "కెంటకీ" రాష్ట్రంలో ఒక సామాన్య కుటుంబంలో జన్మించేడు. అమెరికాలో బానిసత్వ నిర్మూలనకు యుద్ధం నడిపించి విజయం సాధించేడు. 15-4-1865న సినిమా చూస్తూ యుండగా హత్య గావించబడ్డాడు. అతని జీవితమే అమెరికా చరిత్ర. తన జీవితం కన్నా తాను చేపట్టిన కార్యమే (Cause) ముఖ్యమని రుజువుచేసి ఒక దేశ భవిష్యత్తుని సరిదిద్దిన మహావ్యక్తి. ప్రజారాజ్య విషయంలో లింకన్ తాను బానిసను కానను, అలా అని తాను యజమానునీ కాదని ఉద్ఘా

టించేరు. ఈ సూత్రంలో తేడావస్తే అది ప్రజారాజ్యం కానేరదని వక్కాణించేరు.

## 47. అంతర్జాతీయ టెలికమ్యూనికేషన్ల యూనియన్

**(International Tele-Communications Union I.T.U.)**

17-5-1965 + International Tele-Communications Union(I.T.U.) + 15np.

ఐ. టి. యు. హెడ్‌క్వార్టర్సు జెనీవా. **17** మే **1865**న స్థాపించబడింది. ఇది అంతర్జాతీయ సంస్థలలోకెల్ల ప్రాచీనమైనది. ఇది యునైటెడ్ నేషన్ ఏజన్సీగా అన్నిదేశాలలో టెలికమ్యూనికేషన్ల స్థాపనకు కృషి చేస్తోంది. రేడియో స్టేషన్లకు అంతరాయం కలుగకుండాయుండే 'రేడియో ఫ్రీక్వెన్సీ స్పెక్ట్రమ్'ను సరఫరా చేస్తుంది. దీని శతాబ్ది సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 48. జవహర్ జ్యోతి

**[Jawahar Jyoti]**

27-5-1965 + Jawahar Jyoti + 15 np.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ **27-5-1964**న మరణించేక మొదటి ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. జవహర్కి ప్రియమైన గులాబిపుష్పం, ప్రతి భారతీయుని లోపలవెలిగే 'జ్యోతి' (జవహర్‌జ్యోతి) ఈ స్టాంపులో ముద్రించడం అయింది. 'జ్యోతి' ఆ మహాశయుని మహోన్నత ఆశయానికి ప్రతీక.

జననం : **14-11-1889**. మరణం : **27-5-1964**.

## 49. అంతర్జాతీయ సహకార సంవత్సరం

**[International Cooperation Year]**

26-6-1965 + International Cooperation Year + 15p.

యునైటెడ్ నేషన్స్ చార్టరుపై సంతకాలు జరిపిన **20**వ సంవత్సరాన్ని 'అంతర్జాతీయ సహకార సంవత్సరం'గా **1965**వ

సంవత్సరాన్ని ఎంపిక చేయడం జరిగింది. ఈ స్టాంపులో ఆలివ్ పండలు, రెండు చేతుల కలియిక యున్నాయి.

## 50. వల్లభాయ్ పటేల్
**[Vallabhai Patel]**

31–10-1965 + Vallabhai Patel + 15p.

వల్లభాయ్‌పటేల్ గుజరాత్‌లో 'నాదియడ్' గ్రామంలో **1875** అక్టోబరు **31**న జన్మించేడు. **1910**లో ఇంగ్లాండువెళ్ళి 'లా' చదివి భారతదేశానికి తిరిగి వచ్చి ప్రసిద్ధ క్రిమినల్ లాయరుగా పేర్గాంచేడు. **1924** నుంచి భారతదేశ స్వాతంత్ర్య సమరంలో ప్రముఖ పాత్ర వహించేడు. అనేక పర్యాయాలు జైలుశిక్ష ననుభవించేడు. స్వాతంత్ర్యం వచ్చేక భారత విభానానికి పాటుపడి అనేక స్వదేశ సంస్థానాలని తన చాకచక్యంతో భారత యూనియన్‌లో ఐక్యంచేసి 'బిస్మార్క్ ఆఫ్ ఇండియా' అని ప్రఖ్యాత రాజకీయ వేత్తగా చరిత్ర కెక్కేడు. ఇతడు నెహ్రూ మంత్రివర్గంలో "ఉపప్రధాని". ఇతని సేవకు భారత ప్రజలు ఎంతైనా ఋణపడి యున్నారనటంలో సందేహంలేదు. ఇతని **90**వ జన్మదినోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

జననం : **31-10-1875**. మరణం : **15-12-1950.**

## 51. చిత్తరంజన్‌దాస్
**(Chittaranjan Das)**

5-11-1965+Chittaranjan Das+15 p.

చిత్తరంజన్‌దాస్ **5-11-1870** లో జన్మించేడు. కలకత్తాలో "భావానీపూర్ లండన్ మిషనరీ సొసైటి ఇనిస్టిట్యూట్"లో విద్యాభ్యాసం అయింది. కలకత్తా "ప్రెసిడెన్సీ కాలేజి" లో పట్టభద్రుడయేడు. **1892** లో ఇంగ్లాండు వెళ్ళి లండన్‌లోని 'మిడిల్ టెంపుల్' లో 'బారిస్టర్' అయేడు. **1893** లో కలకత్తా హైకోర్టులో

ప్రాక్టీసు ప్రారంభించేడు. 'ఆలిపూర్ బాంబు' కేసులో నిందితుడైన అరవిందఘోష్ తరఫున వాదించి ప్రఖ్యాతి గడించేడు. "మహుకన్" దత్తత కేసులో సివిల్ లాయరుగా ఖ్యాతి నొందేడు. ఆ రోజులలో లక్షలు గడించేటి ఉచ్ఛస్థితిలో యుండి కూడ ధనాపేక్షను స్వస్తి చెప్పి భారతదేశ స్వతంత్ర పోరాటంలోకి దిగేడు. అతని అంచపల దేశ భక్తి అనంతం. తాను "బ్రతుకితే స్వరాజ్యం కొరకేనని, చస్తే స్వరాజ్యం కొరకే"నని ఉద్యమాన్ని నడిపించేడు. 16-6-1925లో ఈ మహానీయుడు పరమపదించేడు. ఇతని జ్ఞాపకార్థం కలకత్తా సమీపంలో రైలు ఇంజన్ కర్మాగారానికి ఇతని పేరు పెట్టేరు. ఇతనిని "దీనబంధు చిత్తరంజన్‌దాస్" అని పిలుస్తారు. ఇతని 95 వ జన్మ దినోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 52. ఆటోమిక్ రియాక్టర్-ట్రాంబే
## (Atomic Reactor-Trombay)

14-11-1965+Atomic Reactor-Trombay+10 r.

ఆటోమిక్ ఎనర్జీ అభివృద్ధికి, రీసెర్చికి ట్రాంబేవద్ద ప్రధాన కేంద్రం నిర్మించబడింది. ఇక్కడ మూడు రకాలైన రీసెర్చి రియాక్టర్లున్నాయి. అవి 'అప్సర', 'సిరస్', 'జర్లిన', థోరియంప్లాన్టు, యురేనియం మెటల్ ప్లాన్టు, ప్లుటోనియం ప్లాన్టు. ఇంకా ఇతర ప్లాన్టులు ఇప్పుడు పని చేస్తున్నాయి. 350 రకాల 'రేడియో ఏక్టివ్' సరకులను ఫ్రాన్సు, స్వీడన్, హంగేరి, డెన్మార్కు, ఆస్ట్రేలియాలకు సరఫరా చేస్తోంది. 'ఐసోటోప్' లు ఇతర పరికరాలు కూడ ఎగుమతి చేస్తుంది.

## 53. పాకిస్థాన్ దురాక్రమణ
## (Pakistan Aggression)

26-1-1966+Jai Jawan+15 p.

1965 సెప్టెంబరులో భారత జవానులు పాకిస్థాన్ దురాక్రమణను ఎదుర్కొనుటలో ప్రదర్శించిన ధైర్య సాహసాలకు, త్యాగానికి

అప్పటి ప్రధానమంత్రి లాల్‌బహదూర్ శాస్త్రి అభినందిస్తూ వారికి నివాళులర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది. స్టాంపులో జవానుని, ఫైటరు విమానాల్ని, యుద్ధనౌకల్ని చూడవచ్చును.

## 54. లాల్‌బహదూర్ శాస్త్రి
## (Lal Bahadur Sastry)

26-1-1966+Lal Bahadur Sastry+15 p.

భారతదేశ ద్వితీయ ప్రధానమంత్రి (జూన్ 1964-జనవరి 1966) కి నివాళులర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

జననం : 1904; మరణం : 11-1-1966.

## 55. కున్వర్‌సింగ్
## (Kunwar Singh)

23-4-1966+Kunwar Singh+15 p.

బీహారులోని షాహాబాద్ జిల్లా జగదిష్‌పూరులో 1777 లో రాజపుత్ర కుటుంబంలో కున్వర్‌సింగ్ జన్మించేడు. 1857 లో బ్రిటిషు సామ్రాజ్యాన్ని గడగడ లాడించిన తిరుగుబాటు సమయంలో అతని వయస్సు 80 సంవత్సరాలు. వయసుకు తోడు అనారోగ్యంతో బాధకు గురి అయినా బ్రిటీషు వారితో ఒక సంవత్సరం పాటు యుద్ధం చేసి చివరకు 23-4-1858 లో వీరమరణం పొందేడు. ఆ వీరుని 108 వ మరణ ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 56. కోనార్క్ ఏనుగు
## (Konark Elephant)

1-7-1966+Konark Elephant+ 6P

13 వ శతాబ్దపు కోనార్క్ సూర్య దేవాలయంలోని ఏనుగు శిల్పం. ఇది 1965-1968 ఐదవ డిఫినిటివ్ సీరీస్ విడుదల.

## 57. మధ్యయుగ శిల్పకళ
## (Mediaeval Sculpture)

1-7-1966+Mediaeval Sculpture+1 r.

స్టాంపులోని చిత్రం 11 వ శతాబ్దం నాటి ఖజూరహో దేవాలయంలోని శిల్పం. దీనిని రాజపుత్ర వంశీయులైన "చందేల్ల" రాజులు కట్టించేరు. చిత్రంలోని దళసరి పలకను బట్టి ఒక ఖజూరహో యువతి ఒక చిత్రాన్ని వ్రాస్తోందని తెలుస్తోంది. ఆ పలకం దళసరిగా లేకపోతే ఆమె ఒక లేఖ వ్రాస్తోందనిపించవచ్చు. ఆ రోజుల్లో లేఖలు పొడవైన కాగితం చుట్టలపైనే వ్రాసేవారు కదా! ఇది కూడ 1965-68 ఐదవ డిఫినిటివ్ సీరీస్ విడుదల.

## 58. అలహాబాద్ హైకోర్టు శతాబ్ది
## (Allahabad High Court Centenary)

25-11-1966+Allahabad High Court+15 p.

అలహాబాదు హైకోర్టు భారతదేశంలో కెల్లా పెద్ద హైకోర్టు. కలకత్తా, బొంబాయి, మద్రాసు హైకోర్టుల తరువాత ఇది స్థాపించబడింది. దీని శతాబ్ది సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 59. ఐదవ ఆసియా క్రీడలు
## (Fifth Asian Games)

21-12-1966+5 th Asian Games+15 p.

డిసెంబరు 1966 లో భారతదేశ హాకీ జట్టు బాంకాక్‌లో 5 వ ఏసియన్ గేమ్స్‌లో పాకిస్తాన్ హాకీ జట్టుపై సాధించిన విజయ సూచకంగా ఈ స్టాంపు విడుదల జరిగింది.

## 60. జై కిసాన్
**[Jai Kisan]**

11-1-1967+Jai Kisan+15 p.

లాల్ బహదూర్ శాస్త్రి చనిపోయిన ప్రథమ అనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. 'జైజవాన్', 'జైకిసాన్' నినాదాలను లాల్ బహదూర్ దేశానికి ఇచ్చేడు. 'జై కిసాన్' స్టాంపులో ఆహార సమస్యను తీర్చటంలో కిసానుల పాత్రకు ప్రాముఖ్యం తెలియచేయడమయింది.

## 61. గురు గోవిందసింగ్
**[Guru Govinda Singh]**

17-1-1967 + Guru Govind Singh + 15 p.

తొమిదవ శిక్కు గురువగు తేజ్‌బహదూర్‌కు ఒకే ఒక కుమారుడు 'గోవిందసింగ్'. అతడు 1666లో పాట్నాలో జన్మించేడు. తేజ్ బహదూర్‌ను ఔరంగజేబు క్రూరత్వం నుండి కాపాడమని కొందరు బ్రాహ్మణులు ప్రార్థించేరు. అప్పటికి గోవింద్‌సింగ్ వయస్సు తొమ్మిది సంవత్సరాలు. తేజ్ బహదూర్ ఔరంజేబుతో పోరాడి చివరకు మొగలు సైనికుల చేజిక్కగా ఔరంగజేబు అతనిని అతి క్రూరంగా ఉరితీయించేడు. దానితో గోవింద్‌సింగ్ ఉద్రిక్తుడై, కత్తి పట్టి సైన్యాన్ని తయారుచేసి ఇస్లాం అక్రుత్యాన్ని కడతేర్చడానికి 1699లో ప్రతిజ్ఞచేసేడు. 'ఖల్సా'ను స్థాపించి అందులో జాతి వగైరా చాదస్తాలకు తావులేకుండ చేసేడు. మొగలు సైన్యాన్ని అనేక చోట్ల ఓడించేడు. ఔరంగజేబు ఆఖరికి గోవింద్‌సింగుని హతమార్చటానికి నిశ్చయించేడు. మొగలు సైన్యాలు ఆనందపూర్‌ను ముట్టడించేయి. గోవింద్ తల్లి షాక్‌వల్ల చనిపోయింది. అతని పెద్దకుమారులిద్దరు యుద్ధంలో వీరమరణ మొందేరు. చిన్నకుమారులిద్దరు సర్హింద్ నవాబు చేతిలో పట్టుబడ్డారు. వారిని నవాబు దారుణంగా చంపించేడు. ఇంత

ఘోర పరిస్థితుల్లో కూడ గోవిండ్‌సింగ్ తాను ఎంత మాత్రం ఔరంగ జేబుకి లొంగబోనని చక్రవర్తికి జాబు వ్రాసి పంపేడు. తన 42వ ఏట రాజపుత్రుల్ని, మహారాష్ట్రుల్ని కూడదీసి సైన్యాల్ని తయారుచేసి ఇంకా యుద్ధం సాగించాలనుకున్న సమయంలో సర్హింద్ నవాబు నౌకరొకడు గోవిండ్‌సింగ్‌ని దారుణంగా హత్య గావించేడు.

గోవిండ్‌సింగ్ జ్ఞాపకార్థం అతడు జన్మించిన గ్రామంలో కట్టించిన దేవాలయం పై స్టాంపులో ముద్రించబడింది.

## 62. భా క్రా డా మ్

### (Bhakra Dam)

15-3-1967 + Bhakra Dam + Rs 5.

భాక్రాడాం భారతదేశంలో మిక్కిలి పొడవైనది. హిమాచల్ ప్రదేశ్‌లో యుంది. ఇది బహుళార్థసాధక నదీ ప్రాజెక్టు. భాక్రా నంగాల్ ప్రాజెక్టు 1946లో ప్రారంభించబడింది. దీని నిర్మాణానికి రు. 1,751 మిలియన్లు ఖర్చు అయేయి. ఈ ప్రాజెక్టు సట్లెజ్ నదికి అడ్డుగా 226 మీటర్ల ఎత్తున భాక్రా వద్ద ఒక 'డామ్'యున్ను, 29 మీటర్ల ఎత్తున నంగాల్ వద్ద ఒక 'డామ్', 64కిలో మీటర్ల పొడవైన 'నంగాల్-హైడ్రో-ఎలెక్ట్రిక్ ఛానలు' కలిగియుంది. భాక్రా, గంగువాల్, కోట్లాలవద్ద పవరు హౌసులు మొత్తం 1,204 మెగావాట్ల విద్యుత్‌ను తయారుచేస్తాయి. ఇది పంజాబు, హర్యానా, రాజస్థాన్‌ల జాయింటు ప్రాజెక్టు.

ఈ స్టాంపు 1965-1968 ఐదవ డిఫినిటివ్ సిరీసులో విడుదల అయింది.

## 63. హం పి ర థం

### (Hampi Chariot)

15-3-1967 + Hampi Chariot + 70 p.

విజయనగర రాజుల రాజధాని హంపీ. విజయనగర శిల్ప సౌందర్యాన్ని చాటించే రాతిరథాన్ని ఈ స్టాంపులో చూడవచ్చు. ఇది

విజయ విఠల దేవాలయంలోని శిల్పం. ఆనాడు విజయనగరం శిరి, శిల్ప సంపదలకు ప్రసిద్ధికెక్కింది. ఈ స్టాంపు 1965-1968 ఐదవ డెఫినిటివ్ సిరీసులో విడుదల అయింది.

## 64. ఢాల్ సరస్సు
## (Dhal Lake)

15-3-1967 + Dhal Lake + Rs 2.

కాశ్మీరు రాజధాని శ్రీనగర్ సముద్ర మట్టానికి 1500 మీటర్ల ఎత్తున ఢాల్ సరస్సుపై యుంది. 75 మీటర్ల వెడల్పుతో అందాలు చిందుతూ జీలంనది శ్రీనగర్ పట్నం లోపల చుట్టుతూ యుంటె చూడ ముచ్చటగా యుంటుంది. అంతేగాక ఢాల్ సరస్సు ప్రకృతి అందానికి ఆటపట్టు. ఇది వేలాది టూరిస్టుల నాకర్షిస్తుంది. సరస్సులో లంగరువేసిన వందలాది 'నౌకాగృహాలు' టూరిస్టులను ఆకట్టు కుంటాయి. ఈ నావలు 30 నుంచి40 మీటర్ల పొడవున్ను, 7 నుంచి 10 మీటర్ల వెడల్పు గలిగి సిటిలో తేలియుండే గృహాలు. ఈ స్టాంపు 1965–1968 ఐదవ డెఫినిటివ్ సిరీస్‌లో విడుదల అయింది.

## 65. నందలాల్ బోస్
## (Nandalal Bose)

16-4-1967 + Nandalal Bose + 15p.

ఆచార్య నందలాల్ బోస్ ప్రఖ్యాత భారతీయ చిత్రకారుడు. ప్రాచీన సాంప్రదాయం, ఆధునిక సాంప్రదాయానికి అనుగుణ్యంగా చిత్రలేఖనకు దారి చూపించిన ప్రావీణ్యుడు. శాంతి నికేతన్ వద్ద 'కళాభవన్'కు ప్రిన్సిపాలుగా పనిచేసేడు. స్టాంపు నందలాల్ బోసుని, అతని ప్రఖ్యాత చిత్రం 'గరుడ'ని చూపిస్తుంది. అతని మరణా నంతరం ప్రథమ మరణ ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుద లయింది.

## 66. నరసింహ మెహత
### (Narasimha Mehta)

30-5-1967 + Narasimha Mehta + 15p.

నర్సింహమెహతా 17వ శతాబ్దపు మత ప్రవక్త, కవి. అతని పాటలలోని "జై, జై రఘుపతి రాఘవ రాజారాం ..." పాట గాంధీజీకి అత్యంత ప్రియమైనది. అతనికి నివాళు లర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

## 67. మహారాణ ప్రతాప్
### (Maharana Pratap)

11-6-1967 + Maharana Pratap + 15p.

మేర్వారు రాజగు ప్రతాప్‌సింగ్ తన రాజధాని మొగలుల వశమయేక 30000 సైనికుల్ని చేరదీసి పాతిక సంవత్సరాలపాటు మొగలులతో గొరిల్లా యుద్ధం సాగించేడు. కొండలలోను గుహలలోను భార్యా బిడ్డలతో బసచేసి, కందమూలాలు తింటూ, తన కుమారుడు అమర్‌సింగును రక్షించుకుంటూ వచ్చేడు. ఇతడు మహావీరుడు. ఇతనికి నివాళులర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

## 68. డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ
### (Dr. Sarvepalli Radhakrishna)

15-9-1967+Dr. Sarvepalli Radhakrishna+15 p.

డా॥ రాధాకృష్ణ ప్రఖ్యాత తత్త్వశాస్త్రవేత్త,మహాజ్ఞాని, అధ్యాపకుడు.ఆయన 79వ జన్మదినోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. రాధాకృష్ణ భారతదేశ ద్వితీయ అధ్యక్షుడు. (మే 1962- ఏప్రియల్ 1967). ఈయన జన్మదినాన్ని దేశమంతటా 'ఉపాధ్యాయ దినం' (Teachers Day) గా పరిగణించి గురుభక్తి ప్రకటించటం జరిగింది. ప్రతి సంవత్సరం అధ్యాపకులలో ఉన్నత సేవ చేసిన వారికి ఆనాడు సత్కరించడం ఆచారమయింది.

## 69. క్విట్ ఇండియా
## (Quit India)

1-10-1967+1942-Quit India+15 p.

ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటి (A. I. C. C.) బొంబా యిలో గాంధీ నాయకత్వాన 8 ఆగస్టు 1942 న సమావేశమై 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని ఆమోదించింది. దాని ఫలితంగా ప్రజల్లో స్వరాజ్య కాంక్ష తారాస్థాయి చేరటంతో ప్రజలలో సాహస త్యాగాలకు అంతులేదు. చివరకు ఈ ఉద్యమ ఫలితంగా భారత దేశానికి 1947 లో స్వరాజ్యం లభించింది. ఆ పిలుపు ననుసరించి పాట్నా సెక్రెటేరియట్ ఎదుట ఏడుగురు విద్యార్థులు జాతీయ పతా కాన్ని ఆవిష్కరిస్తూ బ్రిటీషు తూటాలకు ఆహుతి అయేరు. ఆ ఉదం తాన్ని గుర్తు చేస్తుంది ఈ స్టాంపు. ఈ చరిత్రాత్మక ఉద్యమ 25 వ ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 70. సోమనాథ దేవాలయం
## (Somanath Temple)

16-10-1967+Somanath Temple+60 p.

సోమనాథ దేవాలయ చరిత్ర కడు చిత్రమైనది. ఇది సౌరాష్ట్ర (గుజరాత్) లోని ప్రభాస్‌పట్నం లేదా దేవపట్నంలో యుంది. ఇది చాలా ప్రాచీనమైనది. వేదకాలం నాటినుంచి కూడ ఇది పవిత్ర స్థలంగా ప్రసిద్ధి కెక్కింది. సోమనాథ దేవాలయం క్రీస్తుశకం మొదట నుంచి కూడ యున్నట్లు తెలియవచ్చింది. వాకాటక రాజవంశీయులు శివభక్తులు. 649 A.D. లో సోమనాథ దేవాలయం పునరుద్ధరింప బడింది. కాని 725 A.D. లో సింధు గవర్నరగు జునయుద్ అరబ్ సైన్యాన్ని సౌరాష్ట్ర రాజధానియగు వల్లభిని, ప్రభాస్‌పట్నాన్ని ధ్వంసం చేయటానికి పంపించేడు. కనోజ్‌ని పాలిస్తున్న ప్రతిహార రాజవంశీయుడగు 2 వ నాగభట్టు 815 A.D. లో సోమనాథ దేవా

లయాన్ని మూడవసారి పునరుద్ధరించేడు. తిరిగి 1026 A.D. లో సోమనాథ దేవాలయాన్ని గజనీ మహమ్మద్ నాశనం చేసి ధనాన్ని, శిల్పసంపదని కొల్లగొట్టి గజనీకి తరలించేడు. అన్హిల్‌వాడ పతన్ చాళుక్యరాజులు ఈ దేవాలయాన్ని నాల్గోసారి, ఐదవసారి పునరుద్ధరించేరు. 1296 A.D. లో అల్లావుద్దీన్ ఖిల్జీ ప్రభాస్ పట్టణంపై దాడి జరిపి దేవాలయాన్ని, విగ్రహాన్ని నాశనం చేసేడు. 1325 A.D.-1351 A.D. సంవత్సరాల మధ్యకాలంలో జునాగడ్ రాజగు మహీపాలుడు ఈ దేవాలయాన్ని తిరిగి కట్టించేడు. అతని కుమారుడు ఖెంగరుడు 'లింగాన్ని' తిరిగి ప్రతిష్ఠించేడు. కాని 1469 A.D. లో గుజరాత్‌కు చెందిన మహమద్ బెగ్డా అందలి విగ్రహాన్ని తీసివేసి దానిని మసీదుగా మార్చేడు. తిరిగి పరమత సహనానికి ప్రతిబింబమైన అక్బర్ చక్రవర్తి కాలంలో ఆ దేవాలయం ప్రశాంతంగా యుండగా, పరమత ద్వేషి అయిన ఔరంగజేబు 1701 A.D. లో ఆ దేవాలయ నాశనానికి పూనుకున్నాడు. కాని 1723 లో ఇండోర్ రాణి అహల్యాబాయ్ తిరిగి దేవాలయాన్ని ఆ ప్రక్కనే కట్టించింది. 12 నవంబరు 1947 లో సర్దార్ వల్లభాయ్ పటేల్ ఈ దేవాలయ పునర్నిర్మాణం గావించి యాత్రికులకు అందచేసి ప్రజల మన్ననలనందుకున్నాడు. 1965-1968 ఐదవ డెఫినిటివ్ సిరీసుతో ఈ స్టాంపు విడుదల అయింది.

## 71. ఇండో-యురోపియన్ టెలిగ్రాఫ్ లైను

**[Indo-European Telegraph Line]**

9-11-1967+Indo-European Telegraph Line+15 p.

1867-69 సంవత్సరాలలో ఇండో-యూరోపియన్ టెలిగ్రాఫ్ లైను ప్రష్యా, రష్యా, పెర్షియాల ద్వారా 7000 మైళ్ళ పొడవున వేయబడింది. దీనివల్ల లండన్, కలకత్తాల మధ్య టెలిగ్రాఫ్

వార్తలు త్వరగా అందజేయుటకు వీలు కలిగింది. దీని శతాబ్ది జరి పించిన సమయంలో ఈ స్టాంపు విడుదల అయింది.

## 72. రాష్‌బిహారి బాసు

## [Rashbehari Basu]

26-12-1967+Rashbehari Basu+15 p.

రాష్‌బిహారి బాసు 1886 మే 25 న పశ్చిమబెంగాలులో హుగ్లీ జిల్లా 'పలారబిగాటి' గ్రామంలో జన్మించేడు. 15 సంవత్సరాల ప్రాయంలో చంద్రనాగోర్, కలకత్తాలలో విద్యాభ్యాస సమయంలో దేశ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడానికి నిశ్చయించుకున్నాడు. కొంతకాలం డెహరాడూన్‌లోని ఫారెస్టు రీసెర్చి ఇనిస్ట్యూట్‌లో ఉద్యోగం చేస్తూ, అక్కడ నుంచే మాతృదేశ దాస్యవిముక్తికై రివల్యూషనరీ పద్ధతుల ననుసరించేడు. ఇతడొక "మిలిటెన్టు సోషలిస్టు". 1912 డిసెంబరు 23 న అప్పటి వైస్రాయి లార్డు హార్డింజ్‌పై బాంబు విసిరేడు. 1915 తో మారువేషంలో జపాను చేరి ఎరెస్టు తప్పించుకున్నాడు. 1923 లో జపాను సిటిజన్ షిప్ సంపాదించుకున్నాడు. జపాన్ భాషలో 16 గ్రంథాలు వ్రాసేడు. 1924 లో 'పాన్ ఏషియన్ లీగ్' ను 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' ను స్థాపించి ఇండియా స్వాతంత్ర్య ఉద్యమానికి చేయూత నిచ్చేడు. సుభాస్ చంద్రబోస్ జూలై 1943 లో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్' కి 'ఇండియన్ నేషనల్ ఆర్మీ' కి అధ్యక్ష స్థానం అలంకరించే పర్యంతం ఇతడే వాటికి అధ్యక్షుడు. జపాన్‌లోనే 1945 జనవరి జనవరి 21 న ఈయన పరమపదించేడు. ఇతని జ్ఞాపకార్థం ఈ స్టాంపు విడుదల అయింది.

## 73. 100,000 వ పోస్టాఫీసు

**[100,000 th Post Office]**

1-7-1968+100,000 th Post Office+20 p.

బీహారులో బ్రాంపూర్-చౌరస్తా (Brahmpur-Chaurasta) వద్ద 100,000 వ పోస్టాఫీసు తెరచిన జ్ఞాపకార్థం ఈ స్టాంపు విడుదల అయింది. 1854 లో భారతదేశంలో ప్రథమ పోస్టేజి స్టాంపు విడుదల అయినప్పుడు పోస్టాఫీసుల సంఖ్య 701.

## 74. గగనేంద్రనాథ్ టాగోరు

**[Gaganendra Nath Tagore]**

17-9-1968+Gaganendra Nath Tagore+20 p.

గగనేంద్రనాథ్ టాగోరు రవీంద్రనాథ్ టాగోర్కి మేనల్లుడు. 18 సెప్టెంబరు 1867 లో జన్మించేడు. ప్రఖ్యాత చిత్రకారుడు, కార్టూనిస్టు. ఒక కార్టూనులో జలియన్‌వాలా బాగ్ మెసాకర్ని "Peace restored in the Punjab" ని చిత్రించేడు. స్టాంపులో అతను వ్రాసిన స్వచిత్రం ముద్రించడం జరిగింది. ఆయన 101 జన్మ దినోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 75. లక్ష్మినాథ్ బెజ్‌బారువ

**[Lakshminath Bezbaruah]**

5-10-1968+Lakshminath Bezbaruah+20 p.

1868 లో అస్సాంలో లక్ష్మినాథ్ బెజ్‌బారువ జన్మించేడు. చిన్నతనంలో ప్రాథమిక విద్య 'శిబ్‌సాగర్' లోను, తరువాత ఉన్నత విద్య కలకత్తాలోను అభ్యసించేడు. అతనికి టాగోరు మేనకోడలుతో వివాహం జరిగింది. ఆధునిక అస్సామీ వాఙ్మయ కవి, నాటక రచయిత. "బాహ్ని" అనే మాసపత్రిక స్థాపించి సంఘంలో అందర్ని ఆకర్షించేడు. అతని 100 వ జన్మదినోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. జననం: 1868, మరణం : 1938.

## 76. భగత్ సింగ్

**(Bhagat Singh)**

19-10-1968+Bhagat Singh+20 p.

భగత్‌సింగ్ సిక్కు కుటుంబంలో 1907 లో జన్మించేడు. తండ్రి దేశభక్తుడు. దేశసేవలో చాలా బాధలికి గురి అయేడు. భగత్ సింగ్‌కి హిందూ దేశ చరిత్ర ఉద్రేకం కలిగించింది. చిన్ననాట నుంచే దేశభక్తి అలవడింది. భారతదేశ దాస్య విముక్తికి పోరాడాలని సంకల్పించుకున్నాడు. 1928 లో "హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ" ని స్థాపించి, తిరుగుబాటే దేశ దాస్య విముక్తికి తగినదన్న నిశ్చయానికి వచ్చేడు. బ్రిటీషు కమిషన్లలో భారతీయులకు స్థానం యొసగక పోవటాన్ని భారత ప్రజలు నిరసించేరు. దానికి తోడు ప్రశాంతంగా నిరసన ఉద్యమం కొనసాగుతూ యుండగా పోలీసు లాటీలకు లాలా లజపతిరాయ్ 17-11-1928లో మరణించటం అగ్నికి ఆజ్యం పోసినట్లయింది. దేశం అంతా ఆవేశంతో అట్టుడికి పోయింది. ఆ దినాన్ని హిందూస్థాన్ రిపబ్లిక్ ఆర్మీ లజపతిరాయ్ మరణానికి ప్రతీకారం తీసుకుందికి ప్రమాణం చేసింది. భగత్‌సింగ్ తన అనుచరులతో 'శాండర్స్' అనే పోలీసు ఆఫీసరుపై 8-4-1929 న దాడి చేసేడు. తిరిగి 8 ఏప్రిల్ 1929 న భగత్‌సింగ్ తన మిత్రుడు దత్తాతో కలసి అసెంబ్లీ హాలులో బాంబులు విసిరి అరెస్టు అయేడు. క్షమాభిక్ష తిరస్కరించబడి 23 మార్చి 1931 న భగత్‌సింగ్ ఉరి తీయబడ్డాడు. ఈ స్టాంపు భగత్‌సింగ్‌కి నివాళులర్పించడానికి విడుదల అయింది.

## 77. అజాద్‌హింద్ ప్రభుత్వం

**(Azad Hind Govt)**

21-10-1968+Azad Hind Govt.+25 th Anniversary+20 P.

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో సుభాష్ చంద్రబోసును బ్రిటీషువారు గృహనిర్బంధం చేసేరు. కాని బోస్ మారువేషంలో

ఇండియా నుండి తప్పించుకుని విదేశాలు చేరుకున్నాడు. చివరకు సింగపూరు చేరి 21 అక్టోబరు 1943 న "అజాద్ హింద్ గవర్నమెంటు" ని ప్రకటించేడు. భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో ఇది చాలా ముఖ్యమైన ఘట్టం. 1944 లో బోస్ నాయకత్వంలో 'ఇండియన్ నేషనల్ ఆర్మీ' బ్రిటీషు, అమెరికన్ సైన్యాలతో గట్టి పోరాటం సల్పింది. కాని 1945 లో అది బ్రిటిషు వారికి లొంగి పోవలసి వచ్చింది. బందీలయిన సైనికులను భారతదేశానికి తరలించగా, వారినందరిని భారత ప్రజలు గొప్ప స్వాతంత్ర్యయోధులు గాను, దేశభక్తులు గాను అభినందించేరు. స్టాంపులో సుభాష్ చంద్ర బోసు సింగపూరులో స్వాతంత్ర్య ప్రకటనను చదువుటను సూచిస్తుంది. ఈ సంఘటన యొక్క 25 వ వార్షిక సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 78. సిస్టర్ నివేదిత
## (Sister Nivedita)

27-10-1968+Sister Nivedita+20 p.

మార్గరెట్ నోబెల్ ఐర్లండులో 28-10-1867 లో జన్మించింది. తన 28 వ ఏట వివేకానందుని లండన్‌లో కలసేక ఆమెలో గొప్ప మార్పు కలిగింది. 1898 లో భారతదేశానికి వచ్చి హిందూ సాంప్రదాయాల్ని పాటించి, ఒక బాలికల పాఠశాలను (Bagh Bazar School) కలకత్తాలో స్థాపించి, దేశానికి ఎనలేని సేవ చేసింది. వివేకానందుడు చనిపోయిన తరువాత ఆమె భారతదేశ నాయకులతో కలసి భారతదేశ దాస్య విముక్తికి పాటు పడింది. ఆమె జన్మ శతాబ్ది సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

ఆమె జననం : 28-10-1867, మరణం : అక్టోబరు 1911.

## 79. భారతదేశ ప్రథమ మేజరు యుద్ధనౌక
## (India's First Major Warship)

15-12-1968+I. N. S. Nilgiri+20 p.

భారతదేశ ప్రథమ మేజరు యుద్ధనౌక I.N:S. నీలగిరి. బొంబాయిలో 23 అక్టోబరు 1968 న ఈ నౌక ప్రారంభోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. "నేవీడే" కూడ ప్రతి సంవత్సరం 15 డిసెంబరున జరిపించటం గమనీయ విషయం.

## 80. కొచిన్ సినగోగ్
## (Cochin Synagogue)

15-12-1968+Cochin Synagogue+20 p.

భారతదేశం అన్ని వేళలా విదేశీయులకు స్వాగతం చెప్పి వారికి మన దేశంలో స్థానం యిచ్చింది. అందుచేత శరణార్థులు మన దేశానికి వచ్చి స్థిర నివాసాలు ఏర్పరచుకున్నారు. 72 A.D. లో జెరూసెలెం రెండవ గుడి రోమన్ చక్రవర్తి వెస్పాసియన్ కుమారుడు టిటస్‌చే నాశనం గావించబడింది. దానితో యూదులు (Jews) కొందరు శరణార్థులుగా నేటి కేరళ రాష్ట్రం చేరు కున్నారు. "1000 A.D. జ్యూఇష్ కాపర్ ప్లేట్" ఈ వలస వచ్చిన వారు ఒక పూర్తి గ్రామాన్ని దానంగా పొందినట్లు తెలియచేస్తోంది. "క్రాంగనోర్" లోని ఈ సెటిలుమెంటు ధన ధాన్యాలకి, సంపదలకి వన్నెకెక్కడంతో మహమ్మదీయులు, ఆ తరువాత 16 వ శతాబ్దంలో పోర్చుగీసువారు దానిని ధ్వంసం చేసేరు. కడకు కొచ్చిన్‌లో ఒక ఒక "జ్యూఇష్ టౌన్" నిర్మాణం జరిగింది. అందులో 1568 లో ఒక 'సినగోగ్' (యూదుల ప్రార్థనాలయం) నిర్మించడమయింది.

## 81. బన్కిన్ చంద్రఛటర్జీ
**(Bankin Chandra Chaterjee)**

1-1-1969+Bankin Chandra Chaterjee+20 p.

బన్కించంద్ర ఛటోపాధ్యాయ పశ్చిమ బెంగాలులోని 'కతల్పర' గ్రామంలో 26 జూన్ 1838 లో క్యులిన్ బ్రాహ్మణ కులంలో జన్మించేడు. డిప్యూటి కలెక్టరు ఉద్యోగం చేస్తూ సాహిత్య సేవకు పూనుకుని బెంగాలీ సాహిత్యానికి ఎంతో సేవ చేసేడు. అనేక నవలలు వ్రాసి ప్రజల నుత్తేజ పరచేడు. అతను రచించిన "వందేమాతరం" పాట భారత జాతి ఐక్యతకు దోహదం చేసింది. ఇతనికి నివాళు లర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

## 82. డాక్టర్ భగవాన్‌దాస్
**(Dr. Bhagavan Das)**

12-1-1969+Dr. Bhagavan Das+20 p.

డాక్టర్ భగవాన్‌దాస్ 1864 వ సంవత్సరం జనవరి 21వ తేదీన బెనారస్‌లో జన్మించేడు. సంస్కృత భాషలో పండితుడు. డాక్టర్ అనీబీసెంటు సహకారంతో "సెంట్రల్ హిందూ కాలేజి" ని సాపించేడు. కొంతకాలం అయేక అదే "బెనారస్ హిందూ యూనివర్సిటి" గా అభివృద్ధి నొందింది. భగవాన్‌దాస్ "కాశీ విద్యాపీఠ్" అనే జాతీయ విశ్వవిద్యాలయ స్థాపకులలో ఒకడు. జాతీయోద్యమ పోరాటంలో అనేక పర్యాయాలు జైలు కెళ్ళేడు. అతనికి భారత ప్రభుత్వం "భారతరత్న" బిరుదుని ప్రసాదించి గౌరవించింది. డాక్టర్ దాస్ 18 సెప్టెంబరు 1958 లో మరణించేడు.

## 83. డాక్టర్ మార్టిన్ లూథర్ కింగ్
## (Dr. Martin Luther King)

25-1-1969+Dr. Martin Luther King+20 p.

డాక్టర్ మార్టిన్ లూథర్‌కింగ్ బాప్టిస్టు మినిస్టర్ కుటుంబంలో 15-1-1929న జన్మించేడు. 1955 లో అలబామాలోని మాంట్ గోమరీ 'నీగ్రో బాప్టిస్టు చర్చి' కి పాస్టరుగా నియమితుడయేడు. U. S. A. లో 'సివిల్ రైట్స్' ఉద్యమానికి నేతృత్వం వహించేడు. జాత్యహంకారం, అన్యాయాల నిర్మూలనకు జీవితాంతం పోరాడేడు. 1955 లో ఒక నీగ్రో యువతి శ్వేత జాతీయునికి బస్సులో ఆమె కూర్చొనియున్న సీటు నివ్వడానికి తిరస్కరించటంతో సంచలనం చెలరేగింది. దానిలో మాంట్ గోమరీలో 'బస్ బాయ్‌కాట్' ఉద్యమాన్ని లూథర్‌కింగ్ నడిపించేడు. అనేక పర్యాయాలు జైలుశిక్షల ననుభవించేడు. కాని ఫెడరల్ కోర్టు 'బస్సులలో జాతి వివక్షత' రాజ్యాంగ విరుద్ధమని తీర్పునిచ్చింది. అంతేగాక 250.000 శ్వేత జాతీయులు నీగ్రోలతో 'ప్రొటెస్టు మార్చి' వాషింగ్‌టన్ నగరానికి పాల్గొన్నారు. దానికి లూథర్‌కింగ్ నాయకత్వం వహించేడు. 1964 లో అతనికి 'నోబెల్' బహుమతి లభించింది. అబ్రహాం లింకన్, గాంధీజీ, అమెరికన్ తత్వవేత్త 'థోరియన్' లు లూథర్‌కి ఆదర్శప్రాయులు. లూథర్‌కింగ్‌కి నివాళులర్పించుటకు భారత ప్రభుత్వం ఈ స్టాంపు విడుదల చేసింది.

జననం : 15-1-1929, మరణం (హత్య) : 4-4-1968

## 84. రఫీ అహమద్ కిద్వాయ్
## (Rafi Ahmad Kidwai)

1-4-1969+Rafi Ahmad Kidwai+20 p.

రాఫీ అహమద్ కిద్వాయ్ భారతదేశ కమ్యూనికేషన్ల మంత్రిగా యుండే సమయంలో All-up scheme ని 1-4-1949 లో ప్రవేశ

పెట్టాడు. ఈ స్కీము వలన ఫస్టు క్లాసు తపాలాలు (కవర్లు, పోస్టు కార్డులు, రిజిస్టర్డు లెటర్లు, మనీఆర్డర్లు) "నైట్ ఎయిర్‌మెయిల్" సర్వీసు ద్వారా దేశంలోని మేజరు నగరాలైన కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, మద్రాసులకు నాగపూరు వద్ద బదలీ ఏర్పాటుతో సరఫరా అవుతాయి. ఈ స్కీము 20 వ ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. ఈ స్టాంపులో ఆకాశమున విమానం, ఏరోప్లేను యున్నాయి.

## 85. అంతర్జాతీయ కార్మిక సంఘం

**[International Labour Organisation I. L. O]**

11-4-1969+International Labour Organisation+20 p.

అంతర్జాతీయ కార్మిక సంఘం మొదటి ప్రపంచ యుద్ధానంతరం 15 జూన్ 1919 లో స్థాపించబడింది. ప్రపంచంలో కార్మికులకు న్యాయం చేకూర్చటం దీని ప్రధాన ఆశయం. భారత దేశం కూడ ఈ సంస్థ స్థాపనలో మెంబరు. దీని హెడ్‌క్వార్టర్సు స్విట్జర్లాండ్‌లోని "జెనీవా" నగరంలో యుంది. దీని 50 వ ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 86. జలియన్ వాలాబాగ్

**[Jallianwala Bagh]**

13-4-1969+Jallianwala Bagh+50 th Anniversary+20 p.

పంజాబులో అమృతసర్ దగ్గర జలియన్‌వాలా బాగ్ వద్ద 1919 సంవత్సరంలో 25,000 మంది ప్రజలు సభ చేయుటకు సమకూడగా, వారిని బ్రిటీషు మిలిటరీ ఆఫీసరు జనరల్ డయర్ చెదరకొట్టుటకు తన సైనికులకు ఆజ్ఞ ఇవ్వగా, వారు నిర్దాక్షిణ్యంగా వెంటాడి 379 మందిని తుపాకులతో చంపగా మరి 1200 మంది గాయాలకు గురి అయ్యేరు. ఈ కౄరత్వం మరపురానిది, అమానుషమైనదిన్ని. ఆ తరువాత ఆ స్థలంలో ప్రాణాలర్పిం

చిన వారి జ్ఞాపకార్థం ఒక స్తంభం కట్టించడం జరిగింది. స్టాంపులో అచట ప్రాణాలర్పించిన దేశభక్తులకు భారతజాతి పువ్వులను వేయుచు నివాళులర్పిస్తున్న దోసలిని చూడవచ్చును.

## 87. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

**[Kasinadhuni Nageswara Rao Pantulu]**

1-5-1969+Kasinadhuni Nageswara Rao Pantulu +20 p.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, ఇలకుర్రు గ్రామంలో 1-5-1867లో జన్మించేరు. మద్రాస్ క్రిస్టియన్ కాలేజీలో ఉన్నత విద్యాభ్యాసం పొందేరు. చిన్నతనం నుంచి కూడ ఆయనకి తన దేశ దాస్య విముక్తి చెయ్యాలని ఆయన సంకల్పం, 1908 లో "ఆంధ్ర పత్రిక" ను స్థాపించేడు. ఆయన కృషి వలన సుమారు 120 లైబ్రె రీలు స్థాపన జరిగింది. ఆయన రాజకీయవేత్త కూడ. 1923 నుంచి 1931 వరకు నాలుగు పర్యాయాలు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీకి అధ్యక్షులుగా ఎంపిక అయేరు. గాంధీజీ పిలుపు ననుసరించి "ఉప్పు సత్యాగ్రహం" ఉద్యమంలో పాల్గొని ఆంధ్రలో స్వాతంత్ర్య పోరాటానికి కృషి చేసేరు. ఈయన 1938 లో పరమపదించేరు. నాగేశ్వరరావుగారి 102 వ జన్మదినోత్సవ జ్ఞాపకార్థం ఈ స్టాంపు విడుదల అయింది.

## 88. అర్దసీర్ కర్సెట్జీ వాడియ

**[Ardaseer Cursetjee Wadia]**

27-5-1969+Ardaseer Cursetjee Wadia+20 p.

అర్దసీర్ కర్సెట్జీ వాడియా బొంబాయిలో 'లైటింగ్ బై గ్యాస్' (Lighting by Gas) ని ప్రథమంగా ప్రవేశపెట్టేడు. అంతేకాదు, భారతదేశంలో మహాసముద్రయానానికి నౌకల నిర్మాణంలో ఇతనిదే ముందంజ. ఇతన్ని 27-5-1841 లో దేశంలో శాస్త్రవిజ్ఞానాన్ని,

దేశానికి అవసరమైన నిర్మాణ కార్యక్రమాల్కి చేయూత నిచ్చి నందున "రాయల్ సొసైటీ ఆఫ్ ఇంగ్లాండు" వారు ఇతనిని "ఫెలో" గా ఎంపిక చేసి గౌరవించేరు. ఇలా గౌరవించబడిన ప్రథమ భారతీయుడితడే. దీని 128 వ అనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 89. డా॥ జాకిర్ హుస్సేన్
## [Dr. Zakir Hussain]

11-6-1969+Dr. Zakir Hussain+20 p.

డాక్టర్ జాకిర్ హుస్సేన్ ప్రముఖ విద్యావేత్త, దేశభక్తుడు. భారతదేశ మూడవ అధ్యక్షుడు. (మే 1967-మే 1969.) ఇతనికి నివాళులర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

జననం : 8-2-1897, మరణం : 3-5-1969.

## 90. గాంధీజీ శతాబ్ది
## [Gandhi Centenary]

2-10-1969+Gandhi Centenary+20 p., 75 p., 1 r., 5 r.

దేశ పిత గాంధీజీ 100 వ జన్మదినోత్సవ సందర్భంగా పై నాలుగు స్టాంపులు విడుదల అయేయి. గాంధీజీ సత్యానికి, అహింసకి 'దూత'. 20 పై. స్టాంపులో గాంధీజీ, ఆయన సతీమణి, 75 పై. స్టాంపులో గాంధీజీ, 1 రూ. స్టాంపులో ప్రఖ్యాత చిత్రకారుడు నందలాల్ బోస్ తయారుచేసిన గాంధీజీ కొయ్య విగ్రహం, 5 రూ. స్టాంపులో రాట్నంతో నూలు వడకుచున్న గాంధీజీయున్ను, సూర్యగ్రహం, కమలమున్ను యున్నాయి. సూర్యుడు, కమలం సత్యాన్ని, అహింసని తెలియచేస్తాయి.

## 91. చంద్రునిపై మానవుడు
## [Man on the Moon]

19-11-1969+Man on the Moon+20 p.

మానవుడు చంద్రునిపై 20 జూలై 1969 న కాలిడేడు. అమెరికాకు చెందిన 'నీల్ ఆరమ్‌స్ట్రాంగ్', 'ఎడ్విన్ ఆల్డ్రిన్', 'మైకేల్ కోలిన్స్' లతో కూడిన 'అపోలో 11' బృందం దీనిని సాధించింది. నీల్ ఆరమ్ స్ట్రాంగ్ చంద్రునిపై కాలిడడానికి ప్రథము డుగా ఖ్యాతి చెందేడు. ఈ కార్యసాధన జ్ఞాపకార్థం 19 నవంబరు 1969 న పై స్టాంపుని భారతదేశం విడుదల చేసింది.

ఈ స్టాంపు విడుదల తేది 'అపోలో 12' బృందం బయలు దేరిన తేదీ ఒకటే అవటం విశేషం. ఆ బృందంలో చార్లెస్ కోనార్డు, రిచర్డు గోర్డన్, ఆలన్ బీన్ యున్నారు.

## 92. గురునానక్ దేవ్
## (Guru Nanak Dev)

23-11-1969+Guru Nanak Dev+20 p.

గురునానక్ దేవ్ ప్రస్తుతం పాకిస్థాన్‌లో యున్న 'తల్వండి' (నాన్కానాసాహెబ్) లో 23 నవంబరు 1469 న జన్మించేడు. చిన్నతనం నుంచే ఆధ్యాత్మిక చింతన కలిగియుండేవాడు. తండ్రి అతని దృష్టిని మరలించేటందుకు అతని 14 వ ఏటనే వివాహం చేసేడు. కాని నానక్‌దేవ్‌లో మార్పు రాలేదు. అతి సులభంగా దేవాలయాలను దర్శించటం వలన, యాత్రలవలన భగవంతుడు లభించ డని అతడు బోధించేడు. భగవంతునియందు నిశ్చల ప్రేమ, భక్తి కలిగియుండాలని అతడు అనేక ప్రవచనాలు చెప్పేడు. ఈ స్టాంపు 'నన్కానా సాహెబ్' ను చూపిస్తుంది.

## 93. ఠక్కర్ బాప
### (Thakkar Bapa)

29-11-1969+Thakkar Bapa+20 p.

ఠక్కర్ బాప ప్రముఖ సంఘసేవా తత్పరుడు. గాంధీజీకి 'హరిజనోద్ధరణ ఉద్యమం' లో కుడి చేయిగా తోడ్పడ్డాడు. అమృత లాల్ ఠక్కర్ జన్మదినోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

జననం : **29-11-1869**, మరణం : **19-1-1951.**

## 94. సి. యన్. అన్నాదురై
### (C. N. Annadurai)

3-2-1970+C. N. Annadurai+20 p.

కంజీవరం నటరాజన్ అన్నాదురై తమిళనాడులో 'ద్రవిడ మున్నేట్ర ఖజగం' పార్టీ స్థాపకుడు. తమిళనాడు ముఖ్యమంత్రిగా **1967** నుంచి **1969** లో ఆయన మరణాంతం వరకు పదవి నలంకరించేడు. జననం : **15-9-1909**, మరణం : **3-2-1969.** ఆయన మృతినొందిన మొదటి సంవత్సర ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 95. మున్షినెవాల్ కిషోర్
### (Munshi Newal Kishore)

19-2-1970+Munshi Newal Kishore+20 p.

మున్షి నెవాల్ కిషోర్ గొప్ప విద్వాంసుడు. విద్యావేత్త. లక్నోలోని Newal Kishore Press and Book Depot వ్యవస్థాపకుడు. ఏసియాలో కెల్ల ఇదే ప్రాచీనమైన ప్రింటింగు, పబ్లిషింగ్ వ్యవస్థగా పేర్గాంచింది. సంస్కృతం, హిందీ, ఉర్దూ, పెర్షియన్ భాషలలో మొత్తం **4000** గ్రంథాలు అచ్చు వేయించేడు. వాటిలో చాలావరకు

ప్రాచీన ప్రాతప్రతులే. ఇతడు "Caxton of India" అని ప్రసిద్ధి కెక్కేడు.

జననం : **3-1-1836**, మరణం : **19-2-1895**.

ఇతని **75** వ మరణ ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 96. నలంద కాలేజి

## (Nalanda College)

27-3-1970+Nalanda College+20p.

నలంద విశ్వవిద్యాలయం కుమారగుప్త చక్రవర్తి కాలంలో (414 A. D – 455 A. D) స్థాపించబడి, బుద్ధగుప్తుని కాలంలో (475 – 500 A. D.). ఉన్నత స్థాయికి చేరుకుంది. హ్యూయాన్ స్సాంగ్ ఈ విశ్వ విద్యాలయాన్ని వర్ణించేడు. ఇది అనేక అంతస్థులు గల మేడలతోను, అనేక మార్గాలు కలిగిన తోటలతోను ఎంతో అందంగా యుండేది. టర్కో ఆఫ్గన్ దాడుల వలన ఈ ప్రఖ్యాత విశ్వవిద్యాలయం నేలమట్టమయింది.

బీహారులో ప్రస్తుతం యున్న నలందా విశ్వవిద్యాలయం **1870** లో ప్రథమంగా బీహారు హైస్కూలుగా స్థాపితమయింది. కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి మొదటి బ్యాచి విద్యార్థులు **1871** లో ఇక్కడికి వచ్చేరు.

నలందా కాలేజి (బీహార్ షారిఫ్) మార్చి **1970** లో శత జయంతి వార్షికోత్సవ సందర్భంగా పై స్టాంపు విడుదల అయింది..

## 97. స్వామి శ్రద్ధానంద్

## [Swami Shraddhanand]

30-?-1970+Swami Shraddhanand+20 p.

ఉత్తరప్రదేశ్ లో హరిద్వార్ సమీపంలో "కన్కి" వద్ద స్వామి శ్రద్ధానంద్ ఒక గురుకులాన్ని స్థాపించేడు. ఇతడు దేశ

భక్తుడు, తపస్వి. గాంధీజీకి "మహాత్మ" బిరుదు ఇచ్చినది ఈ గురు కులమే. స్వామి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని ఒక హంతకుని చేతిలో మృతి నొందేడు. ఇతనికి నివాళులర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

జననం : **1856**, మరణం : **23-12-1926**.

## 98. షేర్షా
### [Sher Shah]

22-5-1970+Sher Shah+20 p.

పోస్టల్ చరిత్రలో షేర్షా పేరు స్వర్ణాక్షరాలతో లిఖించాలి. షేర్షా దేశ వ్యాప్తంగా పోస్టల్ సర్వీసుకు అంకురార్పణ చేసేడు. ఉత్తర భారతంలో అనేక ట్రంకు రోడ్లు నిర్మించి, గుర్రాలపై అంచ తపాల పద్ధతిని ప్రవేశపెట్టేడు. రోడ్ల ప్రక్క షరాయ్‌లను నిర్మించి గుర్రముల మార్పుకు తోడ్పడేడు. బెంగాలు నుంచి పంజాబులోని లాహోరు వరకు 'గ్రాండ్ ట్రంకురోడ్డు' నిర్మాణం ఇతని రోడ్డు నిర్మాణ కృషికి తార్కాణం. బిహారులో షేర్షా యొక్క వైభవమైన మాసోలియం ససారామ్ వద్ద యుంది.

జననం: **1472/1486**, మరణం : **22-5-1545**. ఇతని **425** వ మరణ అనివర్సరీ సందర్భంగా ఇతనిని గుర్తు చేయుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

## 99. వి. డి. సావర్కార్
### (V.D. Savarkar)

28-5-1970 + V. D. Savarkar + 20 p.

వినాయక్ దామోదర్ సావర్కార్ చిత్పవన్ బ్రాహ్మణ కుటుంబంలో నాసిక్ దగ్గరలోయున్న భాగూర్ గ్రామంలో **1857**లో

జన్మించేడు. ఈ బ్రాహ్మణ కుటుంబంలోనే ప్రఖ్యాత వీరులు నానా సాహెబ్, లోకమాన్య తిలక్ కూడ జన్మించేరు. సావర్కార్ జన్మతోనే దేశ భక్తుడు. 1904లో తాను ఇంకా పట్టభద్రుడు కాక పూర్వమే ఫెర్గూసన్ కాలేజీలో తనతో చదువుతున్న కొందరు విద్యార్థులను ప్రోగుచేసి ఇండియా బ్రిటిషు పాలనను అవసరమైతే ఆయుధాలతో అంతం చెయ్యాలని ప్రతిజ్ఞ చేసేడు.

1905లో పట్టభద్రుడు కాగానే స్కాలర్‌షిప్ సంపాదించి ఇంగ్లాండులో "గ్రేస్‌ఇన్"లో ప్రవేశం సంపాదించేడు. త్వరలో "ఫ్రీ ఇండియా సొసైటీ"ని లండన్‌లో స్థాపించేడు. "అభినవభారత్" అనే రహస్య ఉద్యమానికి మెంబర్లని చేకూర్చేడు. భారతదేశంలో స్వాతంత్ర్య పోరాటం ఉధృతం అవటంతో ఈ ఉద్యమానికి ఉద్వేగం పుట్టింది. 1909లో "అభినవ భారత్‌లోని సభ్యుడు మదన్‌లాల్ ధిన్‌గారా 'ఇంపీరియల్ ఇన్‌స్టిట్యూట్' హాలులో 'కర్జన్ విల్లీ'ని తుపాకితో కాల్చి చంపేడు. దానితో బ్రిటిషు ప్రభుత్వం సావర్కార్‌ని అనుమానించేరు. దాని ఫలితంగా 'గ్రేస్ ఇన్'లో తన పరీక్ష ప్యాసు అయినప్పటికీ సావర్కార్‌కి 'డిప్లమా' ఇవ్వలేదు. దీనికి కారణం సావర్కారికి కర్జన్ విల్లీ ఉదంతంలో తనకు ప్రమేయం లేదని వ్రాత మూలకంగా ఇవ్వక పోవటమే! 'First war of Independence' అనే పుస్తకంలో 1857 సంవత్సరం తిరుగుబాటు గురించి వ్రాసేడు. దానిని బ్రిటిషువారు హస్తగతం చేసుకున్నారు.

1910లో సావర్కార్ని లండన్‌లో "నాసిక్ కాన్స్పిరెసి" కేసు సందర్భంలో అరెస్టు చేసేరు. ఇండియాకు విచారణ నిమిత్తం తీసుకవస్తూ యుండగా మార్షియల్స్ వద్ద సముద్రంలోకి సావర్కార్ దూకి ఈదుతూ యుండగా షిప్ నుండి తూటాలు పేంటాడుతున్నా ఫ్రెంచి తీరాన్ని చేరుకున్నాడు. మార్షియల్స్‌లో బ్రిటిషు పోలీసువారు సావర్కార్ని అరెస్టు చేసేరు. ఇంటర్నేషనల్ కోర్టులో బ్రిటిషువారు

అతనిని ఫ్రెంచి నేలపై అరెస్టు చేయడాన్ని నిరసన తెలిపినా ఫలితం లేకపోయింది. ఈ సంఘటనతో ప్రపంచమంతటా భారతదేశ స్వాతంత్ర్య పోరాటం గురించి విదితమయింది. **1910**లో సావర్కార్‌కు **50** సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధింపబడింది. అండమాన్ దీవులలో **12** సంవత్సరాలు కఠిన శిక్ష అనుభవించేక **1924**లో రత్నగిరి జైలుకి తీసుక రాబడ్డాడు. అప్పటినే **1937** వరకు యున్నారు. జైలునుంచి ఆ సంవత్సరంలో విడుదల అవగానే "హిందూ మహాసభ"లో చేరేడు. ఏడు సంవత్సరాలు ఆ సంస్థకు అధ్యక్ష పదవికి ఎన్నిక అయేడు. అస్పృశ్యతా నిర్మూలనకు ఈ సంస్థ ద్వారా పాటుబడ్డాడు. "పతిత్ పావన్ మందార్" అనే 'పతితుల దేవాలయం' కట్టించి దానికి హరిజనుణ్ణి అర్చకునిగా నియమించేడు. ఇండియా విభజనకు సావర్కార్ వ్యతిరేకించేడు. క్రిప్స్‌మిషన్, వేవెల్ ప్లానులలో పాల్గొన్నాడు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చేక **1951**లో అభినవ భారత్'ను రద్దు చేసేడు. **1966**లో ఫిబ్రవరి **26** వ తేదీన ఈ స్వాతంత్ర్య యోధుడు దైవ సాన్నిధ్యాన్ని పొందేడు. సావర్కార్ **87** వ జన్మదినోత్సవ గుర్తుగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 100. U. N. 25 వ ఆనివర్సరీ
### (U. N. XX V Anniversary)

26-6-1970 + U. N. XX V Anniversary + 20 p.

యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ 25వ ఆనివర్సరీ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. ప్రపంచంలో వివిధ దేశాల మధ్య సామరస్యం, శాంతి నెలకొల్పడాన్కి చేసిన ప్రయత్నాలు చాలావరకు విజయవంతాలయేయి.

## 101. జతీంద్రనాథ్ ముఖర్జీ
## (Jatindra Nath Mukharjee)

9-9-1970 + Jatindra Nath Mukharjee + 20 p.

జతీంద్రనాథ్ ముఖర్జీ గొప్ప దేశ భక్తుడు. భారతదేశ దాస్య విముక్తికి తిరుగుబాటు తప్ప వేరే గత్యంతరం లేదని నమ్మేడు. **1915**లో జర్మన్ ఆయుధాలు, ధనం సంపాదించి అతని సహచరులతో ఒరిస్సాలోని బాలసోరు వద్ద బ్రిటిషు వారిపై తిరుగుబాటుకు అన్నీ సిద్ధం చేసేడు. కాని ఈ ప్లాను బ్రిటిషు వారికి తెలిసింది. బ్రిటిషు పోలీసులతోను, సైన్యంతోను బాలసోరు వద్ద పోరాటంలో ప్రాణాలు పోగొట్టుకున్నాడు. ఇతడు 'బాఘ్-జాటిన్' (Bagh-Jatin)గా ప్రసిద్ధి చెందేడు. అతని చిన్నతనంలో ఒక పులిని కత్తితో పొడిచి చంపి ఆ పేరు తెచ్చుకున్నాడు. ఇతనికి నివాళులర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

జననం : డిసెంబరు **1879**, మరణం : **10-9-1915**.

## 102. కలకత్తా పోర్టు
## (Calcutta Port)

29-10-1970 + Calcutta Port Commissioners + 20 p.

**1690** ప్రాంతంలో ఈస్టు ఇండియా కంపెనీయొక్క ఇంగ్లీషు ఏజంటు జాబ్ చార్నక్ (Jab Charnak) కలకత్తా నగరాన్ని స్థాపించేడు. బెంగాలు సిరిసంపదలు విదేశ వ్యాపారస్థుల్ని ఆకర్షించేయి. వారు ఔరంగజేబుని **1690**లో బెంగాలులో ఇంగ్లీషు సెటిలుమెంటుకి అనుమతి సంపాదించేరు. ఆ సెటిలుమెంటు కలకత్తా నగరాభివృద్ధికి తోడ్పడింది. ప్రస్తుతం యున్న అధునాతన పోర్టు **19**వ శతాబ్దం

మధ్యలో నిర్మాణం ప్రారంభమయింది. 1870 నుండి కలకత్తా పోర్టు 'అధికార, అనధికార' సభ్యులతో కూడిన "కమిషనర్స్ ఫర్ ది పోర్ట్ ఆఫ్ కలకత్తా" అనే సంస్థచే పరిపాలించబడింది. దీన్ని స్థాపించిన శత సంవత్సరాబ్ది సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 103. జామియ మిల్లియ ఇస్లామియ
**[Jamia Millia Islamia]**

29-10-1970 + Jamia Millia Islamia + 29 p.

1920 సంవత్సరంలో ఉత్తరప్రదేశ్‌లోని అలీఘర్ వద్ద "జామియా మిల్లియా ఇస్లామియా" 'ఖిలాఫత్', 'సహాయ నిరాకరణ' ఉద్యమాలకు ఊతనిచ్చేటందుకు స్థాపించబడింది. 1925లో జామియా ఢిల్లీకి తరలించబడింది. జామియా మిల్లియా "ఇండియా ఒక గొప్ప జాతి" అన్న ఉద్యమాన్ని పోషించింది. 1970లో ఈ సంస్థ స్వర్ణోత్సవం జరుపుకుంది. ఆ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 104. ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ
**[Indian Red Cross Society]**

5-11-1970+Indian Red Cross Society. 50th Anniversary+ 20 p.

1920 సంవత్సరంలో ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ భారత దేశంలో స్థాపించబడింది. దీని స్వర్ణోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది. ఆరోగ్యం, వ్యాధి నిరోధక చర్యలు, బాధితుల నాదుకోవటం ఈ సంస్థ ముఖ్యాశయాలు. ఇవిగాక వరదలు, అగ్ని,

భూకంపాలు, ఆహార కొరతల సమయాల్లో ఆదుకోవటం కూడ చేపట్టింది.

## 105. కాశీ విద్యాపీఠ

**(Kasi Vidyapith)**

10-2-2971 + Kashi Vidyapith + 20 p.

**10-2-1921**న 'సహాయ నిరాకరణ' ఉద్యమ రోజుల్లో 'కాశీ విద్యాపీఠ్'ని గాంధీజీ ప్రారంభోత్సవం చేసేరు. ఆ ఉద్యమా న్ననుసరించి, ప్రభుత్వ కళాశాలలలో విద్యార్థులు పాల్గొనటాన్ని నిర సించటం, ప్రభుత్వ ఆధీనంలోలేని హిందీ మాతృభాషగా గల ఇతర సంస్థల్ని ప్రోత్సహించాలని తీర్మానించబడింది. విద్యార్థులలో జాతీయాభిమానాన్ని పెంపొందించాలన్నది దీని ముఖ్యాశయం. దీని స్వర్ణోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

## 106. జనాభా లెక్కల శతాబ్ది

**(Census Centenary)**

10-3-1971 + Census centenary + 20 p.

భారతదేశంలో మొదటిసారి జనాభా లెక్కలు **1871-72**లో పూర్తి అయేయి. అప్పటినుంచి ప్రతి **10** సంవత్సరాల కొకసారి ఈ జనాభా లెక్కలు (Census) తయారవుతున్నాయి. **1971**వ సంవ త్సర జనాభా లెక్క **10**వది. ఈ సందర్భంలో ఈ స్టాంపు ముద్రించటం జరిగింది.

## 107. దాదా సాహెబ్ ఫాల్కే
### (Dadasaheb Phalke)

30-4-1971+Dadasaheb Phalke+20 p.

దాదాసాహెబ్ ఫాల్కే భారతీయ ఫిలిం పరిశ్రమ స్థాపకులలో ప్రథముడు. సినీమాటోగ్రాఫిక్ కళను ఇండియాలో స్థాపించటం అతని కృషియే అని చెప్పుకోవాలి. అంతేగాక ఫాల్కే మన దేశంలో మొదటి ఫిలిమ్ డైరెక్టరు కూడ. ఇతనికి నివాళులర్పించుటకు ఈ స్టాంపు విడుదల అయింది.

జననం : **30-4-1870,** మరణం : **1944.**

## 108. అబనీన్ద్రనాథ్ టాగోర్
### (Abanindranath Tagore)

7-8-1974+Abanindranath Tagore+20 p.

అబనీన్ద్రనాథ్ టాగోరు ప్రఖ్యాత పెయింటరు. స్వదేశీ విదేశీ కళల మిళితానికి కృషి చేసేడు. స్టాంపులో కాళిదాసు రచించిన "ఋతు సంహారం" లోని ఒక శ్లోకాన్ని విపులం చేసే 'అభిసారిక' అనే పెయింటింగుని చూడవచ్చు.

జననం : **7-8-1871,** మరణం : **1951.**

## 109. స్వామి విర్జానంద్
### (Swami Virjanand)

14-9-1971+ Swami Virjanand+20 p.

**1778** లో జలంధర్ సమీపంలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో స్వామి విర్జానంద జన్మించేడు. అయిదవ ఏట అమ్మవారు వచ్చి

గ్రుడ్డివాడయేడు. తండ్రి సంస్కృత పండింతుడు కాబట్టి సంస్కృతంలో విర్జానంపకి అనేక గ్రంధాలు నేర్పించేడు. కాని దురదృష్ట వశాత్తు చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయేడు. తన అన్నగార్లు, వదినెలు అతనిని కష్టాపంగా చూడటంతో విర్జానంద ఇల్లు వదలి గంగాతీరం చేరి, క్రమంగా ఋషికేశ్, హరిద్వార్ చేరేడు. హరిద్వార్‌లో స్వామిపూర్ణానంద్ వారిని కలసి సన్యాసం పుచ్చుకున్నాడు. అతని వద్ద సంస్కృత వ్యాకరణం అభ్యసించేడు. తరువాత విర్జానంద విద్యలకు నిలయమైన కాశీలో పది సంవత్సరాలు గడిపేడు. ఆ కాలములో అనేక మంది విద్యకు ఆకర్షితులై అతని వద్దకు చేరేరు. అనేక యాత్రలు చేసుకుని కలకత్తా చేరుకున్నాడు. అప్పట్లో సంస్కృత పండితులు అచ్చట యుండేవారు. భక్తిశ్రద్ధలతో అచ్చటి ప్రజలు అతనిని ఆదరించినా గంగానదీ తీరానయున్న 'గాడియా ఘాట్' కు వెళ్ళేడు. రాజస్థాన్‌లోని ఆల్వారు మహారాజు అతనిని బ్రతిమాలి ఆల్వారుకు తీసుక వెళ్ళేడు. అచ్చట స్వామీజీ 'శబ్దభోధ్' (wrisdom of Sound) అనే గ్రంధాన్ని వ్రాసేడు. అది నేటికీ ఆల్వార్ లైబ్రరీలో యుంది.

ఆల్వారు నుండి స్వామిజీ 'మధుర' వెళ్ళి బీద విద్యార్థులకు పాఠశాల నిర్మింప చేసేడు. రాజపుత్ర కుమారులు ఆ నిర్మాణానికి విరివిగా విరాళాలు ఇచ్చేరు. ఇక్కడ మధురలోనే స్వామిదయానంద సరస్వతిని తన ముఖ్య శిష్యునిగా తీసుకున్నాడు. తనకు 'గురు దక్షిణ' గా దయానంద సరస్వతిని హిందూమతాన్ని వేదములలో చెప్పిన ప్రకారం ప్రచారం చేసి భారతదేశ ఔన్నత్యానికి పాటు పడమని కోరేడు. తన 90 వ ఏట స్వామి విర్జానంద 14 సెప్టెంబరు 1868 లో దివంగతుడయేడు.

## 110. యునెస్కో 25 వ వార్షికోత్సవం
## (U.N.E.S.C.O. 25 th Anniversary)

4-11-1971+U.N.E.S.C.O. 25 th Anniversary+20 p.

అవలోకితేశ్వర పద్మపాణి (దయాపూరిత బోధిసత్వుడు) క్రీస్తుశకం 5 వ శతాబ్దం నాటి అజంతా గుహలలో అవలోకితేశ్వర పద్మపాణి శిల్పం చాలా అందమైనది. బోధిసత్వుని అనేక అవతారాలలో 'అవలోకితేశ్వర పద్మపాణి' ముఖ్య బోధిసత్వుడు. స్టాంపులో రాజకుమారుడు కిరీటాన్ని రాజరికపు గుర్తుగా ధరించేడే గాని, ఈ ప్రపంచానికి సంబంధించిన రాజకుమారుడు కాడు. అతడు ఆత్మ సంబంధమైన జ్ఞానానికి (Spirutual enlightenment) రాజకుమారుడు. భిక్షపాత్ర చేపట్టిన సన్యాసి కాదు. జ్ఞాన చిహ్నమైన "నీలపద్మా"న్ని చేపట్టియున్నాడు. కొద్దిగా వొంపుయున్న అతని శరీరం, చేతి సంజ్ఞ బాధలుపడే ప్రపంచం యెడల కారుణ్యాన్ని తెలియజేస్తాయి. అతని ముఖం నుండి ప్రకాశవంతంగా వెలువడే శాంతి, ప్రేమ, ధర్మం అసమాన్యాలు. అజంతా గుహలలోని చిత్రాలు క్రీస్తుపూర్వం 2 వ శతాబ్దం, 1 వ శతాబ్దం నాటివి. బౌద్ధ సన్యాసులు ఆ గుహల గోడలపై వాటిని చిత్రించేరు. ఆ గుహలే వారి ఆశ్రమాలు. U. N. E. S. C. O. వారు బుద్ధుని జీవిత విశేషాల్ని తెలియచేసే అనేక చిత్రాలను ఒక ఆల్బంలో చేర్చేరు. అనేక జన్మలలో బోధిసత్వునిగా బుద్ధుడు జన్మించేడు. నేడు ఈ ప్రాంతం వంటరిగా వఘోరానది ప్రవహిస్తూ యుండే ఒక సన్నని గోర్జిగా పశ్చిమపీఠ భూమిలో యుంది.

## 111. రిఫ్యూజి రిలీఫ్

## (Refugee Relief)

15-11-1971+Refugee Relief+5 p.

1971 ఏప్రిల్ నుంచి తూర్పు పాకిస్థాన్ మిలిటరీ ప్రభుత్వ దౌర్జన్యానికి గురైన ప్రజలు భారతదేశ సరిహద్దు రాష్ట్రాలలోకి ఎక్కువ సంఖ్యలో ప్రవేశించటం ప్రారంభం అయింది. అక్టోబరు 1971 నరికి వీరి సంఖ్య 10 మిలియనులకు చేరింది. భారత ప్రభుత్వానికి వీరిని ఆదుకోవటం పెద్ద సమస్య అయింది ఈ శర ణార్థులకు అంతర్జాతీయ సహాయం నామ మాత్రమే. అందుచేత భారత ప్రభుత్వం 15 నవంబరు 1971నుంచి అన్ని పోస్టుకార్డులు, కవర్లు, మని ఆర్డర్లు, టెలిగ్రాములకు ప్రతి ఒక్క దానికి 5పై చొప్పున టాక్సు విధిస్తూ 'రిఫ్యూజీ రిలీఫ్ ఫండ్' ఏర్పరచింది. ఈ వసూలైన మొత్తం సొమ్ము అంతా ధర్మానికే కేటాయించటంతో ఈ రిఫ్యూజీ స్టాంపు 'చారిటీ స్టాంపు' (Charity Stamp) అయింది. భారతదేశంలో మొదటి "చారిటీ స్టాంపు" ఇదే. రిలీఫ్ స్టాంపుల్ని ముద్రించే లోగా డెఫినిటివ్ సిరీసులోని 5 పై 'ఫామిలీ ప్లానింగు' స్టాంపులపై 'Refugee Relief' అని ఓవరు ప్రింటు చేసేరు. ఆ స్టాంపుల స్టాకు అయిపోయేక Map of India 5 పై స్టాంపుపై ఓవరు ప్రింటు చేసేరు. తూర్పు గోదావరిజిల్లాలో 3 న.పై. (Map of India) యున్ను, 2 పై. విద్ది స్టాంపుల రెండింటిని కలిపి 5 పైసలుగా ఉప

యోగించడం జరిగింది. తరువాత 1-12-1971 న రిగ్యులరు 'రిఫ్యూజీ రిలీఫ్' స్టాంపులు తలపై మూటలతో నడుస్తున్న శరణార్థు లతో ముద్రించేరు. ఈ స్టాంపు గులాబి ఎరుపు రంగుది. ప్రభుత్వ కార్యాలయాలు కూడ ఈ రిలీఫ్ స్టాంపులు ఉపయోగించాలని ఆదే శించబడ్డాయి. 1972 జనవరి నుంచి 5 పైసల 'Service' స్టాంపులు కూడ ముద్రించేరు.

## 112. విశ్వభారతి

**[Viswa Bharati]**

24-12-1971+Viswa Bharati+20 p.

విశ్వభారతి ఎలా ఏర్పడిందో తెలుసుకోవలసిన విషయం. 1863 లో రవీంద్రనాథ్ టాగోరు తండ్రి అయిన మహర్షి దేవేంద్ర నాథ్ టాగోరు కలకత్తాకు సుమారు వంద మైళ్ళ దూరంలో 'శాంతి నికేతన్' ఆశ్రమాన్ని స్థాపించేడు. 1900 లో రవీంద్రనాథ్ టాగోరు 5 గురు విద్యార్థులతో అచ్చట ఒక (expermental) పాఠశాలను ప్రారంభించేడు. 1912 లో సి. ఎఫ్. ఆండ్రూస్, డబ్ల్యూ. డబ్ల్యూ. పియర్సన్ భారతదేశంపై వారికి గల అభిమానం వలన ఆ పాఠ శాలలో పని చేసేరు. 1918 లో రవీంద్రనాథ్ టాగోరు జపాను, అమెరికాల పర్యటనానంతరం దానిని ప్రాగ్ నాగరికత (Cultures of the East) కేంద్రంగా మార్పు చేసేడు. అదే సమయంలో దీనికి

"విశ్వభారతి" అనే పేరు వచ్చింది. డిసెంబరు 1921 లో 'విశ్వ భారతి' కి ప్రారంభోత్సవం జరిగింది. బౌద్ధ వాఙ్మయం, వేదాధ్యయనం, సంస్కృతం, పాళి, ప్రాకృతం, సంగీతం, చిత్రలేఖనం. వీటిలో ఉన్నత విద్యాభ్యాసం ధ్యేయం గలిగినదై ఈ సంస్థ ప్రసిద్ధి కెక్కింది. అప్పటి చిత్రలేఖన ఉపాధ్యాయుడు ప్రఖ్యాత చిత్రకారుడు నందలాల్ బోస్. 1951 లో విశ్వభారతి జాతీయ సంస్థగా భారత దేశ పార్లమెంటు ఆమోదం పొందింది. 1971 లో విశ్వభారతి స్వర్ణోత్సవ సందర్భంగా ఈ స్టాంపు విడుదల అయింది.

ము గిం పు

ఇంతవరకు స్టాంపు కలెక్షన్ ప్రాముఖ్యం తెలియచేస్తూ పాతిక ఏళ్ళలో విడుదల అయిన (1947-1972) భారతదేశ స్టాంపుల విశిష్టత, విశేషాలు మాత్రమే మీ ముందు యుంచగలిగేను. ఈ స్టాంపుల ప్రపంచం అంతులేనిది. ప్రతీ సంవత్సరం ముద్రించే ఈ స్టాంపుల చరిత్ర ఇంతటితో ఆగదన్న విషయం చదువరులు గ్రహింతురు గాక—



— శు భం —

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 21 | నరసింహమెహత | స్వామిశ్రద్ధానంద్ |
| 21 | 1,3,9 | బురూలు | బ్యూరోలు |
| 48 | 22 | విల్‌యట్ | విల్‌మట్ |
| 51 | 25 | ahappy | a happy |
| 52 | 10 | 300 | **3**00 |
| 57 | 17 | "పూరిచి" | "పూంచి" |
| 61 | 17 | వద్వాన్ | వధ్వాన్ |
| 64 | 10 | కవెక్షమన | కలెక్షనుని |
| 64 | 12 | సుభానీ | సుఖాని |
| 66 | 11 | స్థోనంలో | స్థానంలో |
| 75 | 11 | గోవ్‌గుంబాద్ | గోల్‌గుంబాజ్ |
| 75 | 13 | నరసింహమెహత | స్వామిశ్రద్ధానంద్ |
| 82 | 15 | విశ్వాసానికి | విశ్వానికి |
| 82 | 20 | ఆదిల్‌భా | ఆ దిల్‌షా |
| 89 | 24 | 4 1/2 a | $4\frac{1}{2}$a |
| 91 | 18 | 25-5-1945 | 25-4-1945 |
| 91 | 22 | వేల్ సక్సెస్ | వేక్ సక్సెస్ |
| 100 | 23 | 25-12-1962 | 25-12-1961 |
| 101 | 3 | 1-4-1962 | 1-1-1962 |
| 104 | 16 | "The Defend" | "They Defend" |
| 107 | 13 | "బ్రహ్మసమాజ్" | "బ్రహ్మోసమాజ్" |
| 120 | 20 | స్గానం | స్థానం |
| 122 | 14 | అగికి | అగ్నికి |